పోతన తెలుగు భాగవతాంతర్గత

# 16.శ్రీకృష్ణ లీలలు-3

## వత్సాసుర వధ - కాళిందీ మర్ధనాది

## [ప్రజాకవి బమ్మెఱ పోతనామాత్య ప్రణీతము]

సంకలనం

భాగవత గణనాధ్యాయి

సౌజన్యం

https://telugubhagavatam.org/

*2024*

# విషయసూచిక

# <u>పూర్వ పీఠిక</u>

పోతన తెలుగు భాగవతం ప్రసాదించిన మన పోతన్నగారు అలతిపొలతి పదాలతో మన నల్లనయ్య మెలగుటలో◌ిమెఱుపు లను వర్ణిస్తూ మనలను మైమరపిస్తాడు. మన స్థాయీ బేధానుసారం సారమందేలా అనుగ్రహించారు. కనుకనే శ్రీకష్ణలీలలు ఆబాల గోపాలమూ అందరికీ బహు ఇష్టమైనవే మరి. ఆ అమృత సోనలలో కృష్ణమూర్తివారు వ్రేపల్లె వీడి బృందావనానికి జేరిన పిమ్మట ఆరంభ మగు లీలలు ఇప్పుడు భాగవత బంధువులారా! ఆశ్వాదిద్దాము రండి.

వ్రేపల్లెలో ఉండగా గోపగోపికలు అందరూ శ్రీకృష్ణుని శైశదశ నుండి బ్రహ్మానందం అనుభవిస్తున్నారు. కాని, ఎన్నెన్నో అమానుష అపాయాలు రావడం, నల్లనయ్యలీలలు ఎంతలాదాటిస్తున్నా, వారికి బాలుని క్షేమంగురించి లోలోన ఆందోళన పెరిగిపోసా గింది. అందుకని, ఉపనందు డను పుణ్య గోపాలుని సూచనమేరకు బృందావనానికి స్వామిని తీసుకుని వలస పెళ్ళిపోయారు. ఎక్కడకు తీసుకెళ్తేమాత్రం తనొొచ్చిన ధ్యేయానికి ఎట్టి అవరోధాలు సాధ్యం కాదు కదండి.

మరి కృష్ణభగవానుని అన్న బలరామునితోతో ఇతర గోపబాలుర తోకూడి ఆవు దూడలను మేపుకు రమ్మని పంపుతున్నారు. అలా ఆనందంగా జరుగుతుంటే ఒక రాక్షసుడు అందమైన దూడలాగ వచ్చి మందలో దూరి మెలగసాగాడు. నల్లనయ్య కనుమార్చడం ఎవరికి సాధ్యం. తగినవిధంగా శిక్షి స్తారు అన్నదమ్ములు ఇద్దరు. పిమ్మట తాటితోపులో విఱ్ఱవీగుతున్న ధేనుకాసురుని బలరామునిచేత శిక్షి ంపజేస్తాడు.పిమ్మట, మాహాద్భుతమైన ఆఖ్యానము కాళిందీమర్దనం.

ఈ అద్భుత శ్రీకృష్ణలీలలు ఆస్వాదిద్దాం రండి. మిత్రులారా.

~ భాగవత గణనాధ్యాయి.

---

వక్రతుండ మహాకాయం
సూర్యకోటి సమప్రభం।
నిర్విఘ్నం గురుమేదేవ
సర్వకార్యేషు సర్వథా॥

---

శ్రీరామ

# 16.శ్రీకృష్ణ లీలలు-3

## వత్సాసుర వధ కాళిందీ మర్ధనాది

### ప్రార్థన

10.1-1-క. *



శ్రీకంఠచాప ఖండన!
పాకారిప్రముఖ వినుత భండన! విలస
త్కాకుత్థ్సవంశమండన!
రాకేందు యశోవిశాల! రామనృపాలా!

టీక:- శ్రీకంఠచాపఖండన = శ్రీరామ {శ్రీకంఠ చాప ఖండనుడు - శ్రీకంఠుని (శోభాకర కంఠుడు యైన శివుని) చాప (విల్లును) ఖండనుడు (విరిచినవాడు), రాముడు}; పాకారిప్రముఖ వినుత భండన = శ్రీరామ {పాకారి ప్రముఖ వినుత భండనుడు - (పాకాసురుని శత్రువైన ఇంద్రుడు) మున్నగువారి చేత వినుత (పొగడబడిన) భండన (యుద్ధము కలవాడు), రాముడు}; విలసత్కాకుత్థ్స వంశ మండన = శ్రీరామ {విలసత్కాకుత్థ్స వంశ మండనుడు - విలసత్ (ప్రసిద్ధి కెక్కిన) కాకుత్థ్సవంశ (కకుత్థ్స మహారాజ వంశమునకు) మండనుడు (అలంకారమైనవాడు), రాముడు}; రాకేందు యశోవిశాల = శ్రీరామ {రాకేందుయశోవిశాలుడు - రాకేందు (నిండు పున్నమి చంద్రుని) వంటి యశః (కీర్తి) విశాలుడు (విరివిగా కలవాడు), రాముడు}; రామ = రాముడు అనెడ {నిండుపున్నమి చంద్రుని పదహారు కళలు - 1అమృత 2మానద 3పూష 4తుష్టి 5పుష్టి 6రతి 7ధృతి 8శశిని 9చంద్రిక 10కాంతి 11జ్యోత్స్న 12శ్రీ 13ప్రీతి 14అంగద 15పూర్ణ 16పూర్ణామృత}; నృపాల = రాజా.

భావము:- శ్రీరామచంద్ర ప్రభు! నీవు క్షీరసాగరమథన సమయంలో పుట్టిన హాలాహలమును కంఠమున ధరించుట ద్వారా లోకాలు సమస్తమునకు శోభను అనుగ్రహించిన శివుని ధనుస్సు విరిచిన మొనగాడవు. ఇంద్రుడు మొదలైన దేవతలు సైతం కీర్తించేలా యుద్ధం చేసిన వాడవు. ప్రసిద్ధమైన కాకుత్థ్స వంశానికి అలంకారమైన వాడవు. నిండు పదహారు కళల పూర్ణచంద్రుని లాంటి కీర్తి మెండుగా వ్యాపించిన వాడవు. ప్రజలకి ఆనందం పంచే మహారాజువి.

## బృందావనమునకు బోవుట

10.1-425-వ.

అని పలుకు నుపనందుని పలుకుల కార్యులైన గోపకు
"లిదియ కార్యంబు మందల"యని కొందల మందక
యాలమందల నమంద గమనంబున ముందఱ నడవం
బనిచి పిఱుందం గ్రందుకొనకుండ, బాల వృద్ధ నారు
లెక్కిన తేరులు సాగించి తారు తను త్రాణ తూణీర
బాణధరులై విండ్లు బట్టుకొని నడవ, బండ్ల వెనుకం
గొమ్ము లిమ్ములం బూరించుచు నవార్యంబులగు తూర్య
రవంబులు సెలంగ, నార్య, పురోహిత సమేతులై వేడుకలు
కొనలు నిగుడ మొన లేర్పఱచుకొని పావనం బగు
బృందావనం బునకుం జని రప్పుడు.

టీక:- అని = అని; పలుకు = చెప్పెడి; ఉపనందుని = ఉపనందుని యొక్క; పలుకుల్ = మాటల; కున్ = కు; ఆర్యులు = పెద్దలు; ఐన = అయిన; గోపకులు

**= యాదవులు; ఇదియ = ఇదే; కార్యంబు = మన కర్తవ్యము; మందలన్ = మన ఊరికి; అని = అని; కొందలము = సంకటములు; అందక = పడక; ఆలమందలన్ = పశువుల గుంపును; అమంద = నడిగల; గమనంబులన్ = నడకలతో; ముందఱన్ = ముందు; నడవన్ = నడవవలెనని; బనిచి = పంపించి, నియమించి; పిఱుందన్ = వెనుకనే; క్రందుకొనకుండన్ = సందడిచేయకండ; బాల = చిన్నపిల్లలు; వృద్ధ = ముసలివారు; నారులు = స్త్రీలు; ఎక్కిన = అధిరోహించిన; తేరులు = బండ్లు, రథములు; సాగించి = నడిపించి; తారు = తాము; తనుత్రాణ = కవచములు; తూణీర = అమ్ములపొదులు; బాణ = అమ్ములు; ధరులు = ధరించినవారు; ఐ = అయ్యి; విండ్లున్ = విల్లులను; పట్టుకొని = చేతులలో పట్టుకొని; నడవన్ = నడుస్తుండగా; బండ్ల = బండ్లు; వెనుకన్ = వెనకాతల; కొమ్ములు = కొమ్ముబూరాలు; ఇమ్ములన్ = గట్టిగా; పూరించుచున్ = ఊదుచు; అనివార్యంబు = అడ్డగింపరానివి; అగు = ఐన; తూర్య = వాద్యముల; రవంబులున్ = ఘోషలు, ధ్వనులు; ఆర్య = పెద్దలు; పురోహిత = పురోహితులు; సమేతులు = కూడినవారు; ఐ = అయ్యి; వేడుకలు = ఉత్సాహములు; కొనలునిగుడన్ = అతిశయించుచుండగా; మొనలు = నాయకులను, బారులు; ఏర్పఱచుకొని = నియమించుకొని, తీర్చి; పావనంబు = పరిశుద్ధమైనది; అగు = ఐన; బందావనంబున్ = బృందావనమున; కున్ = కు; చనిరి = వెళ్ళిరి; అప్పుడు = అప్పుడు.**

**భావము:-** ఉపనందుడిలా చెప్పగానే పెద్దలూ పూజ్యులైన గోపకులు అందరూ అంగీకరించారు ఒక క్రమపద్ధతిలో ముందుగా ఆవుల మందలను వేగంగా బృందావనానికి తోలించారు. వాటికి రక్షగా వెనుకనే వారి బండ్లు బయలుదేరాయి. వాటిలో బాలకులు స్త్రీలు వృద్ధులు పయనించసాగారు. వాటి పక్కనే గోపాలురు కవచాలు, ధనుర్బాణాలు, అమ్ములపొదులు పట్టుకుని బయలుదేరారు. బండ్లకు వెనుకగా బాకాలు తూర్యములు మ్రోగుతూ ఉండగా

**పూజ్యులైన పురోహితులు వెంట నడువగా పల్లెలోని మిగిలినవారు అందరూ బయలుదేరారు. అలా గుంపులు గుంపులుగా ఈ మొత్తం అంతా ఉత్సాహంతో బృందావనానికి బయలుదేరారు.**

**10.1-426-త.**

**పసుపు లాడి యురోజకుంకుమ పంకశోభితలై లస**
**ద్వసనలై కచభారచంపకదామలై సు లలామలై**
**పసిఁడిమాడల కాంతు లఱ్ఱులఁ బర్వఁ దేరులమీఁద బెం**
**పెసఁగ బాడిరి వ్రేత లా హరిహేల లింపగు నేలలన్.**

**టీక:- పసుపులాడి = పసుపులు రాసుకొని స్నానములు చేసి; ఉరోజ = రొమ్ముల పైన పూసుకొన్న; కుంకుమ = కుంకుమ; పంక = పల్చటి లేప్యము, పాలుతో; సం = చక్కగా; శోభితలు = ప్రకాశించువారు; ఐ = అయ్యి; లసత్ = అందమైన; వసనలు = వస్త్రములు ధరించినవారు; ఐ = అయ్యి; కచభార = జుట్టుముడులలో; చంపక = సంపెగపూల; దామలు = దండలు కలవారు; ఐ = అయ్యి; సు = చక్కగా; లలామలు = తిలకము ధరించినవారు; ఐ = అయ్యి; పసిడి = బంగారు; మాడల = మాడల యొక్క; కాంతులు = మెరుపులు; అఱ్ఱులన్ = మెడల యందు; పర్వన్ = పరచుకొనుచుండగా; తేరులు = రథములు, బండ్లు; మీదన్ = పైననుండి; పెంపు = ఉత్సాహములు; ఎసగన్ = అతిశయించగా; పాడిరి = పాటలు పాడిరి; వ్రేతలు = గోపికలు; ఆ = ఆ ప్రసిద్ధుడైన; హరి = శ్రీకృష్ణుని; హేలలు = లీలలను; ఇంపగు = మనోజ్ఞమైన; నేలలన్ = ప్రదేశములలో.**

**భావము:- గోపికలు చక్కగా పసుపులు రాసుకుని, స్నానాలు చేసి, ఆపైన పాలిండ్ల మీద కుంకుమ పూతలు పూసుకుని, మెరుపుల వస్త్రాలు ధరించారు, అందంగా తిలకాలు దిద్దుకున్నారు. పెద్ద కొప్పులపై సంపెంగ పూలదండలు**

**ధరించారు. ధరించిన బంగారు కాసులపేరు కాంతులు మెడలో ప్రకాశిస్తున్నాయి. వారు బండ్లలో ఎక్కి కూర్చుని చక్కని కంఠాలతో మాధవుడిమీద పాటలు పాడుతూ ఉన్నారు.**

## బృందావనము జొచ్చుట

**10.1-427-వ.**

**అప్పుడు రోహిణీయశోద లేక రథంబునఁ బరిపూర్ణమనోరథలై రామ కృష్ణుల ముందట నిడుకొని వారల వినోదంబులకుఁ బ్రమోదంబు నొందుచుండి; రిట్లు గోపకులు బృందావనంబు జొచ్చి యం దర్ధచం ద్రాకారంబుగ శకట సందోహంబు నిలిపి మందలు విడియించి వసియించిరి.**

**టీక:- అప్పుడు = ఆ సమయమునందు; రోహిణి = రోహిణీదేవి; యశోదలు = యశోదాదేవిలు; ఏక = ఒకే; రథంబునన్ = రథముపైన; పరిపూర్ణ మనోరథులు = తృప్తితో ఉన్నవారు; ఐ = అయ్యి; రామ = బలరాముడు; కృష్ణులన్ = కృష్ణులను; ముందటన్ = ఎదుట; ఇడుకొని = కూర్చోబెట్టుకొని; వారల = వారు చేయు; వినోదంబుల్ = వినోదపుపనుల; కున్ = కు; ప్రమోదంబున్ = సంతోషము; ఒందుచుండిరి = పొందుచుండిరి; ఇట్లు = ఈ విధముగ; గోపకులు = యాదవులు; బృందావనంబున్ = బృందావనమును; ఛొచ్చి = ప్రవేశించి; అందున్ = అక్కడ; అర్ధచంద్ర = అర్ధచంద్రుని, అర్ధవృత్త; ఆకారంబుగ = ఆకృతిలో; శకట = బండ్ల; సందోహంబున్ = సమూహమును; నిలిపి = ఆపికొని; మందలు = పశువుల గుంపును; విడియించి = కుదురుగ ఉంచి; వసియించిరి = నివసించిరి.**

భావము:- రోహిణీ దేవి, యశోదాదేవి ఎంతో సంతృప్తితో ఒకే బండిలో కూర్చున్నారు. బలరామకృష్ణులను ఎదుట కూర్చోపెట్టుకుని, వారి ఆటపాటలతో ఆనందిస్తూ ప్రయాణం సాగించారు. ఈ విధంగా గోకులంలోని ప్రజలు అందరూ బృందావనంలో ప్రవేశించారు. బండ్లను అర్ధచంద్రాకారంగా నిలబెట్టి ఆవుల మందలను మధ్యలో ఉంచారు. అలాగే ఇండ్లను కూడా కట్టుకుని అక్కడ నివసించారు.

10.1-428-క.

చెందిరి బలమాధవు లభి
నందించుచుఁ బరమ పావనము సంచిత కా
ళిందీ సంజీవనమున్
బృందావనమున్ మునీంద్రబృందావనమున్.

టీక:- చెందిరి = చేరిరి; బల = బలరామ; మాధవులు = కృష్ణులు {మాధవుడు - మాధవి (లక్ష్మీదేవి) భర్త, విష్ణువు}; అభినందించుచున్ = కొనియాడుతు; పరమ = అతిమిక్కిలి; పావనమున్ = పరిశుద్ధమైన; సంచిత = కూడిన; కాళిందీ = యమునానది యొక్క; సంజీవనమున్ = మరల జీవింప జేసినది; బృందావనమున్ = బృందావనమును; ముని = ఋషులలో; ఇంద్ర = శ్రేష్ఠుల; బృంద = సమూహములను; అవనమున్ = రక్షించెడి దానిని.

భావము:- ఇలా బలరామకృష్ణులు సంతోషంతో పరమ పావనమైన బృందావనంలో ప్రవేశించారు. ఆ బృందావనం కాళింది నదికి ప్రాణాలు పోసినట్లుగా ఉంది. అది మునీంద్రులు అందరినీ రక్షించేది.

10.1-429-వ.

**ఇట్లు బృందావనంబు చెంది, కొంత కాలంబునకు రామ కృష్ణులు సమానవయస్కులైన గోపబాలకులం గూడుకొని వేడుక లూదుకొన దూడలఁ గాచుచు.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; బృందావనంబున్ = బృందావనము నందు; చెంది = స్థిరపడినవారై; కొంత = కొన్ని; కాలంబున్ = నాళ్ళు; కున్ = కి; రామ = బలరాముడు; కృష్ణులున్ = కృష్ణుడు; సమానవయస్కులు = తమ ఈడువారు; ఐన = అయినట్టి; గోప = గొల్ల; బాలకులన్ = పిల్లవారిని; కూడుకొని = కలుపుకొని; వేడుకలు = ఉత్సాహములు; ఊదుకొనన్ = అలముకొనగా, వ్యాపించగా; దూడలన్ = ఆవుదూడలను; కాచుచున్ = మేపుచు.

భావము:- ఇలా బృందావనం చేరిన కొన్నాళ్ళ పిమ్మట, బలరామకృష్ణులు వేడుకతో తమ ఈడు గోపబాలురతో కలసి ఆనందంగా దూడలను కాయసాగారు.

10.1-430-సీ.

**వేణువు లూఁదుచు వివిధ రూపములతో-**
**గంతులు పైతురు గౌతుకమున;**
**గురుకంబళాదుల గోవృషంబులఁ బన్ని-**
**పరవృషభము లని ప్రతిభటింతు;**
**రల్లులు దట్టించి యంఘ్రుల గజ్జలు-**
**మొఱయఁ దన్నుదు రోలి ముమ్మరముగఁ**
**బన్నిదంబులు పైచి ఫలమంజరులు గూల్చి-**
**వేటు లాడుదురు ప్రావీణ్య మొప్ప;**

10.1-430.1-తే.

వన్య జంతు చయంబుల వానివాని
పదురు పదురుచు వంచించి పట్టఁబోదు;
రంబుజాకరములఁ జల్లులాడఁ జనుదు;
రా కుమారులు బాల్యవిహారు లగుచు.

టీక:- వేణువులు = పిల్లనగ్రోవులు; ఊదుచున్ = పూరించుచు; వివిధ = అనేకమైన; రూపముల్ = ఆకృతుల; తోన్ = తోటి; గంతులు = చిందులు; పైతురు = వేసెదరు; కౌతుకమునన్ = కుతూహలముతో; గురు = పెద్దపెద్ద; కంబళ = కంబళ్ళు; ఆదులన్ = మున్నగువానితో; గోవృషభంబులన్ = ఆబోతులను; పన్ని = ఏర్పరచి; పర = ఇతరుల; వృషభములు = ఆబోతులు; అని = అని; ప్రతిభటింతురు = ఎదురింతురు; అల్లులున్ = చల్లడములను, భుజాలు {చల్లడము - తొడలకు సగమువరకు వచ్చునట్లు కట్టుకొనెడి వస్త్రవిశేషము}; దట్టించి = బిగియగట్టి, చరచికొని; అంఘ్రుల = కాళ్ళ; గజ్జలు = గజ్జలు; మొఱయన్ = మోగుతుండగా; తన్నుదురు = కాళ్ళతో తన్నెదరు; ఓలిన్ = వరుసగా; ముమ్మరముగన్ = అధికముగా; పన్నిదంబులున్ = పందెములు; పైచి = వేసుకొని; ఫల = పండ్లను; మంజరులున్ = పూలగుత్తులను; కూల్చి = రాలగొట్టి; పేటులు = కొట్టుకొనెడి ఆటలు; ఆడుదురు = ఆడెదరు; ప్రావీణ్యము = నేర్పులు; ఒప్పన్ = ఒప్పునట్లుగా.

వన్య = అడవి; జంతు = జంతువుల; చయంబులన్ = సమూహములను; వాని వాని = ఆయాజంతువుల; పదురు = కూతలను; పదురుచున్ = అనుకరించి కూయుచు; వంచించి = మోసగించి; పట్టన్ = పట్టుకొన; పోదురు = వెళ్ళెదరు; అంబుజాకారములన్ = తామరకొలనులలో {అంబుజాకరము - అంబుజ (పద్మముల) ఆకరము (నివాసము), చెరువు,

కొలను}; చల్లులాడన్ = జలకాలాడుటకు; చనుదురు = వెళ్ళెదరు; ఆ = ఆ ప్రసిద్ధులైన; కుమారులు = బాలకులు; బాల్య = పసితనపు; విహారులు = క్రీడలు క్రీడించువారు; అగుచున్ = ఔతూ.

భావము:- ఆ బలరామకృష్ణులు వేణువులు ఊదుతూ రకరకాల వేషాలతో ఉత్సాహంతో గెంతులు వేయసాగారు; పెద్దపెద్ద కంబళ్ళతో వృషభాల రూపాలు తయారుచేసి, వాటిని శత్రు వృషభాలు అని వాటితో యుద్ధం చేయసాగారు; గుడ్డలతో బొమ్మలుచేసి వాటిని గట్టిగా తన్నుతుండేవారు, అలా కాలిగజ్జెలు ఘల్లుఘల్లు మంటూ మ్రోగసాగాయి; పందాలు వేసుకుని మరీ పండ్లగుత్తులను రాళ్ళతో కొడుతూ ఉంటారు; అడవి జంతువుల కూతలను అరుపులను అనుకరించి అరుస్తూ ఆ జంతువులు దగ్గరకు రాగానే వాటిని పట్టుకోబోతారు. తామరపూల కొలనులలో ప్రవేశించి ఒకరిపై ఒకరు నీళ్ళు చల్లుకుంటూ ఆడుతూ ఉంటారు. ఇలా ఆ రాకుమారులు గోపబాలకులై బాల్యక్రీడలలో చరించసాగారు.

10.1-431-క.

పోరుదురు గికురు పొడుచుచు;  
దూఱుదురు భయంబు లేక తోరపుటిరవుల్;  
జాఱుదురు ఘనశిలాతటి;  
మీఱుదు రెన్నంగరాని మెఁలకువల నృపా!

టీక:- పోరుదురు = దెబ్బలాడుకొనుచు; కికురుపొడుచుచున్ = తోసుకొనుచు; దూఱుదురు = ఘొరబడెదరు; భయంబున్ = బెదురు; లేక = లేకుండ; తోరపు =పెద్దపెద్ద; ఇరవుల్ = పొదరిండ్లలోకి; జాఱుదురు = జారెదరు; ఘన = పెద్దపెద్ద; శిలాతటిన్ = చాపరాళ్ళమీద; మీఱుదురు =

ఒకరినొకరు మించుదురు; ఎన్నంగరాని = ఎంచ వీలుకాని; మెలకువలన్ = మెలకువలతో; నృపా = రాజా.

భావము:- ఒకరితో ఒకరు యుద్ధాలు ఆటలు ఆడుతూ, దొంగదెబ్బలు కొట్టుకుంటారు. అందమైన స్థలాల లోనికి జంకులేకుండా ప్రవేశిస్తూ ఉంటారు. పెద్ద బండరాళ్ళపైకి ఎక్కి జారుతూ ఉంటారు పెద్దలకి ఊహించరాని నేర్పరితనాలలో ఒకరి నొకరు మించిపోతూ ఉంటారు.

## వత్సాసుర వధ

10.1-432-వ.

**అంత నొక్కనాడు యమునాతీరంబున నా కుమారులు**
**గోప కుమారులుం దారును గ్రేపుల మేప నొక్క రక్కసుండు**
**క్రేపు రూపున వచ్చి వారల హింసింపం దలంచి.**

టీక:- అంతన్ = అప్పుడు; యమునా = యమునానదీ; తీరంబునన్ = తీరమునందు; ఆ = ఆ; కుమారులు = బాలకులు; గోపకుమారులున్ = గొల్లపిల్లలు; తారును తాము; క్రేపులన్ = దూడలను; మేపన్ = మేపుతుండగ; ఒక్క = ఒకానొక; రక్కసుండు = రాక్షసుడు; క్రేపు = ఆవుదూడ; రూపంబునన్ = ఆకృతితో; వచ్చి = చేరి; వారలన్ = వారిని; హింసింపన్ = సంహరించవలె నని; తలంచి = భావించి.

భావము:- ఒకరోజు బలరామకృష్ణులు యమునానదీతీరాన గోపాలకులతో కలసి గోవత్సాలను మేపుతూ ఉండగా ఒక రాక్షసుడు వారిని చంపాలని వచ్చి తాను కూడా ఒక కోడెదూడ రూపం ధరించాడు.

10.1-433-క.

క్రేపుల యళ్ళులు నాకుచుఁ
గ్రేపులలో నిదియె మంచి క్రేపనఁగఁ గడుం
జూపట్టి భక్త సంగతిఁ
గ్రేపై చనువాని మ్రోలఁ గ్రేపై తిరిగెన్.

టీక:- క్రేపుల = ఆవుదూడల; అళ్ళులున్ = మెడలను; నాకుచున్ = నాకుతూ;క్రేపుల = అన్ని దూడలలోను; ఇదియె = ఇదే; మంచి = మంచి;క్రేపు = దూడ; అనగన్ = అన్నట్లుగా; కడున్ = మిక్కిలి; చూపట్టి = కనబడి; భక్త = తన భక్తుల; సంగతిన్ = వెంట;క్రేపు = దూడ; ఐ = అయ్యి; చనువాని = వెళ్ళెడి వానిని; మ్రోలన్ = ఎదుట;క్రేపు = దూడ; ఐ = అయ్యి; తిరిగెన్ = సంచరించెను.

భావము:- వాడు దూడలలో దూడ రూపం దాల్చి వాటితో కలసిపోయి మిగిలిన దూడల మెడలు నాకుతూ; ఉన్న వాటిలో ఇదే మంచి దూడ అన్నట్లు సంచరించాడు. భక్తుల వెంట దూడవలె సంచరించే కృష్ణుని వెనుక ఆ రాక్షసుడు దూడ రూపంలో తిరుగసాగాడు.

10.1-434-వ.

వాని నెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పి

టీక:- వానిన్ = అతనిని; ఎఱింగి = తెలిసికొని; కృష్ణుండు = కృష్ణుడు; రామున్ = బలరామున; కున్ = కు; చెప్పి = చెప్పి.

భావము:- ఆ వత్సాసురుడివిషయం ఎరిగిన కృష్ణుడు బలరాముడుకి చెప్పి. .



10.1-435-వ.

"ఇదియొకమంచిలేగ; వినుఁ డెంతయునొప్పెడి"నంచు దాని త త్పదములు తోఁకయున్ బిగియబట్టి చెలంగివెలంగ మ్రానితోఁ జదియఁగ నొక్కపెట్టుగొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసుం గుదులుకొనంగ బాలకులు గోయని యార్వ నఖర్వ లీలతోన్.

టీక:- ఇది = ఇది; ఒక = ఒకానొక; మంచి = మంచి; లేగ = లేగదూడ; వినుండు = వినండి; ఎంతయున్ = మిక్కిలి; ఒప్పెడిన్ = అందముగ ఉంది; అంచున్ = అనుచు; దాని = దానిని; తత్ = ఆ; పదములున్ = కాళ్ళు; తోక యున్ = తోకను; బిగియన్ = గట్టిగా; పట్టి = పట్టుకొని; చెలంగి = చెలరేగి; వెలంగ = వెలగ; మ్రాని = చెట్టుబోదె; తోన్ = తోటి; చదియగన్ = నలియు నట్లు; ఒక్క = ఒకానొక; పెట్టు = దెబ్బ; కొని = కొట్టి; చంపెన్ = సంహరించెను; కుమారుడు = బాలకృష్ణుడు; లేగరక్కసున్ = వత్సాసురుని; కుదులు కొనంగ = కూలిపోయేలా; బాలకులు = గోపబాలురు; కో = కో; అని = అని; ఆర్వన్ = అరచుచుండగ; అఖర్వలీల = విస్తారమైన లీల; తోన్ = తోటి.

భావము:- కృష్ణుడు “ఆహా ఈ దూడ ఎంత మంచిదో చూసారా; ఎంత చక్కగా ఉందో చూడండి” అంటూ నెమ్మదిగా దాని దగ్గరికి వెళ్ళాడు. గభాలున దాని కాళ్ళు తోక పట్టుకుని పైకెత్తి పెద్దపెట్టున వెలగచెట్టుకేసి మోదాడు. ఆ దెబ్బకు ఆ దూడ చితికి పచ్చడి అయిపోయింది. ఈ విధంగా దూడరూపంలో వచ్చిన వత్సాసురుడనే రాక్షసుడు గిలగిల కొట్టుకుని చచ్చి పోయాడు. గోపాలకులు ఆనందంతో ఒక్కపెట్టున పెద్దగా కేకలు వేసారు.

10.1-436-వ.

ఇట్లు రక్కసుండు ప్రేటుపడి విశాలంబగు సాలంబుతో నేలం గూలెను; అప్పుడు

టీక:- ఇట్లు = ఈ విధముగ; రక్కసుండు = రాక్షసుడు; ప్రేటుపడి = చనిపోయి; విశాలంబు = పెద్దది; అగు = ఐన; సాలంబు = మాను; తోన్ = తోటి; నేలంగూలెన్ = మరణించెను; అప్పుడు = ఆ సమయమునందు.

భావము:- అలా అ రాక్షసుడు దెబ్బ తిని నేలకూలాడు ఆ దెబ్బకు అంత పెద్ద చెట్టు సైతం కూలిపోయింది. .

10.1-437-క.

గొంగడు లెగురఁగ పైచుచుఁ
జంగున దాఁటుచును జెలఁగి చప్పట లిడుచుం
బొంగుచుఁ గృష్ణుని బొగడుచు
ద్రుంగిన రక్కసునిఁ జూచి త్రుళ్ళిరి కొమరుల్.

టీక:- గొంగడులు = కంబళ్ళు, రగ్గులు; ఎగురగన్ = పైకెగురునట్లు; పైచుచున్ = వేయుచు; చంగునన్ = చెంగుమని; దాటుచునున్ = ఎగిరిదాటుతూ; చెలగి = విజృంభించి; చప్పటలు = చప్పట్లు; ఇడుచున్ = కొట్టుతూ; పొంగుచున్ = ఉప్పొంగుతు; కృష్ణుని = బాలకృష్ణుని; పొగడుచున్ = స్తుతించుచు; త్రుంగిన = చచ్చిపోయిన; రక్కసునిన్ = రాక్షసుని; చూచి = కనుగొని; త్రుళ్ళిరి = గర్వించి గంతులు వేసిరి; కొమరుల్ = బాలకులు.

భావము:- గోపకుమారులు చచ్చి పడిన రాక్షసుని చూసి పట్టరాని ఉత్సాహంతో గొంగళ్ళు ఎగురవేసారు. ఎగిరి దూకారు. చప్పట్లు కొట్టారు. తృళ్ళింతలతో పొంగి పోయారు. కృష్ణుని బలాన్ని పొగిడారు.

10.1-438-వ.

ఆ సమయంబున వేలుపులు విరులవానలు గురియించి రివ్విధం బున.

టీక:- ఆ సమయంబునన్ = అప్పుడు; వేలుపులు = దేవతలు; విరుల = పూల; వానలు = జల్లులు; కురియించిరి = కురిపించిరి; ఈ = ఈ; విధంబునన్ = విధముగ;

భావము:- అప్పుడు దేవతలు పూలవానలు కురిపించారు. ఇలా....

10.1-439-క.

**వత్సముల పగిది జగముల**
**వత్సలతన్ మనుపఁ జూచువాఁడై యుంటన్**
**వత్సముల మేపు చుండియు**
**వత్సాసురుఁ జంపె భక్తవత్సలుఁ డధిపా!**

టీక:- వత్సములన్ = ఆవుదూడలను {వత్సము - ఒక సంవత్సరములోపు దూడ}; పగిదిన్ = వలెనే; జగములన్ = లోకములను; వత్సలతన్ = వాత్సల్యముతో; మనుపన్ = కాపాడవలెనని; చూచువాడు = పూనునట్టివాడు; ఐ = అయ్యి; ఉంటన్ = ఉండుటచే; వత్సములన్ = దూడలను; మేపుచుండియున్ = మేపుతున్నను; వత్సారున్ = వత్సుడు అనెడి రాక్షసుని; చంపెన్ = సంహరించెను; భక్తవత్సలుడు = శ్రీకృష్ణుడు {భక్త వత్సలుడు - భక్తుల ఎడ వాత్సల్యము కలవాడు, విష్ణువు}; అధిపా = రాజా.

భావము:- పరీక్షిన్నృపరాజా! ఆవు తన దూడను రక్షించు నట్లు ఈ లోకాలు అన్నింటిని వాత్సల్యభావంతో రక్షించడానికి అవతరించాడు. కనుక భక్తులను కన్నబిడ్డలవలె కాపాడే కృష్ణుడు దూడలను మేపుతూ ఉండి కూడా దుర్మార్గుడైన వత్సాసురుణ్ణి చంపివేసాడు.

10.1-440-వ.

**మఱియు నొక్కనాడు రేపకడ గోపకుమారులు క్రేపులం గొంచు నడవికిం జని యెండంబడి మెండుకొనిన దప్పిని బెండుపడిన తమ తమ లేఁగకదుపుల నేర్పరించి నిలువరించుకొని కలంకంబు లేని యొక్క కొలంకున నీరు ద్రావించి తారును జలపానంబు జేసి వచ్చుసెడ నందు.**

టీక:- మఱియున్ = ఇంకను; ఒక్క = ఒకానొక; నాడు = దినమున; రేపకడ = ఉదయమే; గోపకుమారులు = గొల్లపిల్లలు;క్రేపులన్ = ఆవుదూడలను; కొంచున్ = తీసుకొని; అడవి = అడవి; కిన్ = కి; చని = వెళ్లి; ఎండన్ = ఎండకు; పడి = గుర్రై; మెండుకొనిన = అధికమైన; దప్పిన్ = దాహముతో; బెండుపడిన = నీరసించి పోగా; తమతమ = వారివారి; లేగ = లేగదూడల; కదుపులన్ = సమూహములను; ఏర్పరించుకొని = విభజించుకొని; నిలువరించుకొని = నిలుపుకొని; కలంకంబు =ముఱికి, మాలిన్యము; లేని = లేనట్టి; ఒక్క = ఒకానొక; కొలంకునన్ = చెరువలో; నీరున్ = నీటిని; త్రావించి = తాగించి; తారును = వారుకూడ; జలపానంబు = నీళ్ళుతాగుట; చేసి = చేసి; వచ్చున్ = వచ్చెడి; ఎడన్ = సమయము; అందు = అందు.

భావము:- దినము ఉదయమే గోపబాలకులు వారి లేగదూడలను అడవికి తీసుకొని వెళ్ళారు. అక్కడ ఎండకు గుర్రై విపరీతమైన దాహము కలుగగా, అలసిపోయిన వారి లేగదూడలను వారిలో వారు విభజించుకొని ఒక మంచినీటి కొలనులో వాటి చేత నీరు తాగించి వారు కూడా నీరు తాగి వస్తున్న సమయంలో ....

## బకాసుర వధ

10.1-441-క.

**అకలంకులు బాలురు గని**

**రకుటిలదంభోళిహతసితాద్రి శిఖర రూ**

**పకమున్ హరిహింసారం**

**భకమున్ బకమున్ విశాల భయదాంబకమున్.**

టీక:- అకలంకులు = కపట మెరుగని వారు; బాలురున్ = పిల్లలు; కనిరి = చూసితిరి; అకుటిల = వాడి తగ్గుటలేని; దంభోళి = వజ్రాయుధముచేత; హత = కొట్టబడిన; సిత = తెల్ల; అద్రి = పర్వతపు; శిఖర = శిఖరము; రూపకమున్ = ఆకృతి గలదానిని; హరిన్ = బాలకృష్ణుని; హింసా = చంపెడి; ఆరంభకమున్ = ప్రయత్నము కలదానిని; బకమున్ = కొంగను; విశాల = పెద్ద; భయద = భయము కలిగించెడి; అంబకమున్ = కన్నులు కలదానిని.

భావము:- అలా తిరిగి వస్తున్నప్పుడు పుణ్యమూర్తులైన ఆ బాలకులు మహా భయంకరమైన ఒక కొంగను చూసారు. పూర్వం ఇంద్రుని వజ్రాయుధం రెక్కలను విరగగొట్టగా క్రిందపడిన పెద్ద కొండశిఖరమా అన్నట్లు ఆకొంగ నిలపడి ఉంది. భయంకరమైన పెద్ద కన్నులతో కృష్ణుని చంపడానికి అక్కడ వేచి ఉంది.

10.1-442-వ.

**కని దాని యొడలిపొడవునకు వెఱఁగుపడి చూచుచుండ.**

టీక:- కని = చూసి; దాని = దాని యొక్క; ఒడలి = దేహపు; పొడవున్ = భారీతనమున; కున్ = కు; వెఱగుపడి = ఆశ్చర్యపోయి; చూచుచుండ = చూస్తుండగా.

భావము:- ఆ గోపకుమారులు ఆ దొంగకొంగ పొడవును నిర్ఘాంతపోయి చూస్తుండగా......

10.1-443-ఆ.

ఎల్ల పనులు మాని యేకాగ్రచిత్తుఁ డై
మౌనివృత్తి నితర మతము విడిచి
వనములోన నిలిచి వనజాక్షుపై దృష్టి
చేర్చి బకుఁడు తపసి చెలువుఁ దాల్చె.

టీక:- ఎల్ల = అన్ని; పనులు = వ్యాపారములు; మాని = విసర్జించి; ఏకాగ్రచిత్తుడు = మనసు లగ్నమైన వాడు; ఐ = అయ్యి; మౌని = మునుల; వృత్తిన్ = వలె; ఇతర = అన్యమైన; మతము = ఆలోచనలు; విడిచి = వదలిపెట్టి; వనము = కొలను; లోనన్ = అందు; నిలిచి = నిలబడి; వనజాక్షున్ = కృష్ణుని {వనజాక్షుడు - వనజము (పద్మము)లవంటి అక్షుడు (కన్నులు గలవాడు), కృష్ణుడు}; పైన్ = మీద; దృష్టి = మనసును; చేర్చి = లగ్నము చేసి; బకుడు = బకాసురుడు; తపసి = తపసుల; చెలువున్ = రీతిని; తాల్చెన్ = ధరించెను.

భావము:- ఆ కొంగ అన్ని పనులు మానేసి ఏకాగ్రచిత్తంతో అడవిలోని కొలనులో మునిలాగా నిలబడి ఉన్నది. ఇంక ఏ విధమైన కోరికలు లేవు ఒక్క కృష్ణుడి మీదనే దృష్టి అంతా కేంద్రీకరించింది. కృష్ణుడిని శత్రుత్వంతో చంపజూచే ఆ ప్రయత్నంలో మహర్షులు చేయదగిన తపస్సు దానికి సిద్ధించింది.

10.1-444-వ.

ఇ వ్విధంబున నొదుగు పెట్టుకొని యుండి.

టీక:- ఈ = ఈ; విధంబునన్ = లాగున; ఒదుగుపెట్టుకొని = పొంచి; ఉండి = ఉండి.

భావము:- అలా నీటిలో మాటువేసి ఉన్నాడు ఆ బకాసురుడు.

10.1-445-ఉ.

చంచువు దీ(టి పక్షములు జల్లున విచ్చి పదంబు లెత్తి కు
ప్పించి నభంబుపై కెగసి, భీషణ ఘోషణ వక్త్రుడై విజృం
భించి గరుత్సమీరమున భిన్నము లై తరులోలి( గూల(గా
మించి బకాసురుం డొడిసిమ్రింగె సహిష్ణుని( జిన్నికృష్ణునిన్.

టీక:- చంచువున్ = ముక్కు; దీటి = సవరించుకొని; పక్షములు = రెక్కలు; జల్లునన్ = చటుక్కున; విచ్చి = విప్పుకొని; పదంబులన్ = కాళ్ళు; ఎత్తి = ఎత్తి; కుప్పించి = గెంతి; నభంబున్ = ఆకాశముపైపున; కున్ = కి; ఎగిసి = ఎగిరి; భీషణ = భయంకర మైన; ఘోషణ = గట్టిధ్వని గల; వక్త్రుడై = నోరు గలవాడు; ఐ = అయ్యి; విజృంభించి = రెచ్చిపోయి; గరుత్ = రెక్కల; సమీరమునన్ = గాలిచేత; భిన్నములు = విరిగిపోయినవి; ఐ = అయ్యి; తరులు = చెట్లు; ఓలిన్ = వరుసగా; కూల(గా = పడిపోగా; మించి = అతిశ యించి; బకాసురుండు = బకాసురుడు; ఒడిసి = ఒడిసిపట్టుకొని; మ్రింగెన్ = మింగి వేసెను; సహిష్ణునిన్ = కృష్ణుని {సహిష్ణుడు - సుఖదుఃఖముల మానావమానముల జ్ఞానాజ్ఞానముల ఎడ మిక్కిలి ఓర్పుగలవాడు, ద్వంద్వాతీతుడు, విష్ణువు}; చిన్ని = బాల; కృష్ణునిన్ = కృష్ణుని.

భావము:- ఆ టక్కరి కొంగ ఒక్కసారిగా కృష్ణునివైపు కుప్పించి దూకింది. ముక్కు విదిలించింది. రెక్కలు జల్లున విప్పి పాదాలు పైకెత్తి ఆకాశంలోకి ఎగిరింది. భయంకరంగా కూతపెడుతూ విజృంభించింది. దాని రెక్కల గాలికి అక్కడి చెట్లు విరిగి పడిపోయాయి. “సరే చూద్దాం” అని ఓర్పు వహించిన కృష్ణుణ్ణి తన ముక్కుతో బకాసురుడు ఒడిసిపెట్టి మ్రింగేశాడు.

10.1-446-క.

సంగడి లోకము లన్నియు

ఖ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచు ను

త్సాంగెడు వేడుకకాఁ డటు

ఖ్రింగుడుపడె బకునిచేత మీఁ దెఱిఁగి నృపా!

టీక:- సంగడిన్ = గుత్తగుచ్చి. సమూహముగా; లోకములు = లోకములను; అన్నియున్ = ఎల్లను; ఖ్రింగుచు = లయము చేసుకొనుచు; క్రక్కుచు = బహిర్గతము చేయుచు; బయల = ప్రకాశముగ; మెలగించుచును = ప్రవర్తింప జేయుచు; ఉత్సాంగెడు = సంతోషించుచుండు నట్టి; వేడుకకాడు = వినోదములు కలవాడు; అటు = అలా; ఖ్రింగుడుపడె = మింగబడెను; బకుని = బకాసురుని; చేతన్ = వలన; మీదన్ = జరగ బోయెడిది; ఎఱిగి = తెలిసి; నృపా = రాజా {నృపుడు – నరులను పాలించువాడు, రాజు}.

భావము:- రాజా! పరీక్షిత్తూ! ఈ బ్రహ్మాండాలు అన్నింటినీ తనలో నుండి పుట్టిస్తూ మళ్లీ ఖ్రింగి వేస్తూ ఆడిస్తూ ఉండే లీలామయుడు అయిన ఆ కృష్ణుడు అంతా తెలిసి బకాసురుని చేత ఖ్రింగబడ్డాడు.

10.1-447-క.

దనుజుఁడు ఖ్రింగినఁ గృష్ణునిఁ

గనలేక బలాది బాలకప్రముఖు లచే

తనులై పెఱఁ గందిరి చ

య్యనఁ బ్రాణములేని యింద్రియంబుల భంగిన్.

టీక:- దనుజుడు = రాక్షసుడు; ఖ్రింగినన్ = మింగివేయగా; కృష్ణునిన్ = కృష్ణుడిని; కనలేక = చూడలేక; బల = బలరాముడు; ఆది = మున్నగు; బాలక

= గొల్లపిల్లలలో; ముఖ్యులు = ప్రముఖులు; అచేతనులు = చేష్టలుడిగినవారు; ఐ = అయ్యి; వెఱగు = దిగ్భ్రమ; అందిరి = చెందిరి; చయ్యన = చటుక్కున; ప్రాణములు = ప్రాణములు; లేని = పోయిన; ఇంద్రియంబుల = ఇంద్రియముల; భంగిన్ = వలె.

భావము:- అలా రాక్షసుడు మ్రింగిడంతో బలరాముడు మొదలైన గోపాలబాలకులు కృష్ణుడు కనిపించక, ప్రాణంలేని అవయవాలవలె అచేతనులై భయంతో కంపించిపోయారు.

10.1-448-వ.

**అట్లు మ్రింగుడుపడి లోనికిం జనక.**

టీక:- అట్లు = ఆ విధముగ; మ్రింగుడుపడి = మింగబడి; లోనికిన్ = కడుపులోకి; చనక = వెళ్ళకుండ.

భావము:- అలా మ్రింగబడిన కృష్ణుడు ఆ రాకాసికొంగ గొంతుక దాటి లోపలికి పోలేదు. . . .

10.1-449-శా.

**కంఠోపాంతముదౌడలున్ మెఱముచుం గాలాగ్నిచందంబునం**
**గుంఠీభూతుఁడు గాక వేంద్రమగు నా గోపాలబాలున్ జయో**
**త్కంఠున్బ్రహ్మగురున్ మహామహిముఁ జక్కంబ్రింగరాదంచు నో**
**ల్లుంఠంబాడుచు వాఁడు గ్రక్కె వెడలన్ లోకం బశోకంబుగన్.**

టీక:- కంఠ = గొంతుక; ఉపాంతమున్ = లోపల (అంగిలి) అందు; దౌడలున్ = చెంపల లోపలనుండి; మెఱముచున్ = మెరమెర లాడించు {మెఱము – మెరమెర (కంటిలోని నలుసు మెదలుట యందలి ధన్యనుకరణ) లాడించు,చూ నాటిన శల్యాదులను మెదల్చునట్లు మెదులు}; కాలాగ్ని =

ప్రళయాగ్ని; చందంబునన్ = వలె; కుంఠీభూతుఁడు = అణగిఉండువాడు; కాకన్ = కాకుండగా; పేంద్రము = తపింపజేయువాడు; అగున్ = ఐన; ఆ = ఆ యొక్క; గోపాలబాలున్ = బాలకృష్ణుని; జయోత్కంఠున్ = గెలుచుట యందు ఉత్సహము కలవానిని; బ్రహ్మ = బ్రహ్మదేవునికి; గురున్ = తండ్రి యైనవానిని; మహా = గొప్ప; మహిమున్ = మహిమలు కలవానిని; చక్కన్ = అనువుగా; మ్రింగరాదు = మింగుట వీలుకాదు; అంచున్ = అనుచు; సొల్లుంఠంబాడుచు = నిందించుచు (జాతీయము); వాడున్ = అతడు; క్రక్కెన్ = వెళ్ళగ్రక్కెను; వెడలన్ = బయటకు; లోకంబు = సమస్తప్రాణులు; అశోకంబుగన్ = విచారము లేని వగునట్లు.

భావము:- ఆ బకాసురుని కంఠం ముందు భాగమూ దౌడలూ కాలాగ్నివలె మండిస్తూ విజృంభించాడు కృష్ణుడు నిప్పుముద్దలాగ బకాసురుని కంఠానికి అడ్డుపడ్డాడు. అతడు విజయం సాధించే శీలంకలవాడు; బ్రహ్మదేవుడు అంతటివాడికి తండ్రి; అతడు మహా మహిమ గలిగినవాడు. అతడు మ్రింగుడుపడడం లేదని దీర్ఘంగా నిందిస్తూ, ఆ బకాసురుడు కృష్ణుణ్ణి మళ్లీ బయటకి వెళ్ళగ్రక్కాడు. అలా కృష్ణుడు బయటపడటం చూసి లోకం అంతా సంతోషించింది.

10.1-450-క.

క్రక్కి మహాఘోషముతోఁ
జక్కగఁ దనుఁ బొడువరాఁగఁ జంచులు రెండున్
స్రుక్కఁగఁ బట్టి తృణము క్రియ
గ్రక్కున హరి చీరె బకునిఁ గలహోత్సుకునిన్.

టీక:- క్రక్కి = వెడలగ్రక్కి; మహా =పెద్ద; ఘోషము = అరుపుల; తోన్ = తోటి; చక్కగన్ = చక్కగా; తన్నున్ = తనను; పొడవరాగ = పొడవబోగా;

చంచులు = ముక్కుపుటములు; రెండున్ = రెంటిని (2); స్రుక్కన్ = లొంగునట్లు; పట్టి = పట్టుకొని; తృణము = గడ్డిపోచ; క్రియన్ = వలె; క్రక్కున = చటుక్కున; హరి = కృష్ణుడు; చీరెన్ = చీల్చివేసెను; బకుని = బకాసురుని; కలహ = కయ్యానికి; ఉత్సుకునిన్ = కాలుదువ్వువానిని.

భావము:- అవిధంగా బయటికి క్రక్కివేసిన కృష్ణుణ్ణి ఆ కొక్కెర రక్కసి ముక్కుతో పొడిచి చంపేద్దామని భీకరంగా నోరు తెరచి ముందుకు దూకాడు. కలహానికి కాలు దువ్వే ఆ కొంగ ముక్కు రెండు భాగాలను కృష్ణుడు రెండు చేతులతో పట్టుకుని గడ్డిపరకను చీల్చినట్లు నిలువునా చీల్చేసాడు. .

10.1-451-వ.

**అప్పు డా నందనందనుమీఁద వేలుపులు చాలపులుగా**
**నందన మల్లికాది కుసుమవర్షంబులు హర్షంబునం**
**గురియించిరి; దేవవాద్యంబులు మొరసె; రామాది గోప**
**కుమారులు ప్రాణంబు లతోఁ గూడిన యింద్రియంబు**
**లునుం బోలెఁ గ్రమ్మఱ కృష్ణునిం గని రమ్మని కౌఁగిలించు**
**కొని కృష్ణసహితులయి లేఁగదాఁటుల మరల దాఁటించు**
**కొని మందగమనంబున మంద కరిగిరి; వారలచేత నా**
**వృత్తాంతం బంతయు విని వెఱఁగుపడి గోప గోపికా**
**జనంబులు.**

టీక:- అప్పుడు = అప్పుడు; ఆ = ఆ ప్రసిద్ధుడైన; నందనందను = బాలకృష్ణుని {నంద నందనుడు – నందుని యొక్క నందనుడు (కొడుకు), కృష్ణుడు}; మీదన్ = పైన; వేలుపులు = దేవతలు; చాలుపులుగాన్ = జల్లులుగా; నందన = నందనవనములోని; మల్లిక = మల్లెలు; అది = మున్నగు; కుసుమ =

**పూల; వర్షంబులున్ = వానలను; హర్షంబునన్ = సంతోషముతో; కురియించిరి = జల్లిరి; దేవ = దేవతా; వాద్యంబులున్ = వాయిద్యములు; మొరసెన్ = మోగినవి; రామ = బలరాముడు; ఆది = మున్నగు; గోపకుమారులు = గొల్లపిల్లలు; ప్రాణంబులన్ = జీవముల; తోన్ = తోటి; కూడిన = కలిగి యున్న; ఇంద్రియంబులునున్ = ఇంద్రియముల; పోలెన్ = వలె; క్రమ్మఱన్ = మరల; కృష్ణునిన్ = బాలకృష్ణుని; కని = కనుగొని; రమ్ము = దగ్గరకు రమ్ము; అని = అని; కౌగలించుకొని = కౌగలించుకొని; కృష్ణ = కృష్ణునితో; సహితులు = కూడినవారు; అయి = ఐ; లేగ = చిన్నదూడల; దాటులన్ = గుంపులను; మరల = మళ్ళీ; దాటించుకొని = తోలుకొని; మందగమనంబున = మెల్లని నడకతో; మందకున్ = పల్లెకు; అరిగిరి = వెళ్ళిరి; వారల = వారి; చేతన్ = వలన; ఆ = ఆ యొక్క; వృత్తాంతంబు = జరిగినది; అంతయున్ = సమస్తమును; విని = విని; వెఱంగుపడి = ఆశ్చర్యపోయి; గోప = యాదవులు; గోపికా = యాదవస్త్రీల; జనంబులు = సమూహములు.**

**<u>భావము:-</u> అలా బకాసురుని చంపగానే కృష్ణుడి మీద దేవతలు సంతోషంగా రకరకాల పూలవానలు కురిపించారు. ఆకాశంలో దుందుభి ధ్వనులు వినిపించాయి. ప్రాణాలు రాగానే ఇంద్రియాలుకూడా ఎలా సచేతనాలు అవుతాయో అలాగే బలరాముడు మొదలైన గోపకుమారులు అందరూ బ్రతికిపోయామని సంతోషించారు. “బ్రతికి వచ్చావా కృష్ణా!” అంటూ అతణ్ణి కౌగలించుకున్నారు. అందరూ కలసి మందలను మళ్లించుకుని నెమ్మదిగా తమ ఇండ్ల వద్దకు చేరుకున్నారు. బకాసురవధను గురించిన కధ అంతా వారు చెప్పగా గోకులంలోని గోపగోపికాజనాలు విని నిష్వెరపోయారు.**

10.1-452-క.

**“ఆపదలమీఁద నాపద**

**లీ పాపనిఁ జెంది తొలఁగె; నీ యర్భకుపై**

**వే పడిన ఖలులు దహనుని**

**పైపున శలభముల పగిదిఁ బడిరి ధరిత్రిన్.”**

**టీక:-** ఆపద = ప్రమాదము, విపత్తు; మీదన్ = తరువాత; ఆపదలు = విపత్తులు; ఈ = ఈ; పాపనిన్ = కుఱ్ఱవానికి; చెంది = కలిగి; తొలగెన్ = తప్పిపోయినవి; ఈ = ఈ; అర్భకుని = పిల్లవాని; పైన్ = మీద; వేపడిన = వేగిరంగా వచ్చి మీద పడిన, కలియబడిన; ఖలుల = దుష్టులు; దహనుని = మంటల; పైపున్ = లోనికి; శలభముల = మిడుతల; పగిదిన్ = వలె; పడిరిధరిత్రిన్ = నేలకూలిపోయిరి, చచ్చిరి.

**భావము:-** “ఈ లేతపాపనికి ఆపదలపై ఆపదలు వచ్చినట్లే వచ్చి తొలగి పోయాయి. పసివాడు కదా అని కృష్ణుడిపైకి విజృంభించిన దుర్మార్గులు ఎవరైనా సరే అగ్నిలో పడిన మిడతలలాగా భస్మమైపోయారు”

10.1-453-వ.

**అనిపలికిరి; మఱియు నా రామకృష్ణులు క్రేపులంగాచు తఱి.**

**టీక:-** అని = అని; పలికిరి = అనుకొనిరి; మఱియున్ = ఇంకను; ఆ = ఆ ప్రసిద్ధులైన; రామ = బలరామ; కృష్ణులు = శ్రీకృష్ణులు; క్రేపులన్ = ఆవుదూడలను; కాచు = మేపెడి, పాలించెడి; తఱిన్ = సమయమునందు.

**భావము:-** ఆ రామకృష్టులు ఆ దూడలను మేపే వయసులో తోటి గోపకులు అలా అనుకున్నారు.

10.1-454-సీ.

కపులపై జలరాశిఁ గట్టుదమా యని-
    కట్టుదు రడ్డంబు కాలువలకు;
మునులపై తపములు మొనయుదమా యని-
    మౌనులై యుందురు మాటలేక;
గంధర్వవరులపై గానవిద్యలు మీఱఁ-
    బాడుదమా యని పాడఁ జొత్తు;
రప్సరోజనులపై యాడుదమా యని-
    యాఁడు రూపముఁ దాల్చి యాఁడఁ జనుదు;

10.1-454.1-ఆ.

రమర దైత్యవరులపై యబ్ధిఁ ద్రత్తమా
యని సరోవరముల యందు హస్త
దండచయముఁ ద్రిప్పి తరుతురు తమ యీడు
కొమరు లనుచరింపఁ గొమరు మిగుల.

టీక:- కపులము = వానరులము; ఐ = అయ్యి; జలరాశిన్ = వారధిని; కట్టుదుమా = కడదామా; అని = అని; కట్టుదరు = నిర్మించెదరు; అడ్డంబు = అడ్డకట్ట, ఆనకట్ట; కాలువలు = కాలువలు; కున్ = కు; మునులము = ఋషులము; ఐ = అయ్యి; తపములున్ = తపస్సులు; మొనయుదమా = గట్టిగా చేద్దామా; అని = అని; మౌనులు = మాట్లాడనివారు; ఐ = అయ్యి; ఉందురు = ఉంటారు (కొంతసేపు); మాటలేకన్ = మాట్లాడుటకుండగ; గంధర్వ = గాయక; వరులము = శ్రేష్ఠులము; ఐ = అయ్యి; గాన = పాటలు పాడుట యందు;

విద్యలు = నేర్పులు; మీఱన్ = అతిశయించునట్లు; పాడుదమా = పాడుదామా; అని = అని; పాడన్ = పాటలు పాడుట; ఛొత్తురు = మొదలిడుదురు; అప్సరస్ = అప్సరస; జనులము = సమూహములు; ఐ = అయ్యి; ఆడుదమా = నృత్యములు చేద్దామా; అని = అని; ఆడు = స్త్రీల, నర్తకుల; రూపమున్ = ఆకృతి; తాల్చి = ధరించి; ఆడన్ = నాట్యమాడుట; చనుదురు = మొదలిడుదురు; అమర = దేవతలు.

దైత్య = రాక్షసులు; వరులము = శ్రేష్ఠులము; ఐ = అయ్యి; అబ్ధిన్ = సముద్రమును; త్రత్తమా = చిలికెదమా; అని = అని; సరోవరములన్ = చెరువుల; అందున్ = లో; హస్త = చేతులు యనెడి; దండ = కఱ్ఱల; చయమున్ = సమూహములను; త్రిప్పి = తిప్పి; తరుతురు = తుళ్ళించెదరు; తమ = వారి; ఈడు = తోటి; కొమరులు = పిల్లలు; అనుచరింపన్ = అలాగే చేయుచుండగా; కొమరులు = అందములు; మిగులన్ = అతిశయించునట్టు.

భావము:- ఆ బలరామకృష్ణులూ గోపాలబాలురూ దూడలను కాచే సమయాలలో రకరకాల ఆటలు ఆడుకునేవారు "మనం అందరం కోతుల మట సముద్రానికి వారధి కడదామా" అంటూ కాలువలకు అడ్డం కడుతూ ఉంటారు. "మనం మునులమట తపస్సు చేసుకుందామా" అంటూ కన్నులు మూసుకుని మునులవలె మౌనంగా ఉండి పోతారు. "మనం గంధర్వ శ్రేష్ఠుల మట. ఎవరు పాటలు బాగాపాడుతారో" అంటూ పాటలు పాడుతారు. "మనం అందరం అప్సరసలమట నాట్యం చేద్దామా" అంటూ నర్తకుల వేషాలు వేసుకుని నాట్యాలు చేస్తారు. "మేము దేవతలం; మీరు రాక్షసులు అట; సముద్రాన్ని మథించుదామా" అంటూ చెరువులలో చేరి చేతులతో నీళ్ళు చిలుకుతారు. బలరామకృష్ణులు ఏ పని చేస్తే మిగిలిన గోపకులు అందరూ వారినే అనుసరించి ఆ పనినే చేస్తారు. ఈ విధంగా రకరకాల ఆటపాటలతో వారందరూ అందరికీ ముద్దుగొలిపేటట్లు కన్నులకువిందు చేస్తూ ఉండేవారు.

## చల్దులు గుడుచుట

10.1-455-వ.



**అంత నొక్కనాఁడు రామకృష్ణులు కాంతారంబున బంతిచల్దులు గుడువ నుద్యోగించి ప్రొద్దున లేచి, గ్రద్దనం దమ యింటి లేఁగ కదుపులం గదలించి, సురంగంబులగు శృంగం బులు పూరిం చిన విని, మేలుకని, సంరంభంబున గోపడింభకులు చలిది కావడులు మూఁపున వహించి, సజ్జంబులగు కజ్జంబులు గట్టుకొని పదత్రాణ వేత్రదండం ధరులయి, లెక్కకు పెక్కసంబైన తమతమ క్రేపుకదుపులం జప్పుడించి రొప్పుకొనుచు, గాననంబు జొచ్చి, కాంచన మణి పుంజగుంజాది భూషణ భూషితులయ్యును, ఫల కుసుమ కోరక పల్లవ వల్లరులు తొడవులుగా నిడుకొని, కొమ్ముౕలి మ్ముగఁ బూరించుచు వేణువు లూఁదుచుఁ, దుమ్మెదలం గూడి పాడుచు, మయూరంబులతోడం గూడి యాడుచుఁ, బికంబులం గలసి కూయుచు, శుకం బులం జేరి రొదలు జేయుచుఁ, బులుగుల నీడలం బాఱుచుఁ, బొదరిండ్లం దూఱుచు సరాళంబులగు వాఁగులు గడచుచు, మరాళంబుల చెంత నడచుచు, బకమ్ములం గని నిలుచుచు, సారసం బులం జోపి**

**యలంచుచు, నదీజలంబులం దోఁగుచుఁ, దీగె యుయ్యేలల నూఁగుచు, బల్లంబులం డాఁగుచు, దూరం బుల కేగుచుఁ, గపులసంగడిఁ దరువులెక్కుచు ఫలంబులు మెక్కుచు రసంబులకుంజొక్కుచు నింగికి న్నిక్కుచు నీడలు చూచి నవ్వుచుఁ, గయ్యంబులకుం గాలుదువ్వుచు, చెలంగుచు, మెలంగుచు, వ్రాలుచు, సోలుచు బహుప్రకా రంబుల శరీర వికారంబులు జేయుచు మఱియును.**

టీక:- అంతన్ = అటుపిమ్మట; ఒక్క = ఒకానొక; నాడున్ = దినమున; రామ = బలరాముడు; కృష్ణులున్ = కృష్ణులు; కాంతారంబునన్ = అడవిలో; బంతి = సామూహిక, వరుసలుగా; చల్దులు = చద్దితినుటలు; కుడువన్ = తిన వలెనని; ఉద్యోగించి = అనుకొని; ప్రొద్దునన్ = ఉదయమే; లేచి = నిద్రలేచి; శ్రద్ధనన్ = శ్రేష్ఠముగా; తమ = వారి; ఇంటి = ఇంటికి చెందిన; లేగ = ఆవు దూడల; కదుపులన్ = గుంపులను; కదలించి = పెడలదోలి; సురంగం బులు = మనోహరము లైనవి, సారంగము వంటివి; అగు = ఐన; శృంగంబు లున్ = కొమ్ముబూరాలను; పూరించినన్ = ఊదగా; విని = విని; మేలుకని = నిద్రలు లేచి; సంరంభంబునన్ = సంబరముగా; గోప = యాదవుల; డింభకులు = పిల్లలు; చలిది = చద్ది; కావిడులున్ = కావిళ్ళను {కావిడి – రెండు కొసలలోను వస్తువు లుంచుకొనెడి చిక్కములు కల భుజమున మోపుకొన వీలగు అడ్డకఱ్ఱ ఉండే పరికరము}; మూపునన = భుజము లందు; వహించి = ధరించి; సజ్జంబులు = మంచి రుచి గలవి; అగు = ఐన; కజ్జంబులు = భక్ష్ములను; కట్టుకొని = కట్టలు కట్టుకొని; పదత్రాణ = చెప్పులు; వేత్రదండ = బెత్తములు; ధరులు = ధరించినవారు; అయి = ఐ; లెక్క = లెక్కపెట్టుట; కున్ = కు; పెక్కసంబు = వీలుకానివి; ఐన = అయిన; తమతమ = వారివారి; క్రేపు =

ఆవుదూడల; కదుపులన్ = గుంపులను; చప్పడించి = అరచుచు; రొప్పుకొనుచు = తోలుకొనుచు; కాననంబున్ = అడవిని; ఛొచ్చి = చేరి; కాంచన = బంగారు; మణి = రత్నాల; పుంజ = సమూహముల; గుంజ = గురువింద; ఆది = మున్నగువాని; భూషణ = ఆభరణములచే; భూషితులు = అలంకరింపబడిన వారు; అయ్యును = అయినప్పటికిని; ఫల = పళ్ళు; కుసుమ = పూలు; కోరక = మొగ్గలు; పల్లవ = చిగుళ్ళు; వల్లరులు = గుత్తులను; తొడవులు = అలంకార ములు; కాన్ = అగునట్లు; ఇడుకొని = పెట్టుకొని; కొమ్ములు = కొమ్ము బూరా లను; ఇమ్ముగా = గట్టిగా; పూరించుచున్ = ఊదుతూ; వేణువులున్ = పిల్లన గ్రోవులను; ఊదుచున్ = ఊదుతూ; తుమ్మెదలన్ = తుమ్మెదలతో; కూడి = పాటు; పాడుచున్ = పాడుతు; మయూరంబుల్ = నెమళ్ళ; తోడన్ = తోటి; కూడి = కలిసి; ఆడుచున్ = నాట్యములాడుతూ; పికంబులన్ = కోయలలతో; కలసి = కూడి; కూయుచు = కూయచు; శుకంబులన్ = చిలుకలతో; చేరి = పాటు; రొదలుజేయుచు = అరచుచు; పులుగుల = (ఎగురుతున్న) పక్షుల; నీడలన్ = నీడలతోపాటు; పాఱుచున్ = పరుగెడుతు; పొదరిండ్ల = పొదరిళ్ళలో; దూఱుచున్ = ఛొరబడుతూ; సరాళంబులు = దారాళమైనవి, తిన్ననివి; అగు = ఐన; వాగులున్ = ఏరులను; కడచుచున్ = దాటుతూ; మరాళంబుల = హంసల; చెంతన్ = పక్కలను; నడచుచున్ = నడుస్తూ; బకమ్ములన్ = కొంగలను; కని = చూసి; నిలుచుచున్ = నిలబడుతు; సారసం బులన్ = బెగ్గురుపక్షులను; జోపి = తరమి; అలంచుచు = బెదరించుచు; నదీ = ఏరులలోని; జలంబులన్ = నీటిలో; తోగుచున్ = మునుగుతూ; తీగె = లతల; ఉయ్యేలలన్ = ఉయ్యాల లందు; ఊగుచున్ = ఊగుతూ; పల్లంబులన్ = గోతులలో; డాగుచున్ = దాగికొనుచు; దూరంబులు = ఎక్కువ దూరములు; ఏగుచున్ = వెళ్ళుతు; కపుల = కోతుల; సంగడిన్ = తోపాటు; తరువులు = చెట్లు; ఎక్కుచున్ = ఎక్కుతు; ఫలంబులున్ = పళ్ళు; మెక్కుచు = ఎక్కువగా

**తినుచు; రసంబులు = రుచుల; కున్ = కు; ఛొక్కుచున్ = పరవశించిపోతూ; నింగి = ఆకాశమున; కున్ = కు; నిక్కుచు = గెంతుతు; నీడలున్ = నీడలను; చూచి = చూసి; నవ్వుచున్ = నవ్వుతు; కయ్యంబులు = కలహముల; కున్ = కు; కాలుదువ్వుచు = ఉరుకుచు; చెలంగుచున్ = చెలరేగిపోతూ; మెలంగుచున్ = తిరుగుతూ; వ్రాలుచు = వంగుతూ; సోలుచున్ = తూగుతూ; బహు = అనేక; ప్రకారంబులన్ = రీతుల; శరీర = అవయవములు; వికారంబులున్ = తిప్పటలు; చేయుచున్ = చేస్తూ; మఱియును = అంతేకాకుండా.**

**భావము:- ఒకరోజు బలరామకృష్ణులు గోపబాలురు అందరూ కలసి వనభోజనాలు చేయాలని సరదాపడ్డారు. ప్రొద్దుటే లేచి గబగబ తమ ఇంటి లేగదూడలను బయటకి తోలుకుని వచ్చారు. అందమైన కొమ్ముబూరలను పూరించి ఊదగానే మిగిలిన గోపకుమారులు అందరూ మేల్కొన్నారు. చల్దిఅన్నం కావడులను భుజాలకు తగిలించుకున్నారు. తల్లులు సిద్ధం చేసి ఉంచిన రకరకాల పిండివంటలు మూటలు కట్టుకున్నారు. కాళ్ళకు చెప్పులు చేతికి కఱ్ఱలు ధరించారు. లెక్కపెట్టడానికికూడా కష్టం అనిపించే తమతమ లేగల మందలను "హెహెయ్" అనే కేకలతో తోలుకుంటూ బయలుదేరారు. పరుగులతో ఆయాసపడుతూ అడవిలో ప్రవేశించారు. బంగారు మణిభూషణాలు ధరించి ఉన్నా పూలను చివుళ్ళను చిన్నచిన్న పండ్లను అలంకారాలుగా ధరించారు. కొమ్ముబూరాలు పూరిస్తూ; పిల్లనగ్రోవులు ఊదుతూ; తుమ్మెదల తోపాటు ఝుమ్మని పాడుతూ; నెమళ్ళతో సమానంగా నాట్యంచేస్తూ; కోకిలలను మిగిలిన పక్షులను అనుకరిస్తూ; చిలుకల తోపాటు అరుస్తూ కేరింతలు కొట్టారు; పైన పక్షులు ఎగురుతుంటే వాటి నీడల తోపాటు తామూ పరిగెత్తారు; జలజలపారే సెలయేళ్ళను చెంగున దూకారు; హంసలను అనుసరిస్తూ వెళ్ళారు; కొంగల తోపాటు ఒంటికాలిపై నిలపడ్డారు; బెగ్గురు పక్షులను తరమితరిమి కొట్టారు; గోతులలో దాక్కున్నారు; తీగల ఊయలు**

లూగేరు; దూరాలకు పరుగు పందాలు వేసుకున్నారు; కోతులతో చెట్లు ఎక్కారు; పండ్లుతిని వాటి రసాలకు పరవశించిపోయారు; కుప్పించి దూకి తమ నీడలను చూసి నవ్వుకున్నారు; ఒకరితో ఒకరు పోట్లాడుకున్నారు; అలా కేరింతలు కొడుతూ ఎన్నో రకాల ఆటలు ఆడుకున్నారు.

10.1-456-క. *

ఒకనొకని చల్దికావిడి
నొకఁ డొకఁ డడకించి దాఁచు; నొకఁ డొకఁ డది వే
ఱొక డొకని మొఱఁగికొని చను
నొక డొకఁ డది దెచ్చి యిచ్చు నుర్వీనాథా!

టీక:- ఒకనొకని = ఒకానొకని యొక్క; చల్ది = చద్ది; కావిడిన్ = కావిడిని; ఒకడొకడు = ఒకానొకడు; అడకించి = వంచించి; దాచున్ = దాచివేయును; ఒకడొకడు = ఒకానొకడు; అది = దానిని; వేఱొకడొకని = మరింకొకని; మొఱఁగికొని = చాటుచేసుకొని; చనున్ = పారిపోవును; ఒకడొకడు = ఒకానొకడు; అది = దానిని; తెచ్చి = తీసుకొనివచ్చి; ఇచ్చున్ = ఇచ్చును; ఉర్వీనాథా = రాజా {ఉర్వీనాథుడు - ఉర్వి (భూమి)కి నాథుడు, రాజు}.

భావము:- ఓరాజా! ఒకతని చల్ది కావిడి మరొకతను అదిలించి లాక్కొని దాచేసాడు. ఇంకొకతను మరొకని అడ్డుపెట్టుకొని తీసుకుపోయాడు. మరింకొకతను ఆ కావిడిని తీసుకొని వచ్చి యిచ్చేసాడు.

అలతిపొలతి పదాలతో కళ్ళకు కట్టినట్టు చెప్పటంలో చెప్పకొౕదగ్గ పోతన, తన భాగవతంలో అద్భుతంగా ఆవిష్కరించిన ఘట్టాలలో చల్దులు గుడుచుట ఒకటి. అలా మిక్కిలి ప్రసిద్ధమైన యీ పద్యం ఆ ఘట్టంలోది.

10.1-457-క. *

**ఒక్కఁడు ము న్నేమఱి చన**

**నొక్కఁడు బలుబొబ్బ పెట్టు నులికిపడన్; వే**

**ఱొక్కఁడు మిట్టి తటాలున**

**నొక్కని కనుదోయి మూయు నొక్కఁడు నగఁగన్.**

టీక:- ఒక్కడు = ఒకానొకడు; మున్ను = ముందుకి; ఏమఱి = పరాకుపడి; చనన్ = పోగా; ఒక్కడున్ = ఒకానొకడు; పలు = పెద్ద; బొబ్బన్ = కేకలు; పెట్టున్ = వేయును; ఉలికిపడన్ = ఉలికిపడునట్లుగా; వేఱొక్కడు = మరింకొకడు; మిట్టి = అతిశయించి; తటాలున = చటుక్కున; ఒక్కని = ఒకానొకని; కను = కళ్ళు; దోయి = రెంటిని (2); మూయున్ = చేతులతో కప్పివేయును; ఒక్కడున్ = ఒకానొకడు; నగగన్ = నవ్వుతుండగా.

భావము:- పరధ్యానంగా ఒక గోపకుమారుడు ముందు నడుస్తుంటే గమనించినవాడు, అత నులిక్కిపడేలా పెనుబొబ్బ పెట్టాడు. ఒక గోపడు మరొకని కళ్ళు పెనకనించి తటాలున మూసాడు. అది చూసి ఇంకొకడు పకపక నవ్వుతున్నాడు.

10.1-458-క. *

**తీపుగల కజ్జ మన్యుఁడు**

**కోపింపఁగ నొడిసి పుచ్చుకొని త్రోపాడం**

**బైపడి యది గొని యొక్కఁడు**

**క్రేపులలో నిట్టునట్టుఁ గికురించు నృపా!**

టీక:- తీపు = తియ్యదనము; కల = ఉన్న; కజ్జమున్ = భక్ష్యమును, తీపిపిండివంట {కజ్జికాయలు – తీపితినుబండారము (కొబ్బరి కోరు బెల్లం

పాకంలో పట్టించినది లస్కోరా, లౌజు అంటారు. పిండి పూరీలా గుండ్రంగా వత్తి ముందు చేసుకున్న లస్కోరా మధ్యలో పెట్టి సగానికి మడుస్తారు. రెండు పొరలు కలపటానికి అందంగా నొక్కులు నొక్కుతారు. అప్పుడు కాగుతున్న నూనెలో వేయిస్తారు. కొద్దిగా పొంగుతాయి. వాటిని కజ్జికాయలు అంటారు)}; అన్యుడు = ఇంకొకడు; కోపింపన్ = కోపపడునట్లుగా; ఒడిసి = లాగి; పుచ్చుకొని = తీసుకొని; త్రోపాడన్ = తోయగా; పైపడి = మీదపడి; అది = దానిని; కొని = తీసుకొని; ఒక్కడు = ఒకానొకడు; క్రేపుల = ఆవుదూడల; లోన్ = మధ్యలో; ఇట్టునట్టు = ఇటునటు; కికురించున్ = తప్పించుకొంటు తిరుగును; నృపా = రాజా.

భావము:- ఓ పరీక్షి న్మహారాజా! తియ్యటి పిండివంట ఒకడి చేతిలోంచి మరొకడు లాక్కుని పారిపోతున్నాడు. మొదటి వాడు ఉడుక్కున్నాడు. ఇంతలో ఇంకొకడు దానిని లాక్కుని పోయి, దూడల మధ్య అటు యిటు పరిగెడుతు ఏడిపించసాగాడు.

10.1-459-క.

వనజాక్షుఁడు ము న్నరిగిన
మునుపడఁగా నతని నేనె ముట్టెద ననుచుం
జని మునుముట్టనివానిన్
మునుముట్టినవాఁడు నవ్వు మొనసి నరేంద్రా!

టీక:- వనజాక్షుడు = కృష్ణుడు; మున్ను = ముందుకు; అరిగినన్ = పోగా; మునుపడన్ = ముందుగా; అతనిన్ = అతనిని; నేనె = నేనే; ముట్టెదన్ = ముట్టుకొనె దను; అనుచున్ = అంటూ; చని = వెళ్ళి; మును = ముందుగా; ముట్టని = ముట్టుకొనని; వానిన్ = అతనిని; మును = ముందుగా; ముట్టిన =

ముట్టుకొన్న; వాడు = అతను; నవ్వున్ = ఎగతాళిచేయును; మొనసి = పూని; నరేంద్రా = రాజా {నరేంద్రుడు – నరులకు ఇంద్రుని వంటి వాడు, రాజు}.

భావము:– మహారాజా! కృష్ణుడు ముందు వెళ్తుంటే, ఇద్దరు బాలకులు కృష్ణుణ్ణి "నేనే అంటే నేనే ముందు ముట్టుకుంటాను" అంటూ పరుగు లెత్తారు. ముందు ముట్టుకోగలిగినవాడు ముట్టుకోలేనివాడిని చూసి పకపక నవ్వాడు.

10.1–460–వ.

ఇ వ్విధంబున.

టీక:– ఈ = ఈ; విధంబునన్ = విధముగ.

భావము:– ఇలా కృష్ణుని సహచర్యంతో గోపబాలలు. . .

10.1–461–ఉ.

ఎన్నఁడునైన యోగివిభు లెవ్వని పాదపరాగ మింతయుం
గన్నులఁగాన రట్టి హరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టఁ బట్టుచుం
దన్నుచుగ్రుద్దుచున్నగుచుఁ దద్దయుఁబైఁపడికూడి యాడుచుం
మన్నన జేయు వల్లవకుమారుల భాగ్యము లింత యొప్పునే?

టీక:– ఎన్నడున్ = ఎప్పుడు; ఐనన్ = కూడా; యోగి = ఋషులలో; విభులు = శ్రేష్ఠులు ఐనను; ఎవ్వని = ఎవరి యొక్క; పాద = కాలి; పరాగమున్ = దుమ్మురేణువులు; ఇంతయున్ = కొంచెముకూడ; కన్నులన్ = కళ్ళతో; కానరు = చూడలేరో; అట్టి = అటువంటి; హరిన్ = విష్ణుమూర్తిని; కౌగిటన్ = ఆలింగనము; చేర్చుచున్ = చేసికొనుచు; చెట్టపట్టుచున్ = కలిసి తిరుగుతూ; తన్నుచున్ = సరదాగా తన్నుకొనుచు; గ్రుద్దుచున్ = సరదాగా కొట్టుకొనుచు; నగుచున్ = నవ్వుకొనుచు; తద్దయున్ = అస్తమాను; పైపడుచున్ = మీదపడుతు; కూడి = కలిసి; ఆడుచున్ = ఆడుకొనుచు; మన్ననజేయు = మన్నించెడి; వల్లవ

= యాదవ; కుమారుల = పిల్లల; భాగ్యములు = అదృష్టములు; ఇంత = ఎంత ఎక్కువగా; ఒప్పనే = చక్కగా కలిగెననో కదా.

భావము:- మహాయోగులు కూడా ఏ పరమపురుషుని పాదపద్మాల ధూళి కొంచెం కూడా చూడను కూడా చూడలేరో, అంతటి వాడు అయిన కృష్ణునితో గోపబాలకులు కలిసి మెలసి ఆడుకున్నారు. అతడిని కౌగిలించుకుంటూ, అతనితో చెట్టపట్టాలు పట్టి తిరుగుతూ, తన్నుతూ, గ్రుద్దుతూ, హాస్యాలాడుతూ, మీదపడుతూ, కలసి ఆడుకుంటూ ప్రేమిస్తున్నారు. చెప్పలే నంతటిది కదా ఈ గోపబాలకుల భాగ్యం.

10.1-462-క.

విందులకును బ్రహ్మసుఖా
నందం బై భక్తగణమునకు దైవత మై
మందులకు బాలుఁ డగు హరి
పొందుఁ గనిరి గొల్ల; లిట్టి పుణ్యులు గలరే?"

టీక:- విందుల్ = చుట్టములు, జ్ఞానులు; కును = కు; బ్రహ్మ = అత్యధికమైన; సుఖ = సౌఖ్యము; ఆనందంబున్ = ఆనందము కలిగించునది; ఐ = అయ్యి; భక్త = భక్తుల; గణమున్ = సమూహముల; కున్ = కు; దైవతము = మిక్కిలి సేవింపదగినవాడు {దైవము - దైవతరము - దైవతమము}; ఐ = అయ్యి; మందులు = అజ్ఞానుల; కున్ = కు; బాలుడు = చిన్నపిల్లవాడు; అగు = ఐన; హరిన్ = శ్రీకృష్ణుని; పొందు = చేరిక; కనిరి = పొందిరి; గొల్లలు = యాదవులు; ఇట్టి = ఇంతటి; పుణ్యులు = పుణ్యాత్ములు; కలరే = ఉన్నారా, ఉండరు.

భావము:- జ్ఞానులకు బ్రహ్మానంద స్వరూపుడూ, భక్తులకు ఆరాధ్య దైవమూ అయిన ఆ భగవంతుడు; అజ్ఞానులకు బాలుని వలె కనిపిస్తున్నాడు.

**ఆయన ఎవరు ఏ విధంగా భావిస్తే ఆ విధంగా అనుగ్రహించేవాడు. అటువంటి కృష్ణుని సాన్నిధ్యాన్ని ఆ గోపాలకులు పొందారు. ఆహా! ఇంతటి పుణ్యాత్ములు ఎక్కడైనా ఉన్నారా!"**

## అఘాసుర వధ

**10.1-463-వ.**

**అని పలికి శుకయోగీంద్రుండు మఱియు ని ట్లనియె.**

**టీక:- అని = అని; పలికి = తెలియజెప్పి; శుక = శుకుడు యనెడి; యోగి = యోగులలో; ఇంద్రుడు = శ్రేష్ఠుడు; మఱియున్ = ఇంకను; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.**

**భావము:- ఇలా చెప్పి శుకయోగీంద్రుడు పరీక్షన్మహారాజుతో మరల ఇలా అన్నాడు.**

**10.1-464-క.**

**"అమరు లమృతపానంబున**
**నమరిన వా రయ్యు నే నిశాటుని పంచ**
**త్వమునకు నెదుళ్ళు చూతురు**
**తము నమ్మక యట్టి యఘుఁడు దర్పోద్ధతుఁడై.**

**టీక:- అమరులు = దేవతలు; అమృత = అమృతమును; పానంబున్ = తాగుట; అమరిన = చక్కగా కలిగిన; వారు = వారు; అయ్యున్ = అయినప్పటికిని; ఏ = ఏ ఒక్క; నిశాటునిన్ = రాక్షసుని {నిశాటుడు - నిశ (రాత్రి) చరించువాడు, రాక్షసుడు}; పంచత్వంబున్ = చావున {పంచత్వము - పంచభూతములకు తిరిగి చెందుట, మరణము}; కున్ = కు; ఎదుళ్ళు =**

ఎదురుచూచుటలు; చూతురున్ = చూచెదరో; తము = తమ శక్తిసామర్థ్యములను; నమ్మక = నమ్మలేక; అట్టి = అటువంటి; అఘుడు = అఘాసురుడు; దర్ప = గర్వము; ఉద్ధతుడు = అధికముగా కలవాడు; ఐ = అయ్యి.

భావము:- "ఇలా ఉండగా కొంతకాలానికి అఘాసరుడు అనే రాక్షసుడు బయలుదేరాడు. దేవతలు అమృతం త్రాగి మరణం లేని వారైనా, ఈ అఘాసురుడి పేరు చెబితే బెదిరి పోతారు. ఈ అఘాసురుడు ఎప్పుడు మరణిస్తాడా అని, వారు ఎదురుచేస్తూ ఉంటారు.

10.1-465-క.

బకునికిఁ దమ్ముఁడు గావున
బకమరణముఁ దెలిసి కంసు పంపున గోపా
లక బాలురఁతోఁ గూఁడను
బకవైరినిఁ ద్రుంతు ననుచుఁ బటురోషమునన్.

టీక:- బకుని = బకాసురుని; తమ్ముడు = చిన్నసోదరుడు; కావునన్ = కనుక; బక = బకాసురుని; మరణము = చావు; తెలిసి = తెలిసికొని; కంసున్ = కంసుని యొక్క; పంపునన్ = ఆజ్ఞ ప్రకారముగ; గోపాలక = యాదవుల; బాలుర = పిల్లల; తోన్ = తో; కూడన్ = కలిపి; బకవైరినిన్ = శ్రీకృష్ణుని {బకవైరి - బకాసురుని శత్రువు, కృష్ణుడు}; త్రుంతును = సంహరించెదను; అనుచున్ = అనుచు; పటు = తీవ్రమైన; రోషమునన్ = కోపముతో.

భావము:- ఆ అఘాసురుడు బకాసురుడి తమ్ముడు. కంసుడి ఆజ్ఞానుసారం అతడు తన తమ్ముడిని చంపినవాడిని తోడి బాలకులతో సహా చంపుతాను అని గర్వంతో రెచ్చిపోయి బయలుదేరాడు.

10.1-466-క.

"బాలురు ప్రాణంబులు గో
పాలురకు; మదగ్రజాతు ప్రాణము మా ఱీ
బాలురఁ జంపిన నంతియ
చాలును; గోపాలు రెల్ల సమసిన వారల్."

టీక:- బాలురు = పిల్లలే; ప్రాణంబులున్ = పంచప్రాణములు; గోపాలుర = యాదవుల; కున్ = కు; మత్ = నా యొక్క; అగ్రజాతున్ = అన్న యొక్క {అగ్రజాతుడు - ముందు పుట్టినవాడు, అన్న}; ప్రాణము = చావునకు; మాఱు = బదులు; ఈ = ఈ; బాలురన్ = పిల్లలను; చంపినన్ = చంపివేసినచో; అంతియన్ = అది; చాలును = సరిపోవును; గోపాలురన్ = గొల్లలను; ఎల్లన్ = అందరు; సమసిన = నశించిన; వారల్ = వారగు.

భావము:- అఘాసురుడు "గోపాలకులకు ప్రాణాలు వారి మగ పిల్లలు. మా అన్న బకాసురుని ప్రాణానికి బదులుగా ఈ పిల్లగాళ్ళను చంపేస్తే చాలు. గోపాలకులు అందరూ చచ్చినట్లే."

10.1-467-వ.

అని నిశ్చయించి, యోజనంబు నిడుపును, మహాపర్వ
తంబు పొడుపును, గొండతుదల మీఱిన కోఱలును,
మిన్నుదన్ని పన్నిన నల్ల మొగిళ్ళ పెల్లుగల పెదవులును,
బిలంబులకు నగ్గలంబు లయిన యిగుళ్ళ సందులును,
నంధకారబంధురంబయిన వదనాంతరాళంబును,
దావానల జ్వాలాభీలంబయిన దృష్టిజాలంబును,

**వేఁడిమికి నివాసంబులయిన యుచ్ఛ్వాస నిశ్వాసంబులును మెఱయ, నేల నాలుకలు పఱచుకొని ఘోరంబగు నజగ రాకారంబున.**

టీక:- అని = అని; నిశ్చయించి = నిర్ణయించుకొని; యోజనంబు = ఆమడంత; నిడుపును = పొడవు; మహా = గొప్ప; పర్వతంబు = పర్వతమంత; పొడవును = ఎత్తు; కొండ = కొండల; తుదలన్ = శిఖరముల; మీఱిన = మించిన; కోఱలును = కోఱపళ్ళు; మిన్నున్ = ఆకాశమువరకు; తన్ని = అంటి; పన్నిన = వ్యాపించిన; నల్ల = నల్లటి; మొగిళ్ళు = మబ్బుల; పెల్లు = అతిశయము; కల = కలిగినట్టి; పెదవులును = పెదవులు; బిలంబులు = గుహల; కున్ = కు; అగ్గలంబులు = మించినట్టివి; అయిన = ఐన; ఇగుళ్ళ = పళ్ళ ఇగుళ్ళ మధ్యన గల; సందులు = ఖాళీ స్థలములు; అంధకార = చీకటితో; బంధురంబు = గుడ్డిపైపోయినవి; అయిన = ఐనట్టి; వదన = నోటి; అంతరాళంబును = లోపలి భాగము; దావానల = కార్చిచ్చు; జ్వాలా = మంటలవలె; అభీలంబు = భయంకర మైనవి; అయిన = ఐనట్టి; దృష్టిజాలంబును = చూపులు; వేడిమి = ఉష్ణత్వమున; కిన్ = కు; నివాసంబులు = ఉనికిపట్లు; అయిన = ఐనట్టి; ఉచ్ఛ్వాసనిశ్వాసంబు లును = ఊపిర్లు; మెఱయన్ = ప్రాకాశించుచుండగా; నేలన్ = నేలమీద; నాలుకలు = నాలుకలను; పఱచుకొని = జాపిపరచి; ఘోరంబు = భయంకరమై నది; అగు = ఐనట్టి; అజగర = కొండచిలువ; ఆకారంబునన్ = రూపముతో;

భావము:- అని నిశ్చయించుకున్న అఘాసురుడు ఘోరమైన కొండచిలువ రూపాన్ని ధరించాడు. ఆ కొండచిలవ యోజనం పొడుగుతో, మహాపర్వతమంత పెద్దగా ఉంది. దాని కోరలు పర్వతశిఖరాలను మించిపోయి ఉన్నాయి. నల్లని మేఘాల వంటి పెదవులు తెరచి ఉండగా పైపెదవి అకాశాన్ని, క్రిందపెదవి నేలని తన్నుతున్నట్లు ఉంది. దాని కోరల మధ్యన ఉన్న సందులు

పర్వత గుహల వలె ఉన్నాయి. అంధకార బంధురమైన నోటితో భయంకరంగా ఉంది. దాని చూపుల నుండి అగ్నిజ్వాలలు భీకరంగా వెలువడుతున్నాయి. దాని ఉచ్ఛ్వాస నిశ్వాసములు భరించలేనంత వేడిగా నిప్పులు కురిపిస్తున్నాయి. ఆ రాకాసి కొండచిలువ నాలుకలు నేల మీద పరచుకుని పడుకుని ఉంది.

10.1-468-క.

"జాపిరము లేక యిప్పుడు
క్రేపుల గోపాలసుతులఁ గృష్ణునితోడన్
గోపెట్టఁగ మ్రింగెద" నని
పాపపు రక్కసుఁడు త్రోవఁ బడి యుండె నృపా!

టీక:- జాపిరము = జాగు, ఆలస్యము; లేక = జరగకుండ; ఇప్పుడు = ఇప్పుడు; క్రేపులన్ = ఆవుదూడలను; గోపాల = యాదవుల; సుతులన్ = పిల్లలను; కృష్ణుని = కృష్ణుని; తోడన్ = తోపాటు; గోపెట్టగన్ = గోపెట్టి ఏడ్చునట్లుగ; మ్రింగెదను = మింగివేసెదను; అని = అని; పాపపు = పాపిష్టి పాము రూప; రక్కసుడు = రాక్షసుడు; త్రోవన్ = దారిలో; పడి = పడుకొని; ఉండెన్ = ఉండెను; నృపా = రాజా.

భావము:- "గిలగిలా కొట్టుకునేలా చేసి ఈ గొల్లపిల్లలనూ. దూడలను కృష్ణుడితో పాటు కలిపి ఇప్పటికి ఇప్పుడే మింగేస్తాను." అనుకుంటూ ఆ రాక్షసుడు దారిలో నోరు తెరుచుకుని పడుకుని ఉన్నాడు.

10.1-469-వ.

ఆ సమయంబున.

టీక:- ఆ = ఆ; సమయంబునన్ = సమయము నందు.

భావము:- అలా అఘాసురుడు ఎదురుచూస్తూ పడి ఉన్న ఆ సమయంలో.

10.1-470-మ.

**"ఒక వన్యాజగరేంద్ర మల్లదె గిరీంద్రోత్సేధ మై దావ పా**

**వక కీలా పరుష ప్రచండతర నిశ్వాసంబుతో ఘోర వ**

**హ్ని కరాళాతతజిహ్వతోడ మనలన్ హింసింప నీక్షించుచున్**

**వికటంబై పడి సాగి యున్నది పురోవీధిం గనుంగొంటిరే?"**

టీక:- ఒక = ఒకానొక; వన్య = అడవిలో తిరిగే; అజగరేంద్రము = శ్రేష్ఠమైన కొండచిలువ; అల్లదె = అదిగో; గిరీంద్ర = హిమాలయాలంత; ఉత్సేధము = పొడవైన శరీరము కలది; ఐ = అయ్యి; దావపావక = కార్చిచ్చు; కీలా = మంటలవంటి; పరుష = తీవ్రమైన; ప్రచండతర = మిక్కిలి చేర రాని {ప్రచండము - ప్రచండతరము - ప్రచండతమము}; నిశ్వాసంబు = ఊపిరుల; తోన్ = తోటి; ఘోర = భయంకరమైన; వహ్ని = అగ్నివలె; కరాళ = భీతికరమైన; ఆతత = విస్తృతమైన; జిహ్వ = నాలుకల; తోడన్ = తోటి; మనలన్ = మనలను; హింసింపన్ = చంపుటకు; ఈక్షించుచున్ = ఎదురుచూచుచు; వికటంబు = అతిపెద్దది; ఐ = అయ్యి; పడి = పడుకొని; సాగి = సాగిలబడి; ఉన్నది = ఉంది; పురో = ఎదురుగా ఉన్న; వీధిన్ = దారిలో; కనుంగొంటిరే = చూసారు కదా.

భావము:- ఆ దారిన వస్తూ ఉన్న గోపబాలకులు కొండచిలువను చూసారు. "అదిగో అడవి కొండచిలువ పర్వతమంత పెద్ద శరీరంతో పడుకుని ఉంది చూసారా? అగ్నిజ్వాలలతో తీక్ష్ణమైన బుసలు భయంకరంగా కొడుతోంది చూడండి. దాని చాచిన నాలుకల నుండి అగ్నిజ్వాలలు రేగుతున్నాయి చూసారా? మనలను చంపేద్దాం అని మన దారి మధ్యలో అడ్డంగా పడుకుని ఉంది."

10.1-471-వ.

**అని యొండొరులకుం జూపుచు.**

టీక:- అని = అని; ఒండొరుల్ = ఒకరికొకరు; కున్ = కు; చూపుచున్ = చూపించుకొనుచు.

భావము:- అంటూ ఒకరి కొకరు పామును చూపించు కున్నారు.

10.1-472-మ.

"బకునింజంపినకృష్ణుఁ డుండ మనకుం బాముంచుఁ జింతింప నే
టికి? రా పోదము దాఁటి; కాక యది కౌటిల్యంబుతో మ్రింగుడున్
బకుపెంటం జనుఁ గృష్ణుచేత" ననుచుం బద్మాక్షు నీక్షించి యు
త్సుకులై చేతులు వ్రేసికొంచు నగుచున్ దుర్వారులై పోవగన్.

టీక:- బకునిన్ = బకాసురుని; చంపిన = సంహరించిన; కృష్ణుండు = కృష్ణుడు; ఉండన్ = ఉండగా; మన = మన; కున్ = కు; పాము = సర్పము; అంచున్ = అనుచు; చింతింపన్ = విచారపడుట; ఏటికిన్ = ఎందుకు; రా = రమ్ము; పోదము = వెళ్ళెదము; దాటి = దాటుకొని; కాక = అలాకాకపోయినచో; అది = అది; కౌటిల్యంబు = కుటిలత్వము; తోన్ = తోటి; మ్రింగుడున్ = మింగివేసినచో; బకు = బకాసురుని; వెంటన్ = వెనుకనే; చనున్ = చచ్చిపోవును; కృష్ణు = కృష్ణుని; చేతన్ = వలన; అనుచున్ = అనుచు; పద్మాక్షున్ = కృష్ణుని; ఈక్షించి = ఉద్దేశించి; ఉత్సకులు = ఉత్సాహము కలవారు; ఐ = అయ్యి; చేతులు = చేతులను; వ్రేసికొంచున్ = ఒకరిపై నొకరు వేసికొని; నగుచున్ = నవ్వుతు; దుర్వారులు = అడ్డగింపరానివారు; ఐ = అయ్యి; పోవగన్ = వెళ్ళుచుండగా.

భావము:- కానీ ఎవరూ భయపడటం లేదు "బకాసురుడు అంతవాడిని సంహరించిన కృష్ణుడు ఉండగా మనకి ఈ పాములంటే భయం దేనికి. రండత్రా! పోదాం. కాదు వంకరబుద్ధితో మనలని దిగమింగిందా, బకాసురుడి లాగే ఇది కచ్చితంగా చచ్చిపోతుంది. అంతే" అనుకుంటూ కృష్ణుడిని చూస్తూ

గోపబాలురు అందరూ ఒకరి మీద ఒకరు చేతులు వేసుకుంటూ, నవ్వుకుంటూ ముందుకు సాగిపోయారు. వారిని వారించడం ఎవరికీ సాధ్యం కాదు.

10.1-473-వ.

వారలం జూచి హరి తన మనంబున.

టీక:- వారలన్ = వారిని; చూచి = కనుగొని; హరి = కృష్ణుడు; తన = అతని యొక్క; మనంబునన్ = మనసునందు.

భావము:- అలా ఆ కొండచిలువగాడి నోటి లోనికి గొల్లపిల్లలు వెళ్తుంటే, కృష్ణుడు తన మనసులో. . . . .

10.1-474-ఉ.

"అర్భకులెల్లఁ బాము దివిజాంతకుఁ డౌట యెఱుంగ; రక్కటా!
నిర్భయులై యెదుర్కొనిరి నేఁగల"నంచు "విమూఢు"లంచు నా
విర్భవదాగ్రహత్వమున వెందగులన్ దమ లేఁగపిండుతో
దుర్భర ఘోర సర్ప ఘన తుండ బిలాంతముఁ జొచ్చి రందఱున్.

టీక:- అర్భకులు = చిన్నపిల్లలు; ఎల్లన్ = అందరు; పాము = సర్పమును; దివిజాంతకుడు = రాక్షసుడు {దివి జాంతకుడు - దివిజు (దేవత)లను అంతకుడు (చంపువాడు), రాక్షసుడు}; ఔటన్ = అయ్యి ఉండుటను; ఎఱుంగరు = తెలియనివారు; అక్కటా = అయ్యో; నిర్భయులు = భయము లేనివారు; ఎదుర్కొనిరి = ఎదురుగా పోయితిరి; నేన్ = నేను; కలను = ఉన్నాను కదా; అంచున్ = అని భావించుచు; విమూఢులు = తెలివితక్కువవారు; అంచున్ = అనుచు; ఆవిర్భవత్ = పుట్టుచున్న; ఆగ్రహత్వమునన్ = కోపముతో; వెన్ తగులన్ = వెంబడింపగా; తమ = వారి యొక్క; లేగ = దూడల; పిండు = మందల; తోన్ = తో; దుర్భర = భరింపరాని; ఘోర = భయంకరమైన; సర్ప =

**పాము యొక్క; ఘన = అతిపెద్ద; తుండ = నోరు యనెడి; బిల = గుహ; అంతమున్ = లోపలికి; ఛొచ్చిరి = ప్రవేశించిరి; అందఱున్ = అందరు.**

**భావము:- అప్పుడు, కృష్ణుడు చూసి ఇలా అనుకున్నాడు "అయ్యో! ఈ అర్భకులు అందరూ ఇది మామూలు పాము కాదని మహా రాక్షసుడనీ తెలుసుకోలేదు. నేను ఉన్నానని మొండి ధైర్యంతో నిర్భయంగా దానిని ఎదుర్కొంటున్నారు." కృష్ణునికి వెంటనే రాక్షసునిపై కోపంవచ్చింది. అతడు కూడా వారి వెనుకనే పాము నోటిలో ప్రవేశించాడు. బాలకులు అందరూ తమ లేగలతో సహా భయంకరమైన ఆ చిలువ నోటిలో ప్రవేశించారు.**

**10.1-475-వ.**

**అ య్యవసరంబున.**

**టీక:- ఆ = ఆ; అవసరంబునన్ = సమయమునందు.**

**భావము:- అలా గోపబాలురూ లేగలూ అఘాసురుని నోటిలోనికి వెళ్ళిన ఆ సమయంలో. . .**

**10.1-476-శా.**

**వేల్పుల్ చూచి భయంబు నొంద గ్రసనావేశంబుతో నుజ్జ్వల**
**త్కల్పాంతోజ్జ్వలమాన జిహ్వ దహనాకారంబుతో ఖ్రంగె న**
**స్వల్పాహీంద్రము మాధవార్పిత మనోవ్యాపార సంచారులన్**
**యల్పాకారుల శిక్యభారులఁ గుమారాభీరులన్ ధీరులన్.**

**టీక:- వేల్పుల్ = దేవతలు; చూచి = కనుగొని; భయంబున్ = బెదిరి; ఒందన్ = పొందగా; గ్రసన = మింగివేయవలె ననెడి; ఆవేశంబునన్ = ఆతృతతో, అక్కరతో; ఉజ్జ్వల = మిక్కిలి ప్రకాశించెడి; కల్పాంత = ప్రళయకాలపు; ఉజ్జ్వలమానత్ = మండుతున్న; జిహ్వ = అగ్నికీలల; దహన్ =**

అగ్నివంటి; ఆకారంబు = ఆకృతి; తోన్ = తోటి; మ్రింగెన్ = మింగివేసెను; అస్వల్ప = పెద్దది, చిన్నదికానిది; అహి = సర్పములలో; ఇంద్రము = గొప్పది; మాధవ = శ్రీకృష్ణునకు; అర్పిత = అర్పింపబడిన; మనోవ్యాపార = భావములు; సంచారులన్ = నడవడికలు కలవారిని; అల్ప = చిన్నచిన్న; ఆకారులన్ = ఆకారములు కలవారిని; శిక్య = కావడిచిక్కములు; భారులన్ = మోయుచున్న వారిని; కుమార = పిల్ల; అభీరులన్ = గోపాలకులను; ధీరులన్ = ధైర్యము కలవారిని.

భావము:- అప్పుడు అఘాసురుడు వారిని అందరినీ మ్రింగేసే ఆవేశంతో నోరు ఒక్కసారిగా అప్పళించాడు. ప్రళయ కాలంలో భగ్గున జ్వలించే భయంకర జ్వాలలవలె మంటలు మండుతున్న తన నాలుకతో వారిని అందరినీ నోటి లోనికి లాక్కుని మ్రింగేశాడు. దేవతలు అందరూ ఆ మహాసర్పం వారిని మ్రింగడం చూసి భయపడిపోయారు. ఆ గొల్లపిల్లలు మనస్సులు ఎప్పుడూ కృష్ణుని చుట్టూనే తిరుగుతూ ఉంటాయి. వారు శారీరకంగా బలవంతులు కారు. చిన్నపిల్లలు తాము మోస్తున్న చిక్కములు కూడా వారికి బరువే. అయినా ఆ గోపకుమారులు కృష్ణునికి తమను తాము సమర్పించుకున్నవారు కనుక చాలా ధైర్యం ఉన్నారు.

10.1-477-వ.

**ఇట్లు పెనుబాముచేత మ్రింగుడుపడు సంగడికాండ్ర గమిం జూచి కృష్ణుండు.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; పెను = అతిపెద్ద; పాము = సర్పము; చేత = వలన; మ్రింగుడుపడు = భక్షింపబడుతున్న; సంగడికాండ్ర = స్నేహితుల; గమిన్ = సమూహమును; చూచి = చూసి; కృష్ణుండు = కృష్ణుడు.

భావము:- తన మిత్రులు అందరూ అలా ఆ భయంకర సర్పం చేత మ్రింగబడుతూ ఉండడం చూసి, కృష్ణుడు తనలో తాను ఇలా అనుకున్నాడు

10.1-478-ఉ.

**“పడుచులు లేఁగలుం గలసి పైకొని వత్తురు తొల్లి కృష్ణ! మా**
**కొడుకు లదేల రా; రనుచు గోపిక లెల్లను బల్క నేక్రియన్**
**నొడివెద? నేఁడు పన్నగము నోరికి వీరికి నొక్కలంకెగా**
**నొడఁబడ నేలచేసె? విధి యోడక జేయుఁగదయ్య!**
**క్రౌర్యముల్.”**

టీక:- పడుచులు = పిల్లవాళ్ళు; లేగలున్ = దూడలు; కలిసి = కూడి; పైకొని = ఉత్సహించి; వత్తురు = వచ్చెదరు; తొల్లి = ఇంతకు ముందు; కృష్ణ = కృష్ణా; మా = మా యొక్క; కొడుకులు = కుమారులు; అదేల = ఎందుచేత; రారు = రావటంలేదు; అనుచున్ = అనుచు; గోపికలు = గొల్లభామలు; ఎల్లన్ = అందరు; పల్కన్ = అడుగగా; ఏ = ఏ; క్రియన్ = విధముగ; నొడివెదన్ = సమాధానము చెప్పెదను; నేడు = ఇప్పుడు; పన్నగము = పాము యొక్క; నోరు = నోటి; కిన్ = తి; వీరి = వీరి; కిన్ = కి; ఒక్కలంకె = గుత్తగుచ్చిగా; కాన్ = అగునట్లు; ఒడబడన్ = కలుగునట్లు; ఏలన్ = ఎందుకు; చేసెన్ = చేసెను; విధి = బ్రహ్మదేవుడు; ఓడకన్ = వెఱవక; జేయున్ = చేయును; కద = కదా; అయ్య = తండ్రి; క్రౌర్యముల్ = క్రూరపు పనులు.

భావము:- “నేను ఇంటికి వెళ్ళేసరికి గోపికలు ఎదురు వస్తారు. “కృష్ణా! ఇంతవరకూ మా పిల్లలూ లేగదూడలు కలసి పరిగెత్తుకుంటూ ఇంటికి వచ్చేవారు ఇవాళ మా కొడుకులు రారేమిటి? ఏమయ్యారు?” అని అడుగుతారు వారికి నేనేమి జవాబు చెప్పగలను. విధి ఈ రోజు వీరిని గుత్తగుచ్చినట్లు పాము

నోటికి అప్పగించింది. ఈ బ్రహ్మదేవుడు ఎప్పుడూ ఇలాంటి క్రూరకృత్యాలే చేస్తాడేమిటో?"

10.1-479-వ.

**అని తలపోసి, నిఖిలలోచనుండును, నిజాశ్రిత నిగ్రహ మోచనుండు నైన తమ్మికంటి, మింటి తెరువరులు మొఱలిడ రక్కసు లుక్కు మిగుల పెక్కసంబగు నజగరంబయి యున్న య న్నరభోజను కుత్తుకకుం బొత్తుగొని మొత్తంబు పెంటనంటం జని తమ్ము నందఱఁ జిందఱ వందఱ చేసి మ్రింగ నగ్గలించు నజగరంబు కంఠద్వారంబున సమీరంబు వెడలకుండఁ దన శరీరంబుఁ బెంచి గ్రద్ధన మిద్దెచఱచి నట్లుండ.**

టీక:- అని = అని; తలపోసి = భావించి; నిఖిల = సమస్తమును; లోచనుండును = అవలోకించువాడు, కాపాడువాడు; నిజ = తనను; ఆశ్రిత = ఆశ్రయించినవారి; నిగ్రహ = ఇబ్బందులను; మోచనుండున్ = పోగొట్టువాడు; ఐన = అయినట్టి; తమ్మికంటిన్ = కృష్ణు {తమ్మికంటి - తమ్మి (పద్మ) కంటి (అక్షుడు), విష్ణువు}; మింటితెరువరులు = దేవతలు {మింటితెరువరులు - మింటి (ఆకాశ) తెరువు (మార్గమున) సంచరించెడి వరులు (ఉత్తములు), దేవతలు}; మొఱలిడ = గోలపెడుతుండ; రక్కసులు = రాక్షసులు; ఉక్కుమిగుల = మదింపగా; పెక్కసంబు = సహింపరానిది; అగు = ఐన; అజగరంబు = కొండచిలువ; అయి = రూపుదాల్చి; ఉన్న = ఉన్నట్టి; ఆ = ఆ; నరభోజను = మనుషులను తినువాని; కుత్తుకన్ = గొంతులో; పొత్తుగొని = గుంపుగూడి; మొత్తంబు = అందరు; పెంటనంటన్ = కూడా; చని = వెళ్ళిన; తమ్మున్ =

తమను; అందఱన్ = అందరిని; చిందఱవందఱ = చిన్నాభిన్నము; చేసి = చేసి; ఖ్రింగన్ = మింగివేయ; అగ్గలించున్ = గమకించెడి; అజగరంబు = కొండచిలువ; కంఠద్వారంబునన్ = గొంతులోపల; సమీరంబు = గాలి; వెడలకుండన్ = పోకుండ; తన = అతని యొక్క; శరీరంబున్ = దేహమును; పెంచి = పెద్దది చేసి; గ్రద్దనన్ = శీఘ్రముగా; మిద్దెచఱచినట్లు = సజ్జాకట్టినట్లుగ {మిద్దెచరచు - స్లాబులులాంటివి వేయుటకు రాటలు నిలబెట్టి మిద్దెలా ఖాళీలేకుండ కట్టుట}; ఉండన్ = అవ్వగా.

భావము:- ఇలా భావించిన కృష్ణుడు సర్వమూ చూడగలవాడు; అందరి చూపూ తానే అయిన వాడు; తనను ఆశ్రయించిన వారి కష్టాలను తొలగించేవాడు; తామరరేకుల వంటి కన్నులు కలవాడు కనుక. దేవతలు కూడా మొరలు పెట్టేలాగ, రాక్షసులందరూ గర్వంతో మిడిసిపడేలాగ, ఆ రాక్షసుడు కొండచిలువ రూపంతో బాలకులను లేగదూడలను ఖ్రింగుతూ ఉంటే కృష్ణుడు కూడా వారివెనుకనే లోపలికి ప్రవేశించాడు. ఆ కొండచిలువ నాలుకలతో అందరిని చిందరవందరచేసి మింగడానికి ప్రయత్నించుతూ ఉంటే; కృష్ణుడు కంఠద్వారం దగ్గర చేరి తన శరీరాన్ని విపరీతంగా పెంచి దిమ్మిస కొట్టినట్లు అక్కడ గొంతుకలో ఇరుక్కున్నాడు. ఇక పాముకు ఊపిరి వెళ్ళే దారి మూసుకు పోయింది.

10.1-480-క.

ఊపిరి వెడలక కడుపున
వా పొదవినఁ బాము ప్రాణవాతంబులు సం
తాపించి శిరము వ్రక్కలు
వాపికొనుచు వెడలి చనియెఁ బటు ఘోషముతోన్.

టీక:- ఊపిరి = శ్వాస; వెడలక = ఆడక; కడుపునన్ = కడుపు; వాపు = ఉబ్బరింపు; ఒదవినన్ = కలుగగా; పాము = సర్పము; ప్రాణవాతంబులు = ప్రాణవాయువుల; సంతాపించి = మిక్కిలి తపించిపోయి; శిరమున్ = తల; వ్రక్కలు = బద్దలు; వాపికొనుచున్ = చేసికొనుచు; వెడలిచనియె = చనిపోయెను; పటు = గట్టి; ఘోషము = చప్పుడు; తోన్ = తోటి.

భావము:- ఆ పాముకు ఊపిరి ఆడలేదు. లోపల చేరిన గాలి బయటకి వెళ్ళక కడుపు ఉబ్బిపోసాగింది. ప్రాణవాయువులు లోపల తుకతుక లాడాయి. అవి వ్యాకోచించి చివరకు పాము తల పెద్దశబ్దంతో వేలి పగిలి పోయి వాయువులు బయటకు వచ్చేశాయి.

10.1-481-శా.

**క్రూరవ్యాళ విశాల కుక్షి గతులన్ గోవత్ససంఘంబుతో**
**గారుణ్యామృతవృష్టిచేత బ్రతుకంగాఁ జూచి వత్సంబులున్**
**వారుం దాను దదాస్యవీథి మగుడన్ వచ్చెన్ ఘనోన్ముక్తుఁడై**
**తారానీకముతోడ నొప్పెసఁగు నా తారేశు చందంబునన్.**

టీక:- క్రూర = భయంకరమైన; వ్యాళ = పాము యొక్క; విశాల = పెద్ద; కుక్షి = కడుపు; గతులన్ = లోపలికిపోవువారిని; గోవత్స = ఆవుదూడల {గోవత్సము - ఒక సంవత్సరములోపు ఆవు దూడ}; సంఘంబు = గుంపు; తోన్ = తోటి; కారుణ్య = కరుణ అనెడి; అమృత = అమృతపు; వృష్టి = వాన; చేత = వలన; బ్రతుకంగాన్ = జీవించునట్లుగా; చూచి = చేసి; వత్సంబులున్ = ఆవుదూడలు; వారున్ = వారు; తాను = అతను; తత్ = దాని; ఆస్య = నోటి; వీథిన్ = దారిని; మగుడన్ = వెనుకకు; వచ్చెన్ = వచ్చెను; ఘన = మబ్బులనుండి; ఉన్ముక్తుడు = వెలువడినవాడు; ఐ = అయ్యి; తార = నక్షత్రముల; అనీకము = గుంపుల; తోడన్ = తోటి; ఒప్పు = చక్కగా; ఎసగు = అతిశయించెడి; ఆ = ఆ

ప్రసిద్ధుడైన; తారేశు = చంద్రుని {తారేశుడు - తారలకు ఈశుడు (భర్త), చంద్రుడు}; చందంబునన్ = వలె.

భావము:- క్రూరసర్పం కడుపులో ఇరుక్కుపోయిన గోపబాలురు, లేగదూడలతోసహా కృష్ణుడు తన కరుణ అనే అమృత వర్షంతో బ్రతికించాడు. ఆ పాము నోటిలోనుంచి తాను, తనతోపాటు గోపబాలురు, లేగదూడలు కూడా బయటకు వస్తూ ఉంటే ఆవరించిన మేఘాలు విరిసిపోగానే చంద్రుడు నక్షత్రాలతో బయటపడినట్లుగా ఉంది.

10.1-482-ఆ.

అమరవరులకొఱకుఁ గమలజాండం బెల్ల
బలిఁ దిరస్కరించి బలియు వడుగు
గోపసుతులకొఱకుఁ బాపపుఁ బెనుబాము
గళము దూఁటుగట్ట బలియకున్నె?

టీక:- అమర = దేవతా; వరుల = శ్రేష్ఠుల; కొఱకున్ = కోసము; కమలజాండం బున్ = బ్రహ్మాండము {కమలజాండము - కమలజ (బ్రహ్మ) అండము, బ్రహ్మాండము}; ఎల్లన్ = అంతటిని; బలిన్ = బలిచక్రవర్తిని; తిరస్కరించి = తెగడి; బలియు = అతిశయించెడి; వడుగు = వామనావతారుడు; గోప = యాదవ; సుతుల = కుమారులు; కొఱకున్ = కోసము; పాపపు = దుష్టమయిన; పెను = పెద్ద; పాము = సర్పము యొక్క; గళము = కంఠమును; తూటుగట్ట = ఖండించుటకు; బలియకున్నె = అతిశయించ కుండా ఉంటాడా.

భావము:- వామనమూర్తిగా దేవతల కోసం బలిచక్రవర్తిని ధిక్కరించి బ్రహ్మాండం అంతా ఆక్రమించిన ఈ కృష్ణమూర్తి; అమాయకులైన గోపబాలకుల కోసం పాపిష్టి పాము గొంతుక బ్రద్దలై పగిలిపోయేలా చేయడంలో ఆశ్చర్యం ఏముంది?

**10.1-483-ఉ.**

**ఆ పెనుబాము మేన నొక యద్భుతమైన వెలుంగు దిక్తటో**
**ద్దీపకమై వడిన్ వెడలి దేవపథంబునఁ దేజరిల్లుచున్**
**క్రేపులు బాలురున్ బెదరఁ గృష్ణుని దేహము వచ్చి చొచ్చె నా**
**పాపఁడు చొచ్చి ప్రాణములఁ బాపిన యంతన శుద్ధసత్త్వమై.**

**టీక:-** ఆ = ఆ; పెను = పెద్ద; పాము = సర్పము; మేనన్ = దేహమునుండి; ఒక = ఒకానొక; అద్భుతము = ఆశ్చర్యకరమైనట్టిది; ఐన = అయిన; వెలుంగు = ప్రకాశము; దిక్తట = దిగ్భాగములను; ఉద్దీపకము = ప్రకాశింపజేయునది; ఐ = అయ్యి; వడిన్ = వేగముగా; వెడలి = వెలువడి; దేవపథంబునన్ = ఆకాశమార్గమున; తేజరిల్లుచున్ = వెలిగిపోతూ; క్రేపులున్ = దూడలు; బాలురున్ = పిల్లలు; బెదరన్ = భయపడుతుండగ; కృష్ణుని = కృష్ణుని యొక్క; దేహమున్ = శరీరమును; వచ్చి = చేరి; చొచ్చెన్ = ప్రవేశించెను; ఆ = ఆ ప్రసిద్ధుడైన; పాపడు = బాలకృష్ణుడు; చొచ్చి = దూరి; ప్రాణములన్ = ప్రాణములను; పాపినన్ = తీసివేసిన; అంతన్ = వెంటనే; శుద్ధ = నిష్కల్మషమైన; సత్త్వము = సత్త్వగుణోపేతమైనది; ఐ = అయ్యి.

**భావము:-** అలా కృష్ణుడు సహచరులతో బయటకు వచ్చిన ఆ సమయంలో ఓ అద్భుతం జరిగింది. అంతటి పాపిష్టి పాము తన దేహంలోకి కృష్ణుడు ప్రవేశించి ప్రాణాలు తీయగానే శుద్ధతత్త్వమయం అయిపోయింది. దిక్కులు వెలిగిపోయే టంత అద్భుతమైన వెలుగువలె వేగంగా వెలువడి ఆకాశంలో వెలుగుతూ వచ్చి కృష్ణుని శరీరంలో ప్రవేశించింది. అది చూసిన గోపబాలురు లేగలతో పాటు బెదరిపోయారు.

10.1-484-క.

**తన రూ పొకమా ఱైనను**

**మనమున నిడుకొనినఁ బాపమయు నైనను లోఁ**

**గొనిచను హరి తను ఖ్రింగిన**

**దనుజునిఁ గొనిపోవకున్నె తనలోపలికిన్?**

టీక:- తన = అతని యొక్క; రూపు = స్వరూపమును; ఒక = ఒకే ఒక్క; మార్లైనను = సార్లైనాసరే; మనమునన్ = మనసునందు; ఇడుకొనినన్ = ఉంచుకొన్నచో, తలచినచో; పాపమయున్ = పాపిని {త్రివిధపాపములు - 1అహం (గర్వము) 2ఆగ (ఆగడము, తప్పు) 3ఏనస్సు (అపరాధము)}; ఐనను = అయినప్పటికి; లోగొనిచను = లయముచేసికొనెడి; హరి = విష్ణువు; తనున్ = తనను; ఖ్రింగిన = మింగినట్టి; దనుజునిన్ = రాక్షసుని; కొనిపోవకున్నె = స్వీకరించడా; తన = అతని; లోపలి = లోపలి; కిన్ = కి.

భావము:- శ్రీహరి తన రూపాన్ని ఒక్కసారైనా మనస్సులో నిలుపుకుంటే ఎంతటి పాపాత్ముడి నైనా తన లోనికి స్వీకరిస్తాడు. అటువంటిది తననే ఖ్రింగిన రాక్షసుని తన లోనికి స్వీకరించడా మరి?

## సురలు పూలు గురియించుట

10.1-485-వ.

**తదవసరంబున, సురలు కుసుమ వర్షంబులు**

**గురియించిరి; రంభాదు లాడిరి; గంధర్వాదులు పాడిరి;**

**మేఘంబులు మృదంగం బుల భంగి ఘోషించె; సిద్ధ**

**గణంబులు జయజయ భాషణంబులు భాషించి; రంత.**

టీక:- తదవసరంబునన్ = ఆసమయమున; సురలు = దేవతలు; కుసుమ = పూల; వర్షంబులున్ = వానలు; కురియించిరి = కురిపించిరి; రంభాదులు = అప్సరసలు {రంభాదులు - రంభమున్నగువారు, ఏకత్రిశంతి యప్సరసలు }; ఆడిరి = నాట్యములు చేసిరి; గంధర్వ = గంధర్వులు; ఆదులు = మున్నగువారు; పాడిరి = పాటలుపాడిరి; మేఘంబులున్ = మేఘములు; మృదంగముల = మద్దెలల; భంగిన్ = వలె; ఘోషించెన్ = మోగినవి; సిద్ధ = సిద్ధుల; గణంబులు = సమూహములు; జయజయ = జయము జయము అనెడి; భాషణంబులు = ధ్వానములు; భాషించిరి = చేసిరి; అంత = అప్పుడు.

భావము:- అప్పుడు, దేవతలు పూలవర్షం కురిపించారు; రంభ మొదలైన అప్సరసలు నాట్యాలు చేసారు; గంధర్వులు గానాలు చేసారు; మేఘాలు మృదంగాలవలె ధ్వనించాయి; సిద్ధులు కృష్ణునికి జయజయధ్వానాలు పలికారు.

10.1-486-శా.

**ఆ వాద్యంబులు, నామహాజయరవం, బా పాట, లా యాటలున్**
**దేవజ్యేష్ఠుఁడు పద్మజుండు విని ప్రీతిన్ భూమి కేతెంచి "నే**
**డే వత్సార్భకులన్ భుజంగపతి హింసింపంగ నీ బాలకుం**
**డేపెంటన్ బ్రతికించె? మే"లనుచు నూహించెంగడుంనివ్వెఱన్.**

టీక:- ఆ = ఆ యొక్క; వాద్యంబులున్ = ధ్వనులను; ఆ = ఆ; మహా = గొప్ప; జయరావంబున్ = విజయధ్వానములను; ఆ = ఆ; పాటలు = పాటలను; ఆ = ఆ; ఆటలున్ = నాట్యములను; దేవ = దేవతలలో; జ్యేష్ఠ = పెద్దవాడు; పద్మజుండు = బ్రహ్మదేవుడు; విని = విని; ప్రీతిన్ = కోరి, సంతోషముతో; భూమి = భూలోకమున; కున్ = కు; ఏతెంచి = వచ్చి; నేడు = ఇప్పుడు; ఈ = ఈ; వత్స = దూడలను; అర్భకులన్ = బాలురను; భుజంగ = పాములలో; పతి = గొప్పది; హింసింపంగన్ = చంపుతుండగా; ఈ = ఈ; బాలకుండు = పిల్లవాడు;

ఏపెంటన్ = ఏ విధముగా; బ్రతికించెన్ = కాపాడెను; మేలు = గొప్పవిషయమే; అనుచున్ = అనుకొనుచు; ఊహించెన్ = అనుకొనెను; నివ్వెఱన్ = పారవశ్యముతో.

భావము:- దేవతలు అందరికీ పెద్దవాడైన బ్రహ్మదేవుడు ఆ జయజయధ్వానాలు, వాద్యాలు, పాటలు విని ఏదో లోకకల్యాణం జరిగిందని సంతోషంతో భూలోకానికి వచ్చాడు. "ఇంతటి మహాసర్పం లేగలను బాలకులను చంపడానికి ప్రయత్నిస్తే ఇంత చిన్న కుఱ్ఱాడు వారిని ఎలా బ్రతికించ గలిగాడో ఆశ్చర్యంగా ఉందే! భలే." అని నివ్వెరపోయాడు.

10.1-487-వ.

**అంత న య్యజగర చర్మంబు కొన్ని దివసంబుల కెండి పెద్ద కాలంబు గోపాలబాలురకు కేళీబిలంబై యుండె; నిట్లు కౌమార విహారంబుల నైదవ యేటఁ గృష్ణుం డఘాసురునిం దెగఁ జూచు టయుఁ దమ్ముంగాచుటయు నాఱవయేటిదైన పొగండవృత్తాంతం బని చిత్తంబుల గోపకుమారులు దలంచుచుందు" రని చెప్పిన న ప్పుడమితేఁ డ ప్పరమ యోగీంద్రున కిట్లనియె.**

టీక:- అంతన్ = ఆ తరువాత; ఆ = ఆ; అజగర = కొండచిలువ; చర్మంబు = కళేబరము; కొన్ని = కొద్ది; దివసంబుల = కాలమున; కిన్ = కు; ఎండి = ఎండిపోయి; పెద్ద = చాలా; కాలంబు = కాలమువరకు; గోపాల = యాదవుల; బాలురు = పిల్లల; కున్ = కు; కేళీ = ఆట; బిలంబు = గుహ; ఐ = వలెనయ్యి; ఉండెన్ = ఉన్నది; ఇట్లు = ఈ విధముగ; కౌమార = చిన్ననాటి (5సం.లు కన్నా తక్కువ) {అవస్థాష్టకము - 1కౌమారము (5సం. వరకు) 2పొగండము (10సం.) 3కైశోఱము (15సం.) 4బాల్యము (16సం.)

6తారుణ్యము (25సం.) యౌవనము (50సం.) 7వృద్ధత్వము (70సం.) 8వర్షీయస్త్వము (90సం.వరకు)}; విహారంబులన్ = క్రీడలను; ఐదవ = అయిదవ (5); ఏటన్ = సంవత్సరపు వయసులో; కృష్ణుండు = కృష్ణుడు; అఘాసురునిన్ = అఘాసురుని {అఘాసురుడు – కొండచిలువ రాక్షసుడు}; తెగజూచుటయున్ = చంపుట; తమ్మున్ = వారిని; కాచుటయున్ = కాపాడుటలని; ఆఱవ = ఆరో (6); ఏటిది = సంవత్సరపు వయసులోనిది; ఐన = అయినట్టి; పౌగండ = 5-10 ఏళ్ళ వయసు; వృత్తాంతంబు = వర్తమానము; అని = అని; చిత్తంబుల = మనసులందు; గోప = యాదవుల; కుమారులు = బాలురు; తలంచుచుందురు = భావింతురు; అని = అని; చెప్పినన్ = చెప్పగా; ఆ = ఆ ప్రసిద్ధుడైన; పుడమితేడు = రాజు; ఆ = ఆ ప్రసిద్ధుడైన; పరమ = అతిగొప్ప; యోగి = ఋషులలో; ఇంద్రున్ = శ్రేష్ఠుని; కున్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అటుపిమ్మట ఆ కొండచిలువ చర్మం కొన్నాళ్ళకు ఎండిపోయి చాలాకాలంపాటు గోపబాలురకు ఆటలాడుకునే గుహలాగ పనికి వచ్చింది. ఇలా కృష్ణుడు కౌమార వయస్సులో అంటే అయిదవయేట అఘాసురుని సంహరించాడు. అయితే ఈ సన్నివేశం పౌగండ వయస్సులో అంటే ఆరు సంవత్సరాల వయస్సులో జరిగిందని గోపాలబాలురు అనుకున్నారు.” ఇలా శుకయోగి చెప్పగానే పరీక్షుత్తు ఇలా అడిగాడు.

10.1-488-సీ.

"అయిదేండ్లు కౌమార; మటమీఁద నయిదేండ్లు-
పౌగండ మనియెడు ప్రాయ మందు;
నయిదేండ్లవాడైఁన యబ్జాక్షుచరితంబు-
పౌగండ మని గోపబాలు రెల్లఁ

దల(తు రంటివి యెట్లు తలతురు వారలు?-
నిరుడు చేసిన పని నేటి దన(గ
వచ్చునే? యిది నాకు వరుసతో నెఱి(గింపు"-
మనవుడు యతిచంద్రు(డైన శుకు(డు

10.1-488.1-ఆ.

యోగ దృష్టి(జూచి యొక్కింత భావించి
"వినుము రాజవర్య! వినయధుర్య!
పరమగుహ్య మనుచు( బలుకుదు రార్యులు
శిష్యజనుల కీవు జేయు తల(పు."

టీక:- అయిదేండ్లు = అయిదేళ్ళవరకు; కౌమారము = కౌమారావస్థ {అవస్థాష్టకము - 1కౌమారము (5సం. వరకు) 2పౌగండము (10సం.) 3కైశోఅము (15సం.) 4బాల్యము (16సం.) 6తారుణ్యము (25సం.) యౌవనము (50సం.) 7వృద్ధత్వము (70సం.) 8వర్షీయస్త్వము (90సం.వరకు)}; అటమీద = ఆ పైన; అయిదు = అయిదు (5); ఏండ్లు = ఏళ్ళువరకు; పౌగండము = పౌగండావస్థ; అనియెడి = అనెడి; ప్రాయము = ఈడు, వయస్సు; అందున్ = అలా ఉండగా; అయిదు = ఐదు (5); ఏండ్లవాడు = ఏళ్ళవయసువాడు; ఐన = అయినట్టి; అబ్జాక్షు = కృష్ణుని; చరితంబున్ = వర్తనను; పౌగండము = పౌగండము; అని = అని; గోప = యాదవుల; బాలురు = పిల్లలు; ఎల్లన్ = అందరు; తలతురు = భావించెదరు; అంటివి = అన్నావు; ఎట్లు = ఎలా; తలతురు = అనుకొనెదరు; వారలు = వారు; నిరుడు = గడచిన సంవత్సరమున; చేసిన = చేసినట్టి; పనిన్ = పనిని; నేటిది = ఇప్పటిది; అనగన్ = అనుట; వచ్చునే = సరియేనా, కాదు; ఇది = దీనిని; నా; కున్ = కు; వరుసతోన్

= క్రమముగా; ఎఱిఁగింపుము = తెలుపుము; అనువుడు = అడుగగా; యతి = యోగులలో; చంద్రుడు = ఉత్తముడు; ఐన = అయినట్టి; శుకుడు = శుకుడు.

యోగ = జ్ఞాన; దృష్టిన్ = దృష్టితో; చూచి = చూసి; ఒక్కింత = కొద్దిసేపు; భావించి = ఆలోచించుకొని; వినుము = వినుము; రాజవర్య = మహారాజ; వినయధుర్య = వినయము ధరించినవాడ; పరమ = అతి; గుహ్యము = రహస్యమైనది; అనుచున్ = అనుచు; పలుకుదురు = చెప్పెదరు; ఆర్యులు = పెద్దలు; శిష్య = శిష్యుల; జనులు = సమూహముల; కిన్ = కు; ఈవు = నీవు; చేయు = వేసెడి; తలపున్ = సందేహముగురించి.

భావము:- “మహర్షీ! మొదటి ఐదేళ్ళ వయస్సును కౌమారము అంటారు. తరువాతి ఐదేండ్లను పౌగండమని అంటారు కదా. ఐదేళ్ళవాడైన కృష్ణుడి కథను పౌగండములో ఆరో ఏట జరిగినకథ అని గోపబాలకులు తలుచుకున్నారని చెప్పావు. అదెలా సంభవము వాళ్ళు అలాఎలా అనుకోగలరు. నిరుడు చేసినపని ఈనాటిది అనుకోవడం ఎవరికైనా ఎలా సాధ్యం. నాకు విపులంగా వివరించు” ఇలా పరీక్షిత్తు అడగగానే శుకయోగి యోగదృష్టితో చూసి కొంచెంసేపు ఆలోచించాడు. “మహారాజా! నీవు వినయంగా వేసిన ఈ ప్రశ్నలు ముందు ముందు రాబోయే శిష్యులు అందరికి ఎంతో మేలు చేకూరుస్తాయి. నీ ఆలోచన పరమ రహస్యమైంది అని పెద్దలు భావిస్తారు.

10.1-489-క.

**ప్రియురాలివలని వార్తలు**

ప్రియజనులకు సెల్లప్రొద్దుఁ బ్రియ మగు భంగిన్
ప్రియుఁడగు హరిచరితంబులు
ప్రియభక్తుల కెల్లయెడలఁ బ్రియములు గావే?

టీక:- ప్రియురాలి = ఇష్టసఖి; వలని = గురించిన; వార్తలు = విషయములు; ప్రియజనుల్ = ఇష్టుల; కున్ = కు; ఎల్లపొద్దున్ = ఎల్లప్పుడు; ప్రియము = ఇష్టము; అగు = అయ్యెడి; భంగిన్ = విధముగ; ప్రియుడు = ఇష్టుడు, మేలుచేయువాడు; అగు = ఐన; హరి = కృష్ణుని; చరితంబులు = వర్తనలు; ప్రియ = ఇష్టమైన; భక్తుల్ = భక్తుల; కున్ = కు; ఎల్ల = అన్ని; ఎడలను = సమయము లందును; ప్రియము = ఇష్టము; కావే = కావా ఏమి, అగును.

భావము:- ప్రియురాలిని గురించిన వార్తలు ఎప్పుడు చెప్పినా ప్రియులకు ఎంతో ఇష్టంగా ఉంటాయి. ప్రియుడి కథలు ప్రియురాలికి కూడా అంతే కదా. జీవులందరూ ప్రియురాళ్ళు అయితే భగవంతుడు ప్రియుడు. అతని కథలు ప్రియభక్తులకైతే మరీ ప్రియమైనవి కదా."

10.1-490-వ.

**అని పలికి యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె; "న**
**ట్లఘాసురు మొగంబువలనం గడచిచనిన లేఁగల**
**గోపకుమారులం బ్రతికించి వారును దానునుం జని చని.**

టీక:- అని = అని; పలికి = చెప్పి; యోగ = యోగులలో; ఇంద్రుండు = శ్రేష్ఠుడు; రాజేంద్రున్ = మహారాజున; కిన్; ఇట్లు = ఈ విధముగ; అనియె = చెప్పెను; అట్లు = అలా; అఘాసురుని = అఘాసురుని; మొగంబు = నోటి; వలనన్ = నుండి; కడచిచనిన = బయటపడిన; లేగలన్ = దూడలను; గోప = యాదవుల; కుమారులన్ = బాలురను; బ్రతికించి = కాపాడి; వారునున్ = వారు; తానునున్ = అతను; చనిచని = శ్రీఘ్రముగా వెళ్ళి.

భావము:- ఇలా పలికి శుకయోగి పరీక్షిత్తుతో ఇంకా ఇలా చెప్తాడు "అలా కృష్ణుడు అఘాసురుడి నోట్లోకి పోయిన లేగలను గోపకుమారులను వాడి బారి నుంచి బ్రతికించి, వారితో కలిసి ముందుకు సాగిపోయాడు

10.1-491-మ.

**కనియెం గృష్ణుఁడు సాధునీరము మహాగంభీరముం బద్మకో**

**కనదాస్వాద వినోద మోద మదభృంగ ద్వంద్వ ఝుంకారమున్**

**ఘనకల్లోల లతావితాన విహరత్కాదంబ కోలాహల**

**స్వనవిస్తారము మందవాయుజ కణాసారంబుఁ గాసారమున్.**

టీక:- కనియెన్ = కనుగొనెను; కృష్ణుడు = కృష్ణుడు; సాధు = మంచి; నీరమున్ = నీళ్ళు కలిగినదానిని; మహా = మిక్కిలి; గంభీరమున్ = లోతు గలదానిని; పద్మ = పద్మములు; కోకనద = ఎఱ్ఱకలువలను; ఆస్వాద = సుగంధాలను ఆస్వాదించుటను; వినోద = క్రీడగా, వేడుకగా; ఆమోద = తీసుకొనుటచే; మద = మత్తెక్కిన; భృంగ = తుమ్మెదల; ద్వంద్వ = జంట యొక్క; ఝుంకారమున్ = ఝుంకారములు కలదానిని; ఘన = గొప్ప; కల్లోల = పెద్ద అలలు అనెడి; లతా = తీగల; వితాన = సమూహము నందు; విహరత్ = విహరించుచున్న; కాదంబ = కలహంసల {కాదంబము - ధూమ్రవర్ణము కల ముక్కు కాళ్ళు కల హంస}; కోలాహల = కలకల మనెడి; స్వన = ధ్వనులచేత; విస్తారమున్ = అధికముగా కల దానిని; మంద = మెల్లని; వాయుజ = గాలివలన కలిగిన; కణ = నీటితుంపరలు; సారంబున్ = దట్టముగా కలదానిని; కాసారమున్ = సరస్సును.

భావము:- అలా అఘాసుర వధానంతరం వెళ్ళిన కృష్ణుడు ఒక కొలనును చూసాడు. అది ఎంతో లోతైనది, స్వచ్ఛమైన నీటితో నిండి ఉన్నది. పద్మాలు, ఎఱ్ఱకలువలు ఆ చెరువులో వికసించి ఉండగా వాటి సుగందాలకు ఆనందించి మదించిన తుమ్మెదల జంటలు ఝుంకారం చేస్తూ ఆ పూవుల పైననే తిరుగుతున్నాయి. ఆ కొలనులో నీటిఅలల మధ్యగా హంసలు ఈదులాడుతూ కోలాహలం చేస్తూ ఉంటే ఆ ధ్వని చెవుల పండువుగా

వినవస్తోంది. చల్లని పిల్లగాలికి నీటితుంపరలు ఎగురుతూ కొలనునిండా వ్యాపించి ఉన్నాయి.

10.1-492-వ.

**కని తమ్మికంటి తమ్ముల యింటి సొబగునకు నిచ్ఛ**
**మెచ్చుచుఁ జెచ్చెర గాలి నోలిం గదలెడు కరళ్ళ తుంపురుల**
**జల్లు పెల్లున నొడళ్ళు గగుర్పొడువఁ గొలంకు కెలంకులఁ**
**గాయ పండుల గెలల ప్రేగున వీఁగి పట్టుగల చెట్టుతుటుము**
**నీడల నొప్పుచున్న యిసుక తిప్పల విప్పుఁ జూచి వేడుక**
**పిచ్ఛలింప సెచ్చెలుల కిట్లనియె.**

టీక:- కని = చూసి; తమ్మికంటి = కృష్ణుడు, పద్మాక్షుడు; తమ్ములయింటి = సరస్సు యొక్క {తమ్ముల యిల్లు - తమ్మి (పద్మము)లకు ఇల్లు (నివాసము), సరస్సు}; సొబగున్ = చక్కదనమున; కున్ = కు; ఇచ్ఛన్ = మనసు నందు; మెచ్చుకొనుచున్ = ప్రశంసించుచు; చెచ్చెరన్ = శీఘ్రముగా; గాలిన్ = గాలివలన; ఓలిన్ = మిక్కిలి; కదలెడు = కదిలెడి; కరళ్ళ = అలలవలని; తుంపురుల = నీటిబిందువుల; జల్లు = జల్లుల యొక్క; పెల్లునన్ = అతిశయముచేత; ఒడళ్ళు = శరీరములు; గగుర్పొడువన్ = గగుర్పాటు చెందుతుండగ; కొలంకు = సరస్సు యొక్క; కెలంకులన్ = గట్లమీద; కాయ = కాయల; పండుల = పళ్ళ; గెలల = గుత్తుల; ప్రేగునన్ = బరువులకు; వీగి = మొగ్గి; పట్టు = ధృడత్వము; కల = కలిగిన; చెట్టు = వృక్షముల; తుటము = సమూహముల; నీడలన్ = నీడలందు; ఒప్పుచున్న = చక్కగా ఉన్నట్టి; ఇసుకతిప్పల = ఇసకదిబ్బల; విప్పు = విస్తారములను; చూచి = చూసి; వేడుక = ఉత్సాహము; పిచ్ఛలింపన్ = అతిశయించగా; సెచ్చెలుల = స్నేహితుల; కిన్ = కు; ఇట్లు = ఈ విధముగ; అనియె = చెప్పెను.

భావము:- ఆ కొలనును చూసిన తామరకన్నుల కన్నయ్య తామరపూలతో నిండిన దాని అందానికి మెచ్చుకున్నాడు. చెరువు లోని నీరు గాలికి కెరటాలుగా లేచి నీటి తుంపరలు లేస్తున్నాయి. అవి గాలితెరతోపాటు వచ్చి జల్లులాగ తాకగానే ఒళ్ళు గగుర్పొడుస్తున్నది. ఆ కొలను ఒడ్డున ఎన్నో ఫలవృక్షాలు ఉన్నాయి. కాయలు పండ్లు గుత్తులు గుత్తులుగా ప్రేలాడుతూ ఉంటే, ఆ చెట్లు ఆ బరువుకు ఊగిపోతున్నా బలంగానే నిలబడి ఉన్నాయి. అలాంటి చెట్ల గుంపుల నీడలలో విశాలమైన ఇసుకతిన్నెలను చూడగానే కృష్ణుడిలో ఉత్సాహం చెలరేగింది. అతడు స్నేహితులతో ఇలా అన్నాడు.

## చల్ది లారగించుట

10.1-493-శా.

"ఎండన్ మ్రగ్గితి రాఁకటం బడితి రింకేలా విలంబింపఁగా
రండో బాలకులార! చల్ది గుడువన్ రమ్యస్థలం బిక్క డీ
దండన్ లేఁగలు నీరు ద్రావి యిరవందం బచ్చికల్ మేయుచుం
దండంబై విహరించుచుండఁగ నమందప్రీతి భక్షింతమే?"

టీక:- ఎండన్ = ఎండవలన; మ్రగ్గితిరి = మాడిపోయి ఉన్నారు; ఆకటన్ = ఆకలిచేత; పడితిరి = బడలితిరి; ఇంకన్ = ఇంకను; ఏల = ఎందుకు; విలంబింపగాన్ = ఆలస్యము చేయుట; రండి = రండి; ఓ = ఓహో; బాలకులారా = పిల్లలూ; చల్దిన్ = చద్దికూడులను; కుడువన్ = తినుటకు; రమ్య = అందమైన; స్థలంబు = చోటు; ఇక్కడ = ఇక్కడ; ఈ = ఈ; దండన్ = వైపున; లేగలు = దూడలు; నీరు = నీటిని; త్రావి = తాగి; ఇరవందన్ = ఒప్పారు; పచ్చికల్ = పచ్చిగడ్డి; మేయుచున్ = తినుచు; తండంబు = గుంపు గట్టినవి; ఐ = అయ్యి;

విహరించుచుండగన్ = తిరుగుతుండగా; అమంద = మిక్కుటమైన; ప్రీతిన్ = ఇష్టముతో; భక్షింతమే = తినెదము.

భావము:- "మిత్రులారా! ఇప్పటికే ఎండలో మాడిపోయారు ఆకలితో నకనకలాడుతున్నారు కదా. ఇంకా ఆలస్యం దేనికి? ఇది చల్దులు తినడానికి అనువైన అందమైన చోటు. లేగదూడల మందలు ఈ కొలనులో నీరు త్రాగి ఈ ప్రక్కనే ఉన్న పచ్చికబయళ్ళలో స్వేచ్ఛగా మేస్తూ విహరిస్తూ ఉంటాయి. మరి మనం హాయిగా చల్దులు ఆరగిద్దాం. ఏమంటారు?"

10.1-494-వ.

**అనిన "నగుఁగాక" యని వత్సంబుల నుత్సాహంబున నిర్మలంబు లగు జలంబులు ద్రావించి, పచ్చికల మొల్లంబులుగల పల్లంబుల నిలిపి చొక్కంబులగు చల్దిచిక్కంబులు చక్కడించి.**

టీక:- అనినన్ = అనగా; అగుగాక = అలగే; అని = అని; వత్సంబులన్ = దూడలను; ఉత్సాహంబునన్ = హుషారుగా; నిర్మలంబులు = స్వచ్ఛమైనవి; అగు = ఐన; జలంబులున్ = నీళ్ళు; త్రావించి = తాగించి; పచ్చికల = పచ్చిగడ్డి; మొల్లంబులు = అధికముగా; కల = ఉన్నట్టి; పల్లంబులన్ = పల్లపు ప్రదేశము లందు; నిలిపి = ఉంచి; చొక్కంబులు = స్వచ్ఛమైనవి; అగు = ఐన; చల్ది = చద్దికూడులు గల; చిక్కంబులున్ = కావిళ్ళలోని సంచులను; చక్కన్ = చక్కగా; డించి = దింపుకొని.

భావము:- కృష్ణుడిలా అనగానే గోపబాలకులందరూ సరే అన్నారు. లేగదూడలకు నిర్మలమైన నీటిని త్రాగించి, చిక్కని పచ్చికబయళ్ళలో మేతకు వదలిపెట్టారు. నోరూరించే చల్దులను చిక్కాలనుంచి బయటకు తీసారు.

10.1-495-మ. *

**జలజాంతస్థిత కర్ణికం దిరిగిరా సంఘంబులై యున్న తే**
**కుల చందంబునఁ గృష్ణునిందిరిగిరాఁగూర్చుండి వీక్షించుచున్**
**శిలలుంబల్లవముల్ దృణంబులు లతల్చిక్కంబులుంబువ్వు లా**
**కులు కంచంబులుగాభుజించిరచటన్ గోపార్భకుల్ భూవరా!**

టీక:- జలజ = పద్మము; అంతస్థిత = అందలి; కర్ణికన్ = బొడ్డును; తిరిగిరాన్ = చుట్టూరా; సంఘంబులు = కలిసిగట్టుగా ఉండెడివి; ఐ = అయ్యి; ఉన్న = ఉన్నట్టి; తేకుల = దళముల; చందంబునన్ = వలె; కృష్ణునిన్ = కృష్ణుడి; తిరిగిరాన్ = చుట్టూరా; కూర్చుండి = కూర్చొని; వీక్షించుచున్ = చూచుచు; శిలలున్ = రాళ్ళు; పల్లవముల్ = చిగుళ్ళు; తృణముల్ = గడ్డిపోచలు; లతల్ = లతలు; చిక్కంబులున్ = సంచులు; పువ్వులున్ = పువ్వులు; ఆకులున్ = ఆకులు; కంచంబులు = తినుటకైన పళ్ళములు; కాన్ = అగునట్లుగా; భుజించిరి = తింటిరి; అచటన్ = అక్కడ; గోప = గొల్లల; అర్భకుల్ = పిల్లలు; భూవరా = రాజా.

భావము:- ఓ పరీక్షిన్మహారాజా! తామర పువ్వు బొడ్డు చుట్టూరా వరుసలు వరుసలుగా రేకులు పరచుకొని ఉంటాయి. అలాగే చల్దులు తినడానికి కృష్ణుడు మధ్యన కూర్చున్నాడు. గోపకలు అందరు చూట్టూరా చేరి కూర్చుని కృష్ణుణ్ణే చూస్తున్నారు. వాళ్ళకి వేరే కంచాలు లేవు. రాతిపలకలు, తామరాకులు, పెడల్పైన గడ్డిపోచలుతోను లతలుతోను పొడుగాటి పొన్న పూలతోను అల్లిన చదరలు, తెచ్చుకున్న చిక్కాలు, పెడల్పైన ఆకులు వీటినే కంచాలుగా వాడుకుంటు అందరు చక్కగా చల్దులు ఆరగించారు.

10.1-496-సీ. *

మాటిమాటికి ప్రేలు మడిఁచి యూరించుచు-

నూరుఁగాయలు దినుచుండు నొక్క;

డొకని కంచములోని దొడిసి చయ్యన ఖ్రింగి-

"చూడు లే"దని నోరు చూపునొక్కఁ;

డేగు రార్గురి చల్దు లెలమిఁ బన్నిదమాడి-

కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁ;

డిన్నియుండఁగఁ బంచి యిడుట సెచ్చలితన-

మనుచు బంతెనగుండు లాడు నొకఁడు;

10.1-496.1-ఆ.

"కృష్ణుఁ జూడు"మనుచుఁ గికురించి పరు మ్రోల

మేలి భక్ష్యరాశి మెసఁగు నొకఁడు;

నవ్వు నొకఁడు; సఖుల నవ్వించు నొక్కఁడు;

ముచ్చటాడు నొకఁడు; మురియు నొకఁడు.

టీక:- మాటిమాటికిన్ = పలుమార్లు; ప్రేలున్ = వేలిని; మడిచి = వంచి; ఊరించుచున్ = ఆసపెట్టుచు; ఊరగాయలున్ = ఆవకాయలాంటివి; తినుచున్ = తింటూ; ఒక్కడు = ఒకానొకడు; ఒక్కని = ఒకానొకనియొక్క; కంచము = కంచము; లోనిదిన్ = అందలిదానిని; ఒడిసి = ఒడుపుగా తీసుకొని; చయ్యన = చటుక్కున; ఖ్రింగి = తినేసి; చూడు = చూసుకొనుము; లేదు = ఏమీలేదు; అని = అని; నోరు = నోటిని; చూపున్ = చూపెట్టును; ఒక్కడు = ఒకతను; ఏగురి = ఐదుగురు (5); ఆర్గురి = ఆరుగురి (6); చల్దులు = చద్దికూడులు; ఎలమి = రెచ్చిపోయి; పన్నిదము = పందెములు; ఆడి = వేసుకొని;

కూర్కొనికూర్కొని = బాగా కూరేసుకుంటు; కుడుచున్ = తినును; ఒక్కడు = ఒకతను; ఇన్ని = ఇంత ఎక్కువగ; ఉండగన్ = ఉన్నప్పుడు; పంచి = పంచిపెట్టి; ఇడుట = ఇచ్చుట; సెచ్చలితనము = స్నేహభావము; అనుచున్ = అనుచు; బంతెనగుండులు = వరుసగ అందరికి ముద్దలు పెట్టుట {బంతెనగుండ్లు – బంతి (వరుస)గా కూర్చొన్న వారికి తలా ఒక గుండు ఇచ్చెడి ఆట}; ఆడున్ = చేయును; ఒకడున్ = ఒకతను.

కృష్ణున్ = కృష్ణుడుని; చూడుము = చూడు; అనుచున్ = అనుచు; కికురించి = మాయజేసి; పరున్ = వేరొకని; ప్రోలన్ = ఎదురుగానున్న; మేలి = మంచి; భక్ష = తినుబండారముల; రాశిన్ = గుంపును; మెసగు = వేగముగా తినును; ఒకడు = ఒకతను; నవ్వున్ = నవ్వును; ఒకడు = ఒకతను; సఖులన్ = స్నేహితులను; నవ్వించున్ = నవ్వించును; ఒక్కడు = ఒకతను; ముచ్చటలాడు = కబుర్లు చెప్పును; మురియున్ = మురిసిపోవును; ఒకడు = ఒకతను.

భావము:- ఎంత చక్కగా మురిపిస్తున్నాడో చూడండి మన పోతన కృష్ణుడు. – ఒక గొల్ల పిల్లాడు వ్రేళ్ళ మధ్యలో ఊరగాయ ముక్క ఇరికించుకొని మాటి మాటికి పక్కవాడిని ఊరిస్తూ తిన్నాడు. ఇంకొక గోప బాలుడు పక్కవాడి కంచంలోది చటుక్కున లాక్కొని మింగేసి, వాడు అడిగేసరికి 'ఏదీ ఏంలేదు చూడు' అంటు తన నోరు చూపించాడు. మరొకడు పందాలు కాసి మరీ, ఐదారుమంది తినే చల్దులు నోట్లో కుక్కుకొని తినేసాడు. మరో పిల్లాడు 'ఒరే ఇన్ని పదార్థాలు ఉన్నాయి కదా, స్నేహ మంటే పంచుకోడంరా' అంటు బంతెనగుండు లనే ఆట ఆడుతు తింటున్నాడు. ఇంకో కుఱ్ఱాడు 'ఒరే కృష్ణుణ్ణి చూడు' అని దృష్టి మళ్ళించి, మిత్రుడి ముందున్న మధుర పదార్థాలు తినేసాడు. మరింకో కుఱ్ఱాడు తాను నవ్వుతున్నాడు. ఇంకొకడు అందరిని నవ్విస్తున్నాడు. మరొకడు ముచ్చట్లాడు తున్నాడు. వేరొకడు ఉరికే మురిసిపోతున్నాడు.

10.1-497-వ.

అ య్యవసరంబున.

టీక:- ఆ = ఆ; అవసరంబునన్ = సమయమునందు.

భావము:- అలా చల్దులు గుడుస్తున్న ఆ సమయంలో. . .

10.1-498-సీ.

కడుపున దిండుగాఁ గట్టిన వలువలో-

లాలిత వంశనాళంబు జొనిపి

విమల శృంగంబును వేత్రదండంబును-

జాఱి రానీక డాచంక నిఱికి

మీఁగడ పెరుగుతో మేళవించిన చల్ది-

ముద్ద డాపలిచేత మొనయ నునిచి

చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుగాయలు-

వ్రేళ్ళ సందులయందు వెలయ నిఱికి

10.1-498.1-ఆ.

సంగడీల నడుమఁ జక్కగఁ గూర్చుండి

నర్మభాషణముల నగవు నెఱపి

యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద

శైశవంబు మెఱసి చల్ది గుడిచె.

టీక:- కడుపున = పొట్టమీద; దిండుగా = నడుముకు దట్టీగా; కట్టిన = కట్టుకొన్న; వలువ = గుడ్డ; లోన్ = అందు; లాలిత = చక్కటి; వంశనాళంబున్ = మురళిని; జొనిపి = దూర్చి; విమల = నిర్మలమైన; శృంగంబును =

కొమ్ముబూర; వేత్రదండంబును = బెత్తంకఱ్ఱలను; జాఱిరానీక = జారి పోకుండ; డాచంకన్ = ఎడమచంకలో; ఇఱికి = ఇరికించుకొని; మీగడ = మీగడబాగాకలగిన; పెరుగు = పెరుగు; తోన్ = తో; మేళవించిన = కలిపిన; చల్ది = చద్దన్నము; ముద్ద = కబళము; డాపలి = ఎడమ; చేతన్ = చేతిలో; మొనయన్ = చక్కగా; ఉనిచి = ఉంచుకొని; చెలరేగి = చెలరేగి; కొసరి = మరింకొంచె మని అడిగి; తెచ్చిన = తీసుకు వచ్చిన; ఊరుగాయలు = ఊరగాయ ముక్కలు; వ్రేళ్ళ = వేళ్ళ; సందుల = మధ్య; అందు = లో; వెలయన్ = ఉండునట్లు; ఇఱికి = ఇరికించుకొని.

సంగడీల = తోటివారి; నడుమన్ = మధ్యన; చక్కగన్ = చక్కగా; కూర్చుండి = కూర్చొని; నర్మ = పరి హాసపు; భాషణములన్ = మాటలతో; నగవు = నవ్వులను; నెఱపి = వ్యాపింపజేసి; యాగభోక్త = హవిర్భాగములు భుజించువాడు; కృష్ణుడు = శ్రీకృష్ణుడు; అమరులు = దేవతలు; వెఱగందన్ = అబ్బుర పడగా; శైశవంబున్ = బాల్యమును; మెఱసి = ప్రకాశింపజేసి; చల్దిన్ = చద్దికూడులు; కుడిచె = తినెను.

<u>భావము:-</u> యాగభోక్త అయిన శ్రీకృష్ణుడు దేవతలు అందరూ ఆశ్చర్య చకితులు అవుతుండగా మనోహర శైశవ చేష్టలు ప్రదర్శిస్తున్నాడు. పొట్టమీదకు దట్టీలా కట్టిన అంగవస్త్రంలో మనోజ్ఞమైన మురళిని ముడిచాడు. నిర్మలమైన కొమ్ముబూర, పశువుల తోలు కఱ్ఱలను ఎడం చంకలో చక్కగా ఇరికించి జారిపోకుండా పట్టుకున్నాడు. ఎడమ చేతిలో ఏమో మీగడ పెరుగు కలిపిన చద్దన్నం ముద్ద పట్టుకున్నాడు. కోరిమరీ తెచ్చుకున్న నంజుడు ఆవకాయ ముక్కలు వేళ్ళ మధ్య నేర్పుగా ఇరికించుకున్నాడు. తన తోటి పిల్లల మధ్య చక్కగా కూర్చుని వారితో ఒక ప్రక్క పరిహాసాలు ఆడుతున్నాడు. మరొక ప్రక్క చిరునవ్వులు రువ్వుతున్నాడు.

10.1-499-వ.

**ఇట్లు కృష్ణసహితు లయిన గోపకుమారులు చల్దులు గుడుచు సెడఁ గ్రేపులు మేపులకుం జొొచ్చి, పచ్చని గఱికిజొంపంబుల గుంపుల కుఱికి, లంపులు మేయుచు, ఘోరంబగు నరణ్యంబు నడుమం దోరంబగు దూరంబు జనిన, వానిఁగానక వెఱచు చున్న గోపడింభకులకు నంభోజనయనుం డిట్లనియె.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; కృష్ణ = కృష్ణునితో; సహితులు = కూడుకొన్న వారు; అయిన = ఐన; గోప = గొల్లల; కుమారులు = పిల్లలు; చల్దులు = చద్దిభోజనములు; కుడుచున్ = తిసెడి; ఎడన్ = సమయమునందు; క్రేపులు = దూడలు; మేపులు = గడ్డితినుట; కున్ = కోసము; ఛొచ్చి = మొదలిడి; పచ్చని = పచ్చటి; గఱిక = గడ్డి; జొంపంబుల = దుబ్బుల; గుంపుల్ = సమూహముల; కున్ = కు; ఉఱికి = పరిగెట్టిపోయి; లంపులు = దొంగమేత; మేయుచు = తినుచు; ఘోరంబు = భయంకరమైనది; అగు = ఐన; అరణ్యంబున్ = అడవి; నడుమన్ = మధ్యలో; తోరంబు = అధికమైనది; అగు = ఐన; దూరంబున్ = దూరమునకు; చనినన్ = వెళ్ళగా; వానిన్ = వాటిని, అవి; కానక = చూడలేక, కనబడక; వెఱచుచున్న = బెదురుతున్న; గోప = గొల్లల; డింభకుల్ = పిల్లలు; కున్ = కు; అంభోజనయనుండు = కృష్ణుడు, పద్మాక్షుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా ఇక్కడ కృష్ణుడితోపాటు గోపకుమారులు చల్దులు ఆరగిస్తుండగా, అక్కడ లేగదూడలు పచ్చికలు మేస్తున్నాయి. పచ్చని పచ్చికలున్న గుబుర్లలోనికి జొరబడి దొంగమేతలు మేస్తూ భయంకరమైన అరణ్యంలో చాలా దూరం వెళ్ళిపోయాయి. గోపబాలకులు భోజనాలు చేస్తూ లేగల కోసం చూస్తే అవి కనిపించ లేదు. వారు కంగారు పడుతుంటే కృష్ణుడు ఇలా అన్నాడు.

## క్రేపుల వెదక బోవుట

**10.1-500-మ.**

**"వినుఁ డో! బాలకులార! క్రేపు లటవీవీథిన్ మహా దూరముం**
**జనియెన్ గోమలఘాసఖాదనరతోత్సాహంబుతో నెందుఁ బో**
**యెనొ? యేమయ్యెనొ క్రూరజంతువులచే నేయాపదం బొందెనో?**
**కనితెత్తుం గుడువుండు చల్ది గొఱఁతల్గాకుండ మీ రందఱున్."**

**టీక:- వినుడు = వినండి; ఓ = ఓహోయ్; బాలకులారా = పిల్లలు; క్రేపులు = దూడలు; అటవీ = అడవి; వీధిన్ = మార్గమున; మహా = చాలా; దూరమున్ = దూరముగా; చనియెన్ = వెళ్ళినవి; కోమల = లేత; ఘాస = గడ్డిని; ఖాదన = తినవలెననెడి; రతి = ఆసక్తితో; ఉత్సాహంబు = హుషారు; తోన్ = తో; ఎందున్ = ఎక్కడికి; పోయెనో = వెళ్ళినవో; ఏమి = ఏమిటి; అయ్యెనో = జరిగినదో; క్రూర జంతువుల = క్రూరజంతువుల {క్రూర జంతువులు - ఇతర జంతువులను చంపి తినెడి పులి మున్నగు జంతువులు}; చేన్ = వలన; ఏ = ఎట్టి; ఆపదన్ = ప్రమాదము, ఇక్కట్లను; పొందెనో = పొందినవో; కని = చూసి; తెత్తున్ = తీసుకొని వచ్చెదను; కుడువుండు = తినండి; చల్దిన్ = చద్దిభోజనములు; కొఱతలు = తక్కువపడుట; కాకుండన్ = జరుగకుండా; మీరు = మీరు; అందఱున్ = అందరు.**

**భావము:- "ఓ మిత్రులారా! మన లేగదూడలు లేత పచ్చికల మేతలలో లీనమైపోయి, ఉత్సాహంతో అడవిలో చాలా దూరం వెళ్ళిపోయి నట్లున్నాయి. ఎక్కడకి వెళ్ళాయో యే మయ్యాయో? ఏ క్రూరజంతువుల కైనా చిక్కి ఆపదలో పడ్డాయో? ఏమిటో? నేను వెదకి తీసుకొస్తాను. మీరు కంగారు పడకుండా చల్దులు ఆరగిస్తూ ఉండండి." అని చెప్పి బయలుదేరాడు**

10.1-501-వ.

**అని చెప్పి,**

టీక:- అని = అని; చెప్పి = చెప్పి.

భావము:- ఇలా తన సహచరులకు చల్దులు తింటూ ఉండమని చెప్పిన కృష్ణుడు. . .

10.1-502-శా. *

**కర్ణాలంబిత కాక పక్షములతో గ్రైవేయహారాళితో**
**స్వర్ణాభాసిత వేత్రదండకముతో సత్పింఛదామంబుతోఁ**
**బూర్ణోత్సాహముతో ధృతాన్నకబళోత్ఫుల్లాబ్జహస్తంబుతోఁ**
**దూర్ణత్వంబున నేఁగె లేఁగలకునై దూరాటవీవీథికిన్.**

టీక:- కర్ణా = చెవులమీద; ఆలంబిత = వేళ్ళాడుచున్న; కాకపక్షముల = జులపాల; తోన్ = తోటి; గ్రైవేయ = మెడలోవేసుకొన్న; హార = దండల; ఆళి = వరుసల; తోన్ = తోటి; స్వర్ణ = బంగారము; ఆభాసిత = ప్రకాశించెడు; వేత్ర దండకము = బెత్తంకఱ్ఱ; తోన్ = తోటి; సత్ = మంచి; పింఛ = నెమలి పింఛముల; దామంబు = మాల; తోన్ = తోటి; పూర్ణ = నిండు; ఉత్సాహము = పూనిక; తోన్ = తోటి; ధృత = ధరింపబడిన; అన్న = అన్నపు; కబళ = ముద్ద కలిగిన; ఉత్ఫుల్ల = వికసిన; అబ్జ = పద్మము వంటి; హస్తంబు = చేతి; తోన్ = తోటి; తూర్ణత్వంబునన్ = తొందర కలిగి; ఏగెన్ = వెళ్ళెను; లేగలు = దూడలు; కున్ = కోసము; ఐ = అయ్యి; దూర = దూరము నందలి; అటవీ = అడవి; వీథికిన్ = మార్గమున.

భావము:- జులపాల జుట్టు చెవులదాకా వేళ్ళాడుతూ ఉంది. మెడలో హారాలు మెరుస్తున్నాయి. బంగరంలా మెరిసే కఱ్ఱ చేతిలో ఉంది. చక్కటి నెమలి పింఛం తలపై ధరించాడు. ఎఱ్ఱటి అర చేతిలో తెల్లటి అన్నం ముద్ద మెరిసి

పోతూ ఉంది. ఇలా గోపాల కృష్ణుడు ఉత్సాహంతో లేగదూడలను వెదకడానికి అడవిలో ఎంతో దూర ప్రాంతాలకి వెళ్ళాడు.

10.1-503-వ.

ఇ ట్లేగుచు.

టీక:- ఇట్లు = ఈ విధముగ; ఏగుచున్ = వెళ్తు. భావము:- అలా దూడల జాడలకై వెళ్తూ.

10.1-504-క.

"ఇచ్చోఁ బచ్చిక మేసిన;

విచ్చోఁ ద్రావినవి తోయ; మేగిన విచ్చో;

నిచ్చోట మంద గొన్నవి;

యిచ్చోఁ బాసినవి; జాడ యిదె యిదె" యనుచున్.

టీక:- ఈ = ఈ; చోన్ = చోటునందు; పచ్చిక = పచ్చిగడ్డి; మేసినవి = తిన్నాయి; ఈ = ఈ; చోన్ = చోటునందు; త్రావినవి = తాగినవి; తోయము = నీళ్ళు; ఏగినవి = వెళ్ళిపోయినవి; ఈ = ఈ; చోన్ = చోటునందు; ఈ = ఈ; చోటన్ = చోటునందు; మందగొన్నవి = గుంపుకట్టినవి; ఈ = ఈ; చోన్ = ప్రదేశమునందు; పాసినవి = విడిపోయినవి; జాడ = ఆనమాళ్ళు; ఇదెయిదె = తప్పక ఇదే; అనుచున్ = అనుచు.

భావము:- అలా వెళ్తూ కృష్ణుడు లేగల జాడ కనిపెట్టసాగాడు. "ఇవిగో ఇక్కడ పచ్చిక మేసాయి. ఇక్కడ నీరు త్రాగాయి. ఇదిగో ఇక్కడ మళ్ళీ బయలుదేరాయి. ఇక్కడ ఒక్కచోటికి మందగా చేరాయి. ఇదిగో ఇక్కడ మంద విడిపోయాయి."

10.1-505-క.

**కంజదళాక్షుఁడు పెదకెను**

**గొంజక లేఁగల నపార గురుతృణవనికా**

**పుంజంబుల భీకర మృగ**

**కుంజంబుల దరుల గిరులఁ గొలఁకుల నదులన్.**

టీక:- కంజదళాక్షుడు = పద్మాక్షుడు, కృష్ణుడు; పెదకెన్ = అన్వేషించెను; కొంజక = వెనుదీయక; లేగలన్ = దూడలను; అపార = అమితమైన; గురు = గొప్ప; తృణ = గడ్డిగల; వనికా = అడవుల; పుంజంబులన్ = సమూహము లందు; భీకర = భయంకరమైన; మృగ = జంతువులు కల; కుంజంబులన్ = పొదలలో; దరులన్ = గుహలలో; గిరులన్ = కొండలలో; కొలకులన్ = చెరువులలో; నదులన్ = ఏర్లుయందు.

భావము:- ఇలా చూసుకుంటూ కృష్ణుడు వెనుదీయకుండా లేగలను వెదుకసాగాడు. దట్టమైన అడవిలో పచ్చిక గుబురులలోనూ; భయంకర మృగాలుండే చెట్ల గుంపుల లోనూ; చెట్లవెనుక; పర్వతాలపైనా; కొలనుల చెంత; నదుల దగ్గర అంతటా పెదికాడు.

10.1-506-వ.

**అంత.**

టీక:- అంత = అప్పుడు. భావము:- అప్పుడు



## బ్రహ్మ వత్స బాలకుల దాచుట

10.1-507-శా.

"బాలుండయ్యు నితం డఘాసురుఁడు ద్రుంపన్ బాలురం గ్రేపులన్
యేలీలన్ బ్రతికించెనొక్కో? భువి నూహింపం గడుం జోద్య" మం
చాలో నంబుజసంభవుండు చని మాయా బాలు శుంభద్బలం
బాలోకింపఁ దలంచి డాఁచె నొకచో నా లేఁగలన్ బాలురన్.

టీక:- బాలుండు = చిన్నపిల్లవాడు; అయ్యున్ = అయినప్పటికి; ఇతండు = ఇతను; అఘాసురుఁడు = అఘాసురుడు; త్రుంపన్ = చంపబోగా; బాలురన్ = పిల్లలను; క్రేపులన్ = దూడలను; ఏ = ఎట్టి; లీలన్ = విధానముతో; బ్రతికించెనొక్కో = కాపాడెనో కదా; భువిన్ = భూలోకము నందు; ఉహింపన్ = తలచుటకే; కడున్ = మిక్కిలి; చోద్యము = ఆశ్చర్యకరమైనది; అంచున్ = అనుచు; ఆలోనన్ = అంతలోపల; అంబుజసంభవుండు = బ్రహ్మదేవుడు {అంబుజ సంభవుడు - అంబుజ (పద్మము)న సంభవుడు (పుట్టినవాడు). బ్రహ్మ}; చని = వెళ్ళి; మాయాబాలు = కపటబాలకుని; శుంభత్ =ప్రకాశించెడి; బలంబున్ = శక్తిని; ఆలోకింపన్ = చూడవలెనని; తలంచి = భావించి; డాచెన్ = దాచివేసెను; ఒక = ఒకానొక; చోన్ = స్థలమున; ఆ = ఆ; లేగలన్ = దూడలను; బాలురన్ = పిల్లలను.

భావము:- అలా కృష్ణుడు పశువులను వెతుకుతుంటే, భూమికి దిగి వచ్చిన బ్రహ్మదేవుడు ఇలా అనుకున్నాడు. "ఇతడు పసిబాలుడు కదా! అఘాసురుడు మ్రింగిన గోపబాలురను లేగలను ఎలా రక్షించగలిగాడు? ఇది ఈ భూలోకం లోనే చాలా ఆశ్చర్యకరమైన విషయమే. ఈ మాయబాలకుడి మహాశక్తి ఎలాంటిదో పరీక్షించి చూద్దాం" అనుకున్నాడు. బ్రహ్మయ్య ఇటు అడవిలోని లేగలను, అటు భోజనాలు చేస్తున్న బాలురనూ ఒక రహస్య ప్రదేశంలో దాచాడు.

10.1-508-వ.

**ఆ సమయంబున, దూడలు పోయిన జాడ యెఱుంగక, తప్పి య పద్మలోచ నుండెప్పటి కొలంకుకడకు వచ్చి, యచ్చోట సె సెచ్చెలులం గానక వారిం జీరి, లేకుండుట నిశ్చయించి గోవిందుండు విశ్వవిదుండు గావున నిది విరించి మొఱంగని యెఱింగి తిరిగి పోవుచు.**

టీక:- ఆసమయంబునన్ = అప్పుడు; దూడలు = ఆవుదూడలు; పోయిన = వెళ్ళిన; జాడ = ఆనమాళ్ళు; ఎఱుంగక = తెలియక; తప్పి = తప్పిపోగా; ఆ = ఆ ప్రసిద్ధుడైన; పద్మలోచనుండు = పద్మాక్షుడు, కృష్ణుడు; ఎప్పటి = మునుపటి; కొలంకు = కొలను; కడ = వద్ద; కున్ = కు; వచ్చి = వచ్చి; ఆ = ఆ; చోటన్ = ప్రదేశమునందు; సెచ్చెలులన్ = స్నేహితులను; కానక = కనుగొనలేక; వారిన్ = వారిని; చీరి = పిలిచి; లేకుండుట = అక్కడ లేకపోవుటను; నిశ్చయించుకొని = స్థిరపరచుకొని; గోవిందుండు = శ్రీకృష్ణుడు {గోవిందుడు - గో (ఆవులు, జీవుల)కు విందుడు, విష్ణువు}; విశ్వ = సర్వము; విదుండు = తెలిసినవాడు; కావున = కనుక; ఇది = ఈ పని; విరించి = బ్రహ్మదేవునియొక్క; మొఱంగు = మోసము; అని = అని; ఎఱింగి = తెలుసుకొని; తిరిగి = వెనుకకు (మందకు); పోవుచున్ = వెళ్తూ.

భావము:- అప్పుడు కృష్ణుడు దూడలజాడలు కనపడక తిరిగి కొలను వద్దకు వచ్చాడు. అక్కడ గోపబాలురు కూడా కనిపించలేదు. వారిని పిలిచి వారు ఇక్కడ లేరని నిర్ధారించు కున్నాడు. కృష్ణుడు విశ్వంలోని రహస్యాలన్నీ ఎరిగిన వాడు కదా. ఇది బ్రహ్మదేవుడి మోసం అని గ్రహించాడు. వెంటనే గిరుక్కున వెనుదిరిగాడు.

10.1-509-శా.

**"వంచింపం బనిలేదు బ్రహ్మ కిచటన్ వత్సంబులన్ బాలురన్**
**వంచించెంగనుఁబ్రామి; తన్ను మరలన్ వంచించుటాశ్చర్యమే?**
**వంచింపం మనకేల? తెచ్చుటకునై వ"ల్లంచు బ్రహ్మాండము**
**ల్వంచింపన్ మరలింప నేర్చు హరి లీలన్ మందహాసాస్యుఁడై.**

టీక:- వంచింపన్ = మోసముచేయుటకు; పనిలేదు = అవసరములేదు; బ్రహ్మ = బ్రహ్మదేవునికి; ఇచటన్ = ఇక్కడ; వత్సంబులన్ = దూడలను; బాలురన్ = పిల్లలను; వంచించెన్ = మోసపుచ్చెను; కనుబ్రామి = మాయచేసి; తన్ను = అతనిని; మరలన్ = తిరిగి; వంచించుట = మోసపుచ్చుట; ఆశ్చర్యమే = అబ్బురమా, కాదు; వంచింపన్ = మోసపుచ్చుట; మన =మన; కున్ = కు; ఏలన్ = ఎందుకులే; తెచ్చుటకునై = తీసుకొని వచ్చుట కోసము; వల్లు = వద్దులే; అంచున్ = అనుచు; బ్రహ్మాండముల్ = బ్రహ్మాండములనే; వంచింపన్ = మాయము చేయ; మరలింప = మరల పుట్టింప; నేర్చు = సమర్థుడైన; హరి = విష్ణువు; లీలన్ = విలాసముగా; మందహాస = చిరునవ్వుకలిగిన; ఆస్యుడు = మోముకలవాడు; ఐ = అయ్యి.

భావము:- "ఇలా పిల్లలను, లేగదూడలను వంచనచేసి మాయం చేయ వలసిన అవసరం బ్రహ్మకు ఏమీ లేదు. అయినా నా కన్నుకప్పి మోసం చేసాడు. అతణ్ణి తిరిగి మోసం చేయడం నాకు పెద్ద కష్టమైన పని కాదు. అయినా వారిని తిరిగి తీసుకురాడానికి అతణ్ణి వంచించడం మనకెందుకు వద్దులే" అంటూ పెదవులపై చిరునవ్వులు చిందించాడు. శ్రీహరి ఈ బ్రహ్మండాలనే వంచించడం మరలించడం అనే విద్యలలో నేర్పరి కదా.

10.1-510-క.

"గోపాలసుతులు లే రని

గోపికలకుఁ జెప్ప నేల? గోపాలకులున్

గోపికలు నలర బాలుర

క్రేపులరూపముల నేఁ జరించెద ననుచున్. "

టీక:- గోపాల = గొల్లల; సుతులు = పిల్లలు; లేరు = లేరు; అని = అని; గోపికలు = యాదవస్త్రీల; కున్ = కు; చెప్పన్ = చెప్పుట; ఏలన్ = ఎందుకు; గోపాలకులున్ = గొల్లలు; గోపికలు = గొల్లభామలు; అలరన్ = సంతోషించు నట్లు; బాలురన్ = పిల్లలు;క్రేపులన్ = దూడలు; రూపములన్ = ఆకృతులందు; నేన్ = నేనే; చరించెదన్ = వర్తించెదను; అనుచున్ = అనుకొనుచు.

భావము:- "ఇంటికి తిరిగివెళ్ళి మీ పిల్లలు లేరమ్మా అని గోపికలకు చెప్పడం దేనికి? నేనే గోపబాలకుల రూపాల లోనూ; గోవత్సాల రూపాల లోనూ సంచరిస్తాను గోపికలు గోపకులు కూడా ఎప్పటిలాగే చాలా సంతోషిస్తారు." అంటూ

## వత్స బాలకుల రూపు డగుట

10.1-511-మ.

కరముల్పాదములున్ శిరంబు లవలగ్నంబుల్ ముఖంబుల్ భుజాం

తరముల్ ముక్కులుగన్నులుం శ్రవణముల్గంతాదులున్ దండ కాం

బర ప్రగ్వేణు విషాణ భూషణ వయో భాషా గుణాఖ్యాన త

త్పరతల్ వీడ్వడకుండఁ దాల్చె విభుఁ డా వత్సార్భకాకారముల్.

టీక:- కరముల్ = చేతులు; పాదములున్ = కాళ్ళు; శిరంబుల్ = తలలు; అవలగ్నంబుల్ = నడుములు; ముఖంబుల్ = ముఖములు; భుజాంతరముల్

= వక్షస్థలములు; ముక్కులు = ముక్కులు; కన్నులున్ = కళ్ళు; శ్రవణముల్ = చెవులు; దంత = దంతములు; ఆదులున్ = మున్నగునవి; దండక = చేతికఱ్ఱలు; అంబర = దుస్తులు; స్రక్ = పూలమాలలు; వేణు = పిల్లనగ్రోవులు; విషాణ = కొమ్ముబూరలు; భూషణ = అలంకారములు; వయస్ = ఈడు; భాషా = మాటలు; గుణ = గుణములు; ఆఖ్యాన = పేర్లు; తత్పరతలు = ఆసక్తులు; వీడ్వడ కుండన్ = తప్పిపోకుండగ; తాల్చెన్ = ధరించెను; విభుడు = శ్రీకృష్ణుడు; ఆ = ఆ; వత్స = దూడల; అర్భక = పిల్లల; ఆకారముల్ = ఆకృతులను.

భావము:- ఇలా అయితే గోపికలు సంతోషిస్తారు కదా అనుకుంటూ, కృష్ణబాలుడు ఆ యా లేగదూడల, గోపబాలకుల రూపాలను అన్నీ తానే ధరించాడు. అన్ని అవయవాదులు ఆ యా బాలుర పోలికల్లోనే ఉన్నాయి. అంతే కాకుండా, ఆ బాలురు ధరించే చేతికఱ్ఱలు, వస్త్రాలు, దండలు, వేణువులు, కొమ్ముబూరాలు, ఆభరణాలు, వారి వయస్సులు, గుణాలు, మాటలాడే యాస ఏ ఒక్కటి వదలకుండా సంపూర్ణంగా ఆ యా బాలుర, లేగల స్వరూపాలు అన్నీ తనే ధరించాడు.

10.1-512-క.

**రూపంబు లెల్ల నగు బహు**

**రూపకుఁ డిటు బాలవత్సరూపంబులతో**

**నేపారు టేమి చోద్యము?**

**రూపింపఁగ నతని కితరరూపము గలదే?**

టీక:- రూపంబులు = స్వరూపములు; ఎల్లన్ = సమస్తము; అగున్ = తానే ఐనట్టి; బహురూపకుడు = సర్వవ్యాపి; ఇటు = ఇలా; బాల = పిల్లల; వత్స = దూడల; రూపంబులు = ఆకృతుల; తోన్ = తోటి; ఏపారుట = అతిశయించుటలో; ఏమి = ఏమి; చోద్యము = ఆశ్చర్యము కలదు, లేదు; రూపింపగన్

=నిరూపించుటకు, ఋజువు చేయుటకు; అతని = ఆ భగవంతుని; కిన్ = కంటె; ఇతర = అన్యమైన; రూపమున్ = స్వరూపము; కలదే = ఉన్నదా, లేదు.

భావము:- ఈ జగన్నాటకంలో అందరి రూపాలూ ధరించే అంతర్యామి స్వరూపుడు ఆ గోపాలకృష్ణుడు కదా. ఆ మహానటుడు ఇలా బాలురయొక్క, లేగలయొక్క రూపాలు ధరించడంలో ఏమి ఆశ్చర్యం ఉంది. ఏ రూపంలో అయినా ఉన్నవాడు అతడే. జాగ్రత్తగా గమనిస్తే అతడు సర్వాత్మకుడు రూపాతీతుడు కనుక అతనికి రూపం అన్నది వేరే ఉండదు కదా. అవును, ఆ జగన్నాటక సూత్రధారి ధరించలేని పాత్ర ఏముంటుంది.

10.1-513-క. *

మరలుపు మనియెడు కర్తయు
మరలించు కుమారకులును మరలెడిక్రేపుల్
పరికింపఁ దాన యై హరి
మరలం జనె లీలతోడ మందకు నధిపా!

టీక:- మరలుపుము = మళ్ళించు; అనియెడు = అనెడి; కర్త = బాధ్యుడు; మరలించు = మళ్లించెడి; కుమారకులును = బాలురు; మరలెడి = మళ్ళెడి; క్రేపుల్ = దూడలు; పరికింపన్ = పరిశీలించి చూసినచో; తాన = తనే; ఐ = అయ్యి; హరి = కృష్ణుడు; మరలన్ = వెనుకకు; చనెన్ = వెళ్ళిపోయెను; లీల = విలాసము; తోన్ = తో; మందకున్ = రేపల్లె; కున్ = కు; అధిపా = రాజా.

భావము:-విచిత్రంగా మందలోని పశువులను తమ ఇంటి వైపు తోలమని చెప్పేవాడు తానే, అలాతోలుతున్నగొల్లపిల్లలు తానే, అలా తోలబడి తమ ఇళ్ళకు వెళ్తున్న పశువులు తానే అయ్యి ఆ శ్రీహరి గొప్పవినోదంగా రేపల్లెకు వెళ్ళాడు.

విశేషము- సూత్రధారి పాత్రధారి అభేదమూ జీవాత్మ పరమాత్మల అభేదమూ, ఆహా! ఏమి లీల!

10.1-514-వ.

**ఇట్లు బాలవత్సరూపంబులతో విహరించుచు మందకు వచ్చి వారివారి దొడ్ల నయ్యై వత్సంబుల ముందఱి కందువల నిలిపి, తత్తద్బాలరూపంబుల నందఱి గృహంబులం బ్రవేశించి వేణు నాదంబులు చేసిన.**

టీక:- ఇట్లు = ఇలా; బాల = పిల్లల; వత్స = దూడల; రూపంబుల్ = ఆకృతుల; తోన్ = తోటి; విహరించుచున్ = మెలగుచు; మందకున్ = బృందావనమున; కున్ = కు; వచ్చి = చేరి; వారివారి = వారివారి; దొడ్లన్ = పెరళ్ళలో; అయ్యై = ఆయా; వత్సంబులన్ = దూడలను; ముందరి = మునుపటి; కందువలన్ = చోట్లలో; నిలిపి = ఉంచి; తత్ = ఆయా; బాల = పిల్లల; రూపం బులన్ = ఆకృతులలో; అందఱి=అందరి; గృహంబులన్ =ఇళ్ళలోకి; ప్రవేశించి = వెళ్ళి; వేణు = మురళీ; నాదంబులు = గానములు; చేసినన్ = చేయగా.

భావము:- ఇలా సమస్తమైన బాలురు, లేగలుయొక్క స్వరూపాలు అన్నీ తానే ధరించి విహరిస్తూ గోకులానికి తిరిగివచ్చి, వారివారిదొడ్లలో ఆయా దూడలను ఆయా స్థానాలలో కట్టేసి, ఆయా బాలకుల స్వరూపంలో ఆయా ఇళ్ళల్లో ప్రవేశించి వారి వారి వేణువుల ద్వారా వేణునాదం వినిపించ సాగాడు.

10.1-515-చ.

**కొడుకుల వేణునాదములు గొబ్బున వీనులకుం బ్రియంబు లై**
**ముడిపడ లేచి యెత్తుకొని మూర్కొని తల్లులు గౌగలించుచుం**
**జడిగొనఁ జేపువచ్చి తమచన్నుల యందు సుధాసమంబు లై**
**వెడలెడి పాలు నిండుకొనువేడుక నిచ్చిరి తత్సుతాళికిన్.**

టీక:- కొడుకుల = కుమారుల; వేణు = పిల్లనగ్రోవులు; నాదములు = ధ్వనులు; గొబ్బునన్ = తటాలున; వీనుల్ = చెవుల; కున్ = కు; ప్రియంబులు =

ఇష్టమైనవి; ఐ = అయ్యి; ముడిపడన్ = తగుల్కొ నగా; లేచి = లేచినుంచుని; ఎత్తుకొని = ఎత్తుకొని; మూర్కొని = ముద్దుచేసి; తల్లులు = ఆయా తల్లులు; కౌగలించుచున్ = కౌగలించుకొనుచు; జడిగొనన్ = మిక్కిలిగా; చేపు = ఉబికి; వచ్చి = వచ్చిన; తమ = వారి; చన్నుల = స్తన్యముల; అందు = అందు; సుధా = అమృతతో; సమంబులు = సమానమైనవి; ఐ=అయ్యి; పెడలెడి =కారెడి; పాలున్ = పాలను; నిండుకొను = సంపూర్ణమైన; వేడుకన్ = కుతూహల ముతో; ఇచ్చిరి = ఇచ్చిరి; తత్ = ఆయా; సుత = బాలుర; ఆళి = సమూహమున; కిన్ = కి.

భావము:- గోపబాలకుల తల్లులు కొడుకుల వేణునాదాలు విన్నారు. అవి వీనులవిందుగా వినిపించి వారి మనస్సులు పరవశించాయి. వెంటనే ఆ తల్లులు లేచి కుమారులను కౌగిలించుకుని శిరస్సులను మూర్కొన్నారు. వారి పాలిళ్ళు అందు పాలు ఉప్పొంగేంతగా చేపుకుని వచ్చాయి. గోపికలు అమృతంతో సమాన మైన ఆ పాలను నిండైన ప్రేమతో కొడుకులకు త్రాగించారు.

10.1-516-వ.

**మఱియుఁ దల్లు లుల్లంబులం బెల్లుగ పెల్లిగొనిన వేడుకలం దమనందనులకు నలుంగు లిడి, మజ్జనంబులు గావించి, గంధంబు లలంది తొడవులు దొడిగి నిటలతటంబుల రక్షా తిలకంబులు పెట్టి, సకలపదార్థసంపన్నంబులైన యన్నంబు లొసంగి సన్నములు గాని మన్ననలు చేసిరి.**

టీక:-మఱియున్ = ఇంకను; తల్లులు = తల్లులు; ఉల్లంబులన్ = మనసు లలో; పెల్లుగ = అధిక ముగా; పెల్లిగొనిన = ఉబికెడి; వేడుకలన్ = ఉత్సాహము లతో; తమ = వారివారి; నందనుల్ = పిల్లల; కున్; నలుంగులు = నలుగులు; ఇడి = పెట్టి; మజ్జనంబులు = స్నానములు; కావించి = చేయించి; గంధంబు లన్ = గంధములను; అలంది = రాసి; తొడవులు = ఆభరణములు; తొడిగి =

తొడిగి; నిటలతటంబులన్ = నొసటిప్రాంతమున; రక్షా = దిష్టి; తిలకంబులు = బొట్లు; పెట్టి = పెట్టి; సకల = అన్ని; పదార్థ = వస్తువులు; సంపన్నంబులు = సమృద్ధిగా ఉన్నవి; ఐన = అయిన; అన్నంబులున్ = అన్నము లను; ఒసంగి = పెట్టి; సన్నములుగాని = ఎక్కువలైన; మన్ననలు = ఆదరణలు; చేసిరి = చేసిరి.

భావము:- పిమ్మట, ఆ గోపికా తల్లుల హృదయాలు ఆనందంతో పరవళ్ళు తొక్కగా వారు ఎంతో వేడుకతో కొడుకులకు నలుగుపెట్టి తలంటి స్నానాలు చేయించారు; గంధాలు పూసారు; చక్కని ఆభరణాలు అలంకరించారు; నుదిటిపై రక్షా తిలకాలు పెట్టారు; అన్ని రకాల పదార్థాలతోనూ భోజనాలు పెట్టారు; ఎంతో ప్రేమతో వారిని ఆదరించారు.

10.1-517-క.

ఏ తల్లుల కే బాలకు

లే తెఱఁగునఁ దిరిగి ప్రీతి నెఁసగింతురు ము

న్నా తల్లుల కా బాలకు

లా తెఱఁగునఁ బ్రీతిఁ జేసి రవనీనాథా!

టీక:- ఏ = ఏ; తల్లులు = తల్లుల; కిన్ = కి; ఏ = ఏ; బాలకులు = పిల్లలు; ఏ = ఏ; తెఱంగునన్ = రీతిని; తిరిగి = మెలగి; ప్రీతిన్ = సంతోషమును; ఎసగింతురు = అతిశయింపజేతురో; మున్ను = ఇంతకుముందు; ఆ = ఆయా; తల్లులు = తల్లుల; కిన్ = కి; ఆ = ఆయా; బాలకులు = పిల్లలు; ఆ = ఆయా; తెఱంగున్ = రీతిని; ప్రీతిన్ = సంతోషమును; చేసిరి = కలిగించిరి; అవనీనాథా = రాజా {అవనీ నాథుడు - అవని (భూమి)కి నాథుడు, రాజు}.

భావము:- ఓ పరీక్షి న్మహారాజా! ఇంతకు ముందు ఏ బాలకులు ఏ తల్లులకు ఏ యే విధంగా ఆనందం కలిగించారో; ఇప్పుడు అలాగే ఆ యా బాలకులు ఆ యా తల్లులకు అ యా విధాలైన ఆనందాలు కలిగించారు.

10.1-518-వ.

**ఆ సమయంబున.**

టీక:- ఆ = ఆ; సమయంబునన్ = సమయమునందు.

భావము:- ఆ సమయంలో...

10.1-519-ఉ.

**పాయని వేడ్కతో నునికిపట్టులకుం జని గోవులెల్ల నం**
**బే యని చీరి హుమ్మనుచుఁ బేరిచి మూర్కొని పంచితిల్లి పె**
**ల్లై యతిరేకమై పొదుగులం దెడలేక స్రవించుచున్న పా**
**లాయెడ నాకుచున్ సుముఖలై యొసఁగెన్ నిజవత్సకోటికిన్.**

టీక:- పాయని = తొలగని; వేడ్క = ఉత్సాహములతో; ఉనికిపట్టులు = ఉండేచోటుల; కున్ = కు; చని = వెళ్ళి; గోవులు = ఆవులు; ఎల్లన్ = అన్ని; అంబే = అంబా; అని = అని; చీరి = అరచి; హుమ్మ = హుమ్మ; అనుచున్ = అనుచు; పేరిచి = అతిశయించి; మూర్కొని = మూజూసి; పంచితిల్లి = మూత్రమువిడిచి; పెల్లు = అధికము; ఐ = అయ్యి; అతిరేకము = మించినవి; ఐ = అయ్యి; పొదుగులన్ = పొదుగులనుండి; ఎడలేక = ఎడతెగకుండ; స్రవించుచున్న = కారుచున్న; పాలున్ = పాలు; ఆ = ఆ; ఎడన్ = సమయమునందు; నాకుచున్ = దేహము నాకుచు; సుముఖులు = అనుకూలముగా ఉన్నవి; ఐ = అయ్యి; ఒసగెన్ = ఇచ్చినవి; నిజ = వానివాని; వత్స = దూడ; కోటి = సమూహమున; కిన్ = కు.

భావము:- దొడ్లలో ఉన్న ఆవులు తమ దూడలను చూడగానే అంబా అంటూ బిడ్డలను పిలిచాయి; హుమ్మంటూ దూడలను వాసన చూసి, ఆనందంతో చటుక్కున మూత్రాలు కార్చాయి; ప్రేమతో దూడలను నాకుతూ, పొదుగుల నుండి కురుస్తున్న పాలను లేగదూడలకు త్రాగించాయి.

10.1-520-క.

ప్రేతలకును గోపులకును

మాతృత్వము జాలఁ గలిగె మఱి మాధవుపై

మాత లని హరియు నిర్మల

కౌతూహల మొప్పఁ దిరిగెఁ గడు బాల్యమునన్.

టీక:- ప్రేతలు = గోపికల; కును = కు; గోపులు = గోపుల; కును = కు; మాతృత్వము = తల్లిదనము; చాలన్ = మిక్కిలిగా; కలిగెన్ = కలిగినది; మఱి = ఇంకను; మాధవు = కృష్ణుని; పై = మీద; మాతలు = తల్లులు; అని = అని; హరియున్ = కృష్ణుడు కూడ; నిర్మల = స్వచ్ఛమైన; కౌతూహలము = ఉత్సుకత కలిగి ఉండుట; ఒప్పన్ = చక్కగానుండ; తిరిగెన్ = మెలగెను; కడు = మిక్కిలి; బాల్యమునన్ = పసితనముతో.

భావము:- గోపికలకు, గోపులకు కూడా తమ బిడ్డల రూపంలో ఉన్న కృష్ణునిపై మాతృప్రేమ ఎంతో అధికంగా కలిగింది. శ్రీహరి కూడా వారిని తల్లులు అంటూ ఎంతో స్వచ్ఛమైన ప్రేమతో పసిపిల్లవాడిగా వారి మధ్య ప్రవర్తించాడు.

10.1-521-ఆ.

ఘోషజనుల కెల్లఁ గుఱ్ఱలపై వేడ్క

పూఁటపూఁట కెలమిఁ బొటకరించె

నిచ్చ గ్రొత్త యగుచు నీరజాక్షునిమీఁద

వేడ్క దమకుఁ దొల్లి పెలసినట్లు.

టీక:- ఘోష = గొల్ల; జనుల = వారి; కిన్ = కి; ఎల్లన్ = అందరికి; కుఱ్ఱల = బాలుర; పై = మీద; వేడ్క = ప్రీతి; పూటపూట = ఒక్కొక్కపూటగడిచేకొద్దీ; ఎలమిన్ = సంతోషము; పొటకరించెన్ = అతిశయించెను; నిచ్చ = ఎల్లప్పుడు; క్రొత్త = అపూర్వములు; అగుచున్ = ఔతూ; నీరజాక్షుని = శ్రీకృష్ణుని; మీదన్ =

పైన; వేడ్క = కుతూహలము; తమ = వారల; కున్ = కు; తొల్లి = మునుపు; పెలసినట్టు = కుదుర్కొన్నట్లుగా.

భావము:- పూర్వం బాలకృష్ణుని మీద తమకు మిక్కిలి అధికమైన ప్రేమ కలిగినట్లు. ఈ గోపబాలకుల పైన కూడ గోకులంలోని జనులు అందరికి రోజురోజుకీ ప్రేమలుపెరగుతూ ఏ రోజుకారోజు క్రొత్తలు తొడుగుతూనే ఉండేవి.

10.1-522-వ.

**ఇట్లు కృష్ణుండు బాలవత్సరూపంబులు దాల్చి తన్నుఁ దాన రక్షించుకొనుచు, మందను వనంబున నమంద మహిమంబున నొక్క యేఁడు గ్రీడించె, నా యేటికి నైదాఱు దినంబులు కడమపడి యుండ నందొక్కనాఁడు బలభద్రుండును, దానును వనంబునకుం జని మందచేరువ లేఁగల మేప నతి దూరంబున గోవర్ధన శైలశిఖరంబున ఘాసంబులు గ్రాసంబులు గొనుచున్న గోవు లా లేఁగలం గని.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; కృష్ణుండు = కృష్ణుడు; బాల = బాలుర; వత్స = దూడల; రూపంబులున్ = ఆకృతులను; తాల్చి = ధరించి; తన్ను = అతనిని; తాన = అతనే; రక్షించుకొనుచు = పాలన చేయుచు; మందను = బృందావనం విడిదిలో; వనంబునన్ = అడవి యందు; అమంద = గొప్ప; మహిమంబునన్ = మహిమతో; ఒక్క = ఒక (1); ఏడున్ = సంవత్సరముపాటు; క్రీడించెను = విహరించెను; ఆ = ఆయొక్క; ఏటి = సంవత్సరమున; కిన్ = కు; ఐదు = అయిదు (5); ఆఱు = ఆరు (6); దినంబులు = రోజులు; కడమపడి = మిగిలి; ఉండన్ = ఉండగా; అందున్ = అప్పుడు; ఒక్క = ఒకానొక; నాడు = దినమున; బలభద్రుండును = బలరాముడు; తానునున్ = అతను; వనంబున్ = అడవి; కున్ = కి; చని = పెళ్ళి; మంద = ప్రేపల్లెకు; చేరువన్ = దగ్గరగా; లేగలన్ =

దూడలను; మేపన్ = మేపుతుండగా; అతి = చాలా; దూరంబునన్ = దూరమునందు; గోవర్ధన = గోవర్ధనము అనెడి; శైల = కొండ; శిఖరంబునన్ = కొనయందు; ఘాసంబులున్ = లేతపచ్చికలను, కసవులు; గ్రాసంబులు గొనుచు = ఆహారించుచు, మేస్తూ; ఉన్న = ఉన్నట్టి; గోవులు = గోవులు; ఆ = ఆయొక్క; లేగలన్ = దూడలను; కని = చూసి.

భావము:- ఇలా బాలకృష్ణుడు గొల్లపిల్లల రూపాలూ దూడల రూపాలు తానే ధరించి, అందరి రూపాలలోనూ ఉన్న తనను తాను రక్షించుకుంటూ, ఆ బృందావనంలోనూ గోకులంలోనూ మహమహిమతో ఒక ఏడాది పాటు విహరించాడు. ఏడాదికి ఇంకా ఐదారు రోజులు ఉన్నయి అనగా, ఒకనాడు తాను బలరాముడు అడవికి వెళ్ళి మందకు దగ్గరగా లేగదూడలను మేపుతున్నారు. ఆ ప్రదేశానికి చాలాదూరంగా గోవర్ధనపర్వత శిఖరంపైన గోపకులు ఆవులు మేపుతున్నారు. ఆ కొండ మీది ఆవులు ఈ క్రింద ఉన్న దూడలను చూసాయి.

10.1-523-చ.

ముదమునహుంకరించుచును; మూఁపులపై మెడలెత్తి చాఁచుచున్
బదములు నాల్గు రెండయిన బాగునఁ గూడఁగ బెట్టి దాఁటుచున్
వదనములన్ విశాలతర వాలములన్ వడి సెత్తి పాఱి యా
మొదవులు చన్నులంగుడిపె మూఁతుల ఖ్రింగెడిభంగి నాకుచున్.

టీక:- ముదమునన్ = సంతోషముతో; హుంకరించుచును = హుమ్మనుచు; మూపుల = మూపురముల; పైన్ = మీదకానునట్లు; మెడలు = మెడలను; ఎత్తి = ఎత్తి; చాచుచున్ = సాగదీయుచు; పదములు = కాళ్ళు; నాల్గు = నాలుగు (4); రెండు = రెండు (2); అయిన = ఐన; బాగునన్ = విధముగా; కూడగబెట్ట = దగ్గరకుచేర్చి; దాటుచున్ = దూకుతూ; వదనములన్ = ముఖములను; విశాలతర = బాగాపెద్దపైన {విశాలము - విశాలతరము - విశాలతమము};

వాలములన్ = తోకలను; వడిన్ = విసురుగా; ఎత్తి = పైకెత్తి; పాఱి = పరుగెట్టి; ఆ = ఆయొక్క; మొదవులు = ఆవులు; చన్నులన్ = స్తన్యములను; కుడిపెన్ = తాగించెను; మూతులన్ = మూతులతో; ఖ్రింగెడి = మింగేస్తున్నాయా; భంగిన్ = అన్న విధముగా; నాకుచున్ = (దూడలను) నాకుతు {నాకుట – నాలుకతో రాయుటాదులు చేయుట}.

భావము:- ఆనందంతో ఆ ఆవులు ఒక్కసారి హూంకరించాయి; మూపుల పైదాకా మెడలు ఎత్తి వేగంగా చెంగుచెంగున దాట్లువేస్తూ పరిగెత్తాయి; తోకలు ముఖాలపైకి వచ్చేలా ఎత్తి దూడల దగ్గరకు పరిగెత్తాయి; లేగల మూతులను ఆత్రంగా నాకుతూ ఆవులు లేగలకు పాలు కుడిపాయి.

10.1-524-వ.

**అంత గోపకులు గోవుల వారింపనలవిగాక దిగ్గన నలుకతోడి సిగ్గు లగ్గలంబుగ దుర్గమ మార్గంబున వానివెంట నంటి వచ్చి లేఁగల మేపుచున్న కొడుకులం గని.**

టీక:- అంతన్ = అప్పుడు; గోపకులు = గోపాలకులు; గోవులన్ = ఆవులను; వారింపన్ = ఆపుటకు; అలవి = శక్యము; కాక = కాకుండుటచే; దిగ్గనన్ = శీఘ్రముగా; అలుక = కోపము; తోడి = తోగూడిన; సిగ్గులు = లజ్జలు; అగ్గలంబుగన్ = అతిశయించగా; దుర్గమ = అతికష్టమైన; మార్గంబున = దార్లమ్మట; వాని = వాటి; వెంటనంటి = కూడాపడి; వచ్చి = వచ్చి; లేగలన్ = దూడలను; మేపుచున్న = కాచుచున్న; కొడుకులన్ = బిడ్డలను; కని = చూసి.

భావము:- ఇంతవరకూ తమ మాటలను ఆవులు ధిక్కరించేవి కాదు. అలాంటిది అలా వచ్చిన ఆవులను ఆపుచేయడం, గోపకులకు సాధ్యం కాలేదు. వారికి కోపంతోపాటు సిగ్గు కూడా కలిగింది. వాటి వెనుకనే తుప్పల వెంట బండల పైనుంచి పరిగెత్తుకుంటూ వచ్చారు. లేగలను మేపుతున్న తమ బిడ్డలను చూసారు. మమతలతో వారు కోపాలు సిగ్గులు అన్నీ మరచిపోయారు.

10.1-525-ఉ.

**అయ్యలఁ గంటిమంచుఁ బులకాంకురముల్ పెలయంగఁ గుఱ్ఱలం**
**జయ్యన డాసి యెత్తికొని సంతస మందుచుఁ గౌగలింపఁ దా**
**రయ్యెడ నౌదలల్ మనము లారఁగ మూర్కొని ముద్దు చేయుచున్**
**దయ్య మెఱుంగు; గోపకులు దద్దయు నుబ్బిరి నిబ్బరంబుగన్.**

టీక:- అయ్యలన్ = మాతండ్రులను; కంటిమి = చూసితిమి; అంచున్ = అనుచు; పులకాంకురములు = గగుర్పాటులు; పెలయంగన్ = ప్రసిద్ధముగ కలుగగా; కుఱ్ఱలన్ = బిడ్డలను; చయ్యన = గబుక్కున; డాసి = చేరి; ఎత్తికొని = ఎత్తుకొని; సంతసమున్ = సంతోష; అందుచున్ = పడుతు; కౌగలింపన్ = ఆలింగనములు చేయుచు; తారు = వారు; ఆ = ఆ; ఎడన్ = సమయము నందు; ఔదలల్ =మాడులను, నడినెత్తిలను; మనములారగ= మనస్ఫూర్తిగా; మూర్కొని = మూజూసి, ముద్దిడి; ముద్దు = గారాబములు; చేయుచున్ = చేయుచు; దయ్యము =దేవుడే; ఎఱుంగు = తెలియు; గోపకులు = పశువుల పాలించువారు; తద్దయున్ = మిక్కిలిగా; ఉబ్బిరి = పొంగిపోయిరి; నిబ్బరంబు గన్ = స్థిరముగా.

భావము:- “మా చిన్ని అయ్యలను చూడగలిగాము” అంటూ బిడ్డల వద్దకు చేరి వారిని ఎత్తుకున్నారు. ఒడలంతా పులకలెత్తుతుండగా సంతోషంతో కౌగలించుకుని తలలను మూర్కొని ముద్దులు చేసారు. బిడ్డలలో ఉన్న దైవాన్ని తెలుసుకున్నారా అన్నట్లు ఎంతో సంతోషంతో పొంగిపోయారు.

10.1-526-వ.

**ఇట్లు బాలకాలింగనంబుల నానందబాష్పపూరితనయనులై**
**గోపకులు గోవుల మరలించుకొని తలంగిచన వారలం జూచి**
**బలభద్రుండు తనలోఁ నిట్లని తలంచె**

టీక:- ఇట్లు = ఇలా; బాలక = బిడ్డలను; ఆలింగనంబులన్ = కౌగలింతలవలన; ఆనంద = సంతోషపు; బాష్ప = కన్నీళ్ళతో; పూరిత = నిండిన; నయనలు = కన్నులు కలవారు; ఐ = అయ్యి; గోపకులు = గోవులను పాలించెడివారు; గోవులన్ = ఆవులను; మరలించుకొని = మళ్ళించుకొని; తలంగి = తొలగి; చనన్ = పోగా; వారలన్ = వారిని; చూచి = చూసి; బలభద్రుండు = బలరాముడు; తనలోన్ = తన మనసు నందు; ఇట్లు = ఈ విధముగ; అని = అని; తలంచె = అనుకొనెను.

భావము:- ఈ విధంగా కుమారులను కౌగలించుకోవడంతో కలిగిన ఆనందబాష్పాలతో నిండిన కన్నులతో గోపకులు కుమారులను వదలిపెట్టి గోవులను మళ్ళించుకుని దూరంగా వెళ్ళిపోయారు. వారిని చూసి బలరాముడు ఇలా అనుకున్నాడు.

## బలరాము డన్న రూపెరుగుట

10.1-527-సీ.

"చన్ను మానిన యట్టి శాబకశ్రేణిపై-
గోగణంబులకును గోపకులకు
నిబ్బంగి వాత్సల్య మెబ్బంగి నుదయించె?-
హరిఁ దొల్లి మన్నించునట్లు వీరు
మన్నించు చున్నారు మమతఁ జేయుచుఁ బ్రీతి-
నంబుజాక్షునిఁ గన్న యట్లు నాకుఁ
బ్రేమయయ్యెడి, డింభబృందంబుఁ గనుఁగొన్న-
నిది మహాద్భుత మెందు నెఱుఁగరాదు

10.1-527.1-తే.

**మనుజ దైవత దానవ మాయ యొక్కొ?**

**కాక నా భర్త యగుచున్న కమలనయను**

**మాయయో గాక యితరులమాయ నన్నుఁ**

**గలఁప నోపదు; విభుమాయ కాఁగ నోపు."**

టీక:- చన్నున్ = స్తన్యపానమును; మానిన = విడిచిపెట్టిన; అట్టి = అటువంటి; శాబక = పిల్లల, సంతానము; శ్రేణి = సమూహముల; పై = మీద; గో = ఆవుల; గణంబుల్ = సమూహముల; కును = కు; గోపకుల్ = యాదవుల; కున్ = కు; ఈ = ఈ; భంగిన్ = లాంటి; వాత్సల్యము = ప్రేమ; ఏ = ఏ; భంగిన్ = విధముగా; ఉదయించెన్ = కలిగెను; హరిన్ = కృష్ణుని; తొల్లి = ఇంతకు ముందు; మన్నించునట్లు = గౌరవించునట్లు; వీరు = వీరు; మన్నించుచున్నారు = గౌరవించుచున్నారు; మమతన్ = ప్రేమ; చేయుచున్ = చూపుతు; ప్రీతిన్ = ఇష్టపూర్తిగా; అంబుజాక్షునిన్ = శ్రీకృష్ణుని; కన్న = చూసిన; అట్లు = ఆ విధముగా; నా = నా; కున్ = కును; ప్రేమము = మమత; అయ్యెడిన్ = కలుగుచున్నది; డింభ = బాలుర; బృందంబున్ = సమూహములను; కనుగొన్నన్ = చూసిన యెడల; ఇది = ఈ విషయము; మహా = గొప్ప; అద్భుతము = అబ్బురము; ఎందున్ = ఏవిధముగనో; ఎఱుంగరాదు = అర్థముగాదు.

మనుజ = మానవులు; దైవత = దేవతలు; దానవ = రాక్షసులు; మాయ = పన్నినమాయ; ఒక్కొ = ఏమో; కాక = అదికానిపక్షమున; నా = నాయొక్క; భర్త = ప్రభువు; అగుచున్న = అయినట్టి; కమలనయను = కృష్ణుని; మాయయో = మాయ యేమో; కాక = అదికాకపోయినచో; ఇతరుల; మాయ = మాయ; నన్నున్ = నన్ను; కలపన్ = కలతచెందించను; ఓపదు = సాధ్యముగాదు; విభు = (నా) ప్రభువు; మాయ = మాయ; కాగన్ = అయితే; ఓపున్ = అయ్యుండవచ్చు.

భావము:- "తల్లిపాలు విడిచిన వయస్సులో ఉన్న బిడ్డల మీదా దూడల మీదా గోపకులకు ఆవులకు ఇంత అధికంగా వాత్సల్యం ఎలా పుట్టుకు వచ్చింది; వీరు ఇదివరకు కృష్ణుని ఎడల మమకారంతో ఎంత ప్రేమ చూపేవారో, ఇప్పుడు తమ బిడ్డలపైన ఆ విధమైన ప్రేమ చూపుతున్నారు. నాకు కూడ ఈ బిడ్డలను లేగలను చూస్తుంటే కృష్ణుని చూసినట్లే ప్రేమా, ఇష్టాలు కలుగుతున్నాయి. ఇది ఏమిటో మహా అద్భుతంగా ఉంది. ఇంతకు ముందు ఇలా ఎన్నడూ ఎరుగను. మానవులు గానీ దానవులు దేవతలు కానీ చేసిన మాయ కాదు కదా. లేక నా స్వామి అయిన విష్ణుమూర్తియొక్క మాయ యేమో. నా స్వామి మాయే అయి ఉంటుంది."

10.1-528-క.

**అని మున్ను ముగ్ధుఁ డయ్యును**

**దన యందుల దివ్యదృష్టిఁ దప్పక బుద్ధిన్**

**దన చెలికాండ్రను గ్రేపుల**

**వనజాక్షుం డనుచుఁ జూచె వసుధాధీశా!**

టీక:- అని = అని; మున్ను = ముందు; ముగ్ధుడు = పరవశుడు; అయ్యును = అయినప్పటికిని; తన = అతని; అందులన్ = లోని; దివ్యదృష్టిన్ = దివ్యదృష్టితో; తప్పక = సరిగా; బుద్ధిన్ = మనసు నందు; తన = తనయొక్క; చెలికాండ్రను = స్నేహితులను; క్రేపులన్ = దూడలను; వనజాక్షుండ = కృష్ణుడే {వనజాక్షుడు - పద్మాక్షుడు, కృష్ణుడు}; అనుచున్ = అనుచు; చూచెన్ = గ్రహించెను; వసుధాధీశ = రాజా {వసుధాధీశుడు - వసుధ (భూమి)కి అధీశుడు (ప్రభువు), రాజు}.

భావము:- బలరాముడు ఇలా ఆలోచించి ఇంతవరకూ మోహంచెంది ఉన్నప్పటికీ, ఇప్పుడు దివ్యదృష్టితో శ్రద్ధగా చూసాడు. తన స్నేహితులు లేగదూడలు అన్నీ కృష్ణుడే అని గ్రహించాడు.

10.1-529-వ.

**ఇట్లు విజ్ఞాన దృష్టిం జూచి యెఱింగియు నమ్మక బలదేవుండు గొందలపడుచుఁ గృష్ణుంజూచి "మహాత్మా! తొల్లి యెల్ల క్రేపులును ఋషులయంశంబనియును గోపాలకులు వేల్పుల యంశంబనియును దోఁచుచుండు; నిపుడు వత్సబాలక సందోహంబు సందేహంబు లేక నీవయని తోఁచుచున్నది; యిది యేమి?" యని యడిగిన యన్నకు నున్నరూపంబు వెన్నుండు మన్ననఁ జేసి క్రన్నన నెఱింగించె నతండు నెఱింగె; యివ్విధంబున హరి బాల వత్సంబులు దానయ్యె సంచరించిన యేఁడు విరించికిఁ దనమానంబున నొక్క త్రుటిమాత్రం బైన విరించి చనుదెంచి వత్సబాలకాకారుండైన కృష్ణబాలకుం జూచి వెఱంగు పడి యిట్లని వితర్కించె.**

టీక:- ఇట్లు = ఇలా; విజ్ఞానదృష్టిన్ = దివ్యదృష్టితో; చూచి = గ్రహించి; ఎఱింగియు = తెలుసు కొనియు; నమ్మక = నిశ్చయించుకొనలేక; బలదేవుండున్ =బలరాముడు; కొందలపడుచున్ =కంగారుపడుతు; కృష్ణున్ = శ్రీకృష్ణుని; చూచి = ఉద్దేశించి; మహాత్మా = మహానుభావుడా; తొల్లి = ఇంతకుముందు; ఎల్ల = అన్ని; క్రేపులున్ = దూడలు; ఋషుల = మునుల; అంశంబులు = అంశతో బుట్టినవారు; అనియును = అని; గోపాలకులు = యాదవులు; వేల్పుల = దేవతల; అంశంబు = అంశతో బుట్టినవారు; అనియును = అని; తోచు

చుండున్ = అనిపించెడిది; ఇపుడు = ఇప్పుడు; వత్స = దూడలు; బాలక = పిల్లల; సందోహంబున్ = సమూహము; సందేహంబు = అనుమానము; లేక = లేకుండగ; నీవ = నీవే; అని = అని; తోచుచున్నది = తెలియుచున్నది; ఇదియేమి = ఇదేమిటి; అని = అని; అడిగిన = ప్రశ్నించిన; అన్న = అన్న; కున్ = కి; ఉన్నరూపంబు = వాస్తవమును; వెన్నుండు = విష్ణువు; మన్నన = మన్నించుట; చేసి = చేసి; క్రన్నన = వెంటనే; ఎఱింగించెన్ = తెలిపెను; అతండున్ = అతను; ఎఱింగెన్ = తెలుసుకొనెను; ఈ = ఈ; విధంబునన్ = లాగున; హరి = కృష్ణుడు; బాల = పిల్లలు; వత్సంబులున్ = దూడలు; తాన = తనే; ఐ = అయ్యి; సంచరించిన = మెలగిన; ఏడు = సంవత్సరము; విరించి = బ్రహ్మదేవుని; కిన్ = కి; తన = అతని; మానంబునన్ = కాలమానము ప్రకారము; ఒక్క = ఒకే ఒక; త్రుటి = చాలాకొద్దిసమయము {త్రుటి –సుమారు 0.39 మిల్లిసెకన్లు}; మాత్రంబు = మాత్రమే; ఐనన్ = కాగా; విరించి = బ్రహ్మదేవుడు; చనుదెంచి = వచ్చి; వత్సబాలక = దూడల, మేపు పిల్లవారి; ఆకారుండు = ఆకారము గలవాడు; ఐన = అయినట్టి; కృష్ణబాలకున్ = బాలకృష్ణుని; చూచి = కనుగొని; వెఱంగుపడి = ఆశ్చర్యపోయి; ఇట్లు; అని = అని; వితర్కించెన్ = ఆలోచించుకొనెను.

భావము:– ఇలా యోగదృష్టితో చూసినప్పటికీ బలరాముడు నమ్మలేక కంగారుపడ్డాడు. కృష్ణుని ఇలా అడిగాడు. “మహాత్మా! ఇంతకు ముందు వరకూ లేగదూడలన్నీ ఋషుల అంశలతో జన్మించినవి అనీ, గోపాలకులు అందరూ దేవతల అంశలు అనీ నాకు అనిపిస్తూ ఉండేది. ఇప్పుడు చూస్తే లేగలూ బాలకులూ అందరూ నిస్సందేహంగా నీవే అని నాకు అనిపిస్తున్నది, కనిపిస్తున్నది ఈ వింత ఏమిటి” ఇలా అడగ్గానే కృష్ణుడు అన్నగారి యెడల అనుగ్రహంతో ఉన్న రహస్యం విప్పి చెప్పాడు. బలరాముడు గ్రహించాడు. ఈవిధంగా శ్రీహరి బాలురు లేగలు తానే అయి చరించినది ఒక ఏడాది. ఆ కాలం బ్రహ్మదేవునికి తన కాలమానం ప్రకారం ఒక్క తృటి కాలంగా

కనిపించింది. అతడు వచ్చి దూడల రూపంలోనూ, బాలకుల రూపంలోనూ కనిపిస్తున్న బాలకృష్ణుని చూసి నిర్ఘాంతపోయి ఇలా ఆలోచించుకున్నాడు.

## బ్రహ్మ తర్కించుకొనుట

10.1-530-శా.

**“మందం గల్గిన వత్సబాలకులు నా మాయా గుహాసుప్తులై**
**యెందుం బోవరు; లేవ రిప్పుడును; వేఱొ చేయ నా కన్యు లొం**
**డెందున్ లేరు; విధాతలుం బరులు; వీ రెవ్వార లెట్లైరొకో?**
**యెం దేతెంచిరొ కృష్ణుతో మెలఁగువా? రేఁడయ్యెడిన్ నేఁటికిన్.**

టీక:- మందన్ = గుంపుగా; కల్గిన = ఉన్నట్టి; వత్స = దూడలు; బాలకులు = పిల్లలు; నా = నాయొక్క; మాయా = మాయ అనెడి; గుహా = గుహ యందుల; సుప్తులు = మునిగినవారు; ఐ = అయ్యి; ఎందున్ = ఎక్కడికిని; పోవరు = వెళ్ళలేరు; లేవరు = మేలుకొనలేరు; ఇప్పుడును = ఇప్పటికి కూడ; వేఱొ = ఇంకొకలా; చేయన్ = చేయుటకు; నా = నా; కున్ = కు; అన్యులు = సాటివారు; ఒండు = ఇంకొకరు; ఎందున్ = ఎక్కడను; లేరు = లేరు; విధాతలున్ = సృష్టికర్తలు; పరులు = అన్యులు; వీరు = వీరు; ఎవ్వారు = ఎవరు; ఎట్లు = ఎలా; ఐరి = కలిగిరో, పుట్టిరో; ఒకో = ఏమో; ఎందున్ = ఎక్కడనుండి; ఏతెంచిరో = వచ్చితిరో ఏమో; కృష్ణు = కృష్ణుని; తోన్ = తోపాటు; మెలగు = వర్తించెడి; వారు = వాళ్ళు; ఏడయ్యెడిన్ = ఎలా కలిగారు, ఏడాది అయిపోయింది; నేటికిన్ = ఇవాళ్టికి.

భావము:- ఈ గోకులంలో ఉండే బాలకులు దూడలూ అందరూ నా మాయా గుహలో ఇప్పటికీ అక్కడే నిద్రపోతున్నారు. ఎక్కడకీ పోలేదు. మళ్లీ ఎవరైనా సృష్టి చేసారు అనుకుందాం అంటే; నేను తప్ప సృష్టికర్తలు అయిన

బ్రహ్మలు ఇంక ఎవరూ లేరు కదా. మరి వీరెవరు? ఎలా వచ్చారో? నేటికి భూలోకంలో ఏడాది గడిచింది. మరి ఈ కృష్ణుడితో విహరిస్తున్న వీళ్ళంతా ఎక్కడ నుంచి వచ్చారో?

10.1-531-మత్త.

బ్రహ్మపంపునఁ గాని పుట్టదు ప్రాణిసంతతి యెప్పుడున్
బ్రహ్మ నొక్కఁడ గాని వేఱొక బ్రహ్మ లేఁడు సృజింపఁగా
బ్రహ్మ నేను సృజింప నొండొక బాలవత్సకదంబ మే
బ్రహ్మమందు జనించె? నొక్కట బ్రహ్మమౌ నది చూడఁగాన్."

టీక:- బ్రహ్మ = బ్రహ్మదేవుని; పంపునన్ = అనుజ్ఞ ప్రకారము; కాని = తప్పించి; పుట్టదు = జనించదు; ప్రాణి = జీవ; సంతతి = జాలము; ఎప్పుడును = ఏ కాలము నందు; బ్రహ్మన్ = సృష్టికర్తను; ఒక్కడన్ = నే నొక్కడనే; కాని = తప్పించి; వేఱొక = మరొక; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; లేడు = లేడు; సృజింపగాన్ = సృష్టించుటకు; బ్రహ్మన్ = బ్రహ్మదేవుడను; నేను = నేను; సృజింపన్ = సృష్టిస్తుండగా; ఒండొక = మరింకొక, ప్రతిసృష్టి; బాల = పిల్లల; వత్స = దూడల; కదంబము = సమూహము; ఏ = ఏయొక్క; బ్రహ్మ = బ్రహ్మదేవుని; అందున్ = వలన; జనించెన్ = పుట్టెను; ఒక్కటన్ = ఏక కాలమున; బహ్మము = మహాద్భుతము; ఔన్ = అయి ఉన్నది; అది = అది; చూడగాన్ = తరచి చూసినచో.

భావము:- బ్రహ్మదేవుడు సృష్టిస్తే గాని ఈ జీవరాసు లేవీ పుట్టవు కదా. సృష్టి చేసే బ్రహ్మదేవుడు అంటే నేనొక్కడినే గాని మరింకొకడు లేడు కదా. బ్రహ్మదేవుడుగా నేను సృష్టించిన గొల్లపిల్లలు దూడలు కాక వేరేవి ఎలా వచ్చాయి? వీటిని ఏ బ్రహ్మదేవుడు సృష్టించాడు? అందరిలోనూ ఒక్కటిగా ఉండే పరబ్రహ్మ కాదు కదా వీటి సృష్టికర్త?"

10.1-532-వ.

**అని యిట్లు సకలంబును సుకరంబుగ నెఱింగెడి నెఱవాది ముదుక యెఱుకగలప్రోడ వెఱంగుపడి గ్రద్దనఁ బెద్దప్రొద్దు తద్దయుం దలపోసి కర్జంబు మందల యెఱుంగక కొందల పడుచు నాందోళనంబున.**

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; సకలంబును = సమస్తమును; సుకరంబుగన్ = సులువుగా, తేలికగా; ఎఱింగెడి = తెలిసికొనగల; నెఱవాది = చతురుడు; ముదుక = పరిణతి చెందినవాడు; ఎఱుక = జ్ఞానము; కల = కలిగిన; ప్రోడ = వివేకి, నేర్పరి; వెఱంగుపడి = ఆశ్చర్యపోయి; గ్రద్దన = శీఘ్రముగా; పెద్ద = చాలా; ప్రొద్దు = సేపు; తద్దయున్ = మిక్కిలిగా; తలపోసి = ఆలోచించి; కర్జంబు = చేయవలసిన పని; మందలన్ = మేరలను; ఎఱుంగక = తెలిసికొనలేక; కొందలపడుచున్ = కంగారుపడుతు; ఆందోళనంబునన్ = చలించిన మనసుతో;

భావము:- ఇలా ఈ గొల్లపిల్లలు దూడలు గురించి అలోచించు కుంటూ, సర్వస్వాన్ని తేలికగా తెలుసుకోవడంలో నేర్పరి అయిన ఆ పితామహుడు, ఆ జ్ఞానవృద్ధుడు, ఆ బ్రహ్మదేవుడు నివ్వెరపోయాడు. కంగారుపడి తనలోతాను అలోచించుకున్నా ఏం చేయాలో తెలియ లేదు. బిక్కమొగం వేసి, ఆందోళన పడసాగాడు.

10.1-533-క.

**మోహము లేక జగంబుల**
**మోహింపఁగఁ జేయ నేర్చి మొనసిన విష్ణున్**
**మోహింపించెద ననియెడు**
**మోహమున విధాత తాన మోహితుఁ డయ్యెన్.**

<u>టీక:-</u> మోహము = భ్రమపడుటన్నది; లేక = లేకుండ; జగంబులన్ = లోకములను; మోహింపగన్ = మాయలో పడునట్లు; చేయన్ = చేయుటను; నేర్చిన = తెలిసినవాడై; మొనసిన = అతిశయించిన; విష్ణున్ = శ్రీమహావిష్ణువును; మోహింపించెదన్ = మోసముచేసెదను; అనియెడు= అనెడి; మోహమున = అజ్ఞానముచేత; విధాత = బ్రహ్మదేవుడు; తాన = అతనే; మోహితుడు = మోసపోయినవాడు; అయ్యెన్ = అయిపోయెను.

<u>భావము:-</u> శ్రీహరి మోహం అంటని వాడు. కానీ తాను సర్వ జగత్తులను మోహింపచేయ గల నేర్పరి. అటువంటి విష్ణువునే మోహింప చేద్దాం అనుకొని మోహపడిన బ్రహ్మదేవుడు తానే మోహంలో పడ్డవాడు అయిపోయాడు.

10.1-534-తే.

**<u>ప</u>గలు ఖద్యోతరుచి చెడు<u>ప</u>గిది రాత్రి**
**<u>మం</u>చు చీఁకటి లీనమై <u>మా</u>యుమాడ్కి**
**<u>వి</u>ష్ణుపై నన్యమాయలు <u>వి</u>శద మగునె?**
**<u>చె</u>డి నిజేశుల గరిమంబుఁ <u>జె</u>ఱుచుఁ గాక.**

<u>టీక:-</u> పగలు = సూర్యుడు ఉండు నప్పుడు; ఖద్యోత = మిణుగురు పురుగుల; రుచి = కాంతి; చెడు = అణగిపోవు; పగిదిన్ = విధముగ; రాత్రి = రాత్రికాలము నందు; మంచు = మంచుతెరలు; చీకటిన్ = చీకట్లో; లీనము = కలిసిపోయినవి; ఐ = అయ్యి; మాయు = మాయ మగు; మాడ్కిన్ = విధముగ; విష్ణు = విష్ణుమూర్తి; పైన్ = మీద; అన్య = ఇతరుల; మాయలు = మాయలు; విశదమగునె = స్పష్టమగునా, పనిచేయునా, చేయవు; చెడి = నశించి; నిజ = తమని; ఈశులన్ = ప్రయోగించిన వారల; గరిమంబున్ = యశస్సును, గొప్పదనం; చెఱుచున్ = పాడుచేయును; కాక = తప్పించి.

భావము:- పగటివేళ సూర్యుడి ముందు మిణుగురు పురుగుల కాంతి తేలిపోతుంది. రాత్రివేళ మంచు చీకటిలో లీనమై మాయమై పోతుంది. అలాగే మాయకే పుట్టినిల్లు అయిన విష్ణుమూర్తి మీద ఇతరుల మాయలు పనిచేస్తాయా? ఆ మాయలు సర్వం వస చెడి విడిపోతాయి. తమను ప్రయోగించిన వారి గౌరవాన్ని కూడా చెడగొట్టేస్తాయి తప్ప.

10.1-535-వ.

**మఱియును.**

టీక:- మఱియును = ఇంకను. భావము:- అంతట...

10.1-536-క. *

**"పుట్టితి; బుద్ధి యెఱింగితిఁ;**

**బుట్టించితి జగము; సగము పోయెను బ్రాయం;**

**బిట్టివి నూతన సృష్టులు**

**పుట్టుట లే; దౌర! యిట్టి బూమెలు భూమిన్."**

టీక:- పుట్టితిన్ = జన్మించితిని; బుద్ధి = వివేకమును, జ్ఞానము; ఎఱింగితి = తెలుసుకొంటి; పుట్టించితిన్ = సృష్టించితిని; జగమున్ = లోకములను; సగము = అర్ధభాగము; పోయెను = గడచి పోయినది; ప్రాయంబు = వయసు; ఇట్టివి = ఇలాంటి; నూతన = సరికొత్త; సృష్టులు = సృష్టింపబడు టలు; పుట్టుట = కలుగుట; లేదు = జరుగలేదు; ఔరా = అయ్యో; ఇట్టి = ఇలాంటి; బూమెలు = మాయలు; భూమిన్ = భూలోకమున.

భావము:- "ఏనాడో పుట్టాను. పుట్టిన తరువాత బుద్ధి తెలిసింది ఈ జగత్తు అంతటినీ పుట్టించాను. వయస్సు సగం గడచిపోయింది. ఇంతవరకూ ఇలా క్రొత్త సృష్టులు పుట్టడం ఎప్పుడూ ఎరుగను. ఔరా! నేను పుట్టించిన ఈ భూమి మీద నాకు అందని ఇన్ని మాయలా?"

10.1-537-వ.

అని యిట్లు తలవాకిట వాణి గల పోఁడిమిచే వాఁడిమి కెక్కిన నలుమొగం బుల తక్కరిగొంటు పెనుదంట పలుపెంటలైన తన మనంబున వితర్కించి, విచారించు నెడ, నతండు కను గొనుచుండ నబ్బాలకులు మేఘశ్యాములును, హార కుండల కిరీట వనమాలికాభిరాములును, శ్రీవత్స మంగళాంగద నూపుర కనక కటక కంకణ కటిఘటిత కాంచీగుణోద్దాము లును, నాపాదమస్తక తులసీదళదాములును, విలస దంగుళీ యకస్తోములును, శంఖ చక్ర గదా కమల హస్తులును, జతు ర్భుజప్రశస్తులును పీతకౌశేయవాసులును, చంద్రికా ధవళహాసు లును, కరుణాకటాక్షవీక్షణ విలాసులును, రవికోటిభాసులును, ననంత సచ్చిదానందరూప మహితులును, యణిమాదిగుణోపే తులును, విజాతీయభేదరహితులును, శ్రీమన్నారాయణ ప్రతి మాన విగ్రహస్వరూపులునై తమకుఁ బరతంత్రులగుచు నృత్త గీతాది సేవావిశేషంబులకుం జొచ్చి మెలంగుచు మూర్తి మంతంబు లయిన బ్రహ్మాదిచరాచరంబులును, నణిమాదిసిద్ధు లును, మాయాప్రముఖంబులయిన శక్తులును, మహదాది చతు ర్వింశతి తత్వంబులును, గుణక్షోభకాలపరిణామ హేతు సంస్కారకామ కర్మగుణంబు లును సేవింప వేదాంతవిదుల

**కయిన సెఱుంగరాని తెఱంగున మెఱయుచుఁ గానబడిన వారలం గనుంగొని.**

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; తలవాకిట = నోటియందు {తలవాకిలి – తల (ముఖము)నకు వాకిలి (ముందుగుమ్మము), నోరు}; వాణి = సరస్వతీదేవి; కల = కలిగిన; పోడిమి = చక్కదనమున; చేన్ = వలన; వాడిమికెక్కిన = ప్రసిద్ధినొందిన; నలుమొగముల = చతుర్ముఖముల; తక్కరి = టక్కరి; గొంటు =దిట్ట; పెను = గొప్ప; తంట = మాయగాడు; పలుపెంటలు = చెదిరినది; ఐన = అయినట్టి; తన = తనయొక్క; మనంబునన్ = మనసు నందు; వితర్కించి = తరచిచూసుకొని; విచారించున్ = ఆలోచించుకొనెడి; ఎడన్ = సమయము నందు; అతండు = అతను; కనుగొను చుండన్ = చూస్తుండగానే; ఆ = ఆయొక్క; బాలకులు = పిల్లలు; మేఘ = మేఘములవలె; శ్యాములును = నల్లనివారు; హార = మెడలో హారములు; కుండల = చెవి కుండలములు; కిరీట = కిరీటములు; వనమాలికా = పూల ఆకులు కల మాలలచే; అభిరాములును = మనోజ్ఞమైనవారు; శ్రీవత్స = శ్రీవత్స మనెడి మచ్చలతో; మంగళ = శుభప్రదమైన; అంగద = భుజకీర్తులు; నూపుర = కాలిఅందెలు; కనక = బంగారపు; కటక = కడియములు, గాజులు; కంకణ = మురుగులు; కటి = మొలకు; ఘటిత = కట్టిన; కాంచీగణ = మొలనూలుల చేతను; ఉద్దాములునున్ = అధికులు; ఆపాదమస్తక = తలనుండి పాదాలవరకు గల; తులసీదళ = తులసీదళములు కూర్చిన; దాములును = దండలు కలవారు; విలసత్ = మెరిసిపోతున్న; అంగుళీయక = ఉంగరముల; స్తోములును = సమూహము కలవారు; శంఖ = శంఖము; చక్ర = చక్రము; గదా = గద; కమల = కమలపువ్వు; హస్తులును = చేతు లందు కల వారును; చతుః = నాలుగు; భుజ = చేతులతో; ప్రశస్తులును = ప్రసిద్ధినొందిన వారును; పీత = పచ్చని; కౌశేయ వాసులును = పట్టుబట్టలు ధరించినవారు; చంద్రికా = వెన్నెలవంటి; ధవళ =

స్వచ్ఛమైన; హాసులును = నవ్వులు కలవారు; కరుణా = కృపాతోకూడిన; కటాక్ష = కడకంటి; వీక్షణ = చూపులతో; విలాసులును = విలసిల్లువారు; రవికోటి = కోటిసూర్యుల; భాసులునున్ = తేజస్సు కలవారు; అనంత = శాశ్వతమైన {అనంతము - దేశ కాల వస్తువులచేత భాగింపరానిది}; సచ్చిదానంద = సచ్చిదానం దము యొక్క {సత్ - అవస్థాత్రయమున (జాగ్రత్స్వప్న సుషుప్తులందు) చెడని}; రూప = స్వరూపముతో {చిత్ - తత్త్వజ్ఞానపరితమైన}; మహితులును = గొప్పవారు; అణిమాదిగుణ = అష్టవిభూతులతో {అణిమాది, అష్టవిభూతులు, అష్టైశ్వర్యములు - 1అణిమ 2మహిమ 3గరిమ 4లఘిమ 5ప్రాప్తి 6 ప్రాకామ్యము 7ఈశత్వము 8వశిత్వము }; ఉపేతులును = కూడిన వారు; విజాతీయ = ఇతరజాతి; భేద = తేడాలు; రహితులును = లేనివారు; శ్రీమన్నారాయణ = శ్రీమహావిష్ణువుతో; ప్రతిమాన = సమానమైన; విగ్రహ = ఆకృతే; స్వ = తమ; రూపులున్ = ఆకృతికా కలవారు; ఐ = అయ్యి; తమ = వారల; కున్ = కు; పరతంత్రులు = పరవశము పొందినవారు; అగుచు = ఔతూ; నృత్త = నాట్యము లాడుట; గీత = పాటలు పాడుట; ఆది = మున్నగు; సేవా = కొలుచుట యందలి; విశేషంబులు = విశిష్టతలు; కున్ = అందు; ఛొచ్చి = లగ్నమై; మెలంగుచున్ = వర్తించుచు; మూర్తిమంతంబులు = ఆకృతి వహించినవి; అయిన = ఐన; బ్రహ్మ = బ్రహ్మదేవునితో; ఆది = మొదలుపెట్టి; చర = చరించ గలిగిన జీవులు; అచరంబులున్ = చరించ లేని జీవులు; అణిమాదిసిద్ధులును = అష్టైశ్వర్యములు; మాయా = పరాశక్తి {మయాదిశక్తులు - 1పరాశక్తి 2ఆదిశక్తి 3జ్ఞానశక్తి 4ఇచ్ఛాశక్తి 5క్రియాశక్తి, పంచవిధశక్తులు}; ప్రముఖంబులు = మున్నగునవి; అయిన = ఐన; శక్తులును = శక్తులు; మహత్ = మహత్తు, అవ్యక్తము; ఆది = మొదలైన; చతుర్వింశతి = ఇరవైనాలుగు (24) {చతుర్వింశతి తత్త్వముల టిప్పణికి }; తత్త్వంబులును = తత్త్వములు; గుణక్షోభ = అవ్యక్తచలనస్థితి {గుణక్షోభము - స్వభావముయొక్క కలతపాటు, త్రిగుణ

సమతావస్థ యైన అవ్యక్త చలన స్థితి}; కాల = ప్రజ్ఞాచైతన్యస్థితి {గుణక్షోభము – స్వభావముయొక్క కలతపాటు, త్రిగుణసమతావస్థ యైన అవ్యక్త చలన స్థితి}; పరిణామ = పరిణామస్థితి {పరిణామ – కాలస్థితి మాఱి ప్రపంచ వృత్తితో కూడి అహంకార రూపముగా పరిణమించునట్టి స్థితి}; హేతు = పంచభూతస్థితి {హేతు – ఆ అహంకార వృత్తియే జననకారణముగా గల అపంచీకృత పంచ మహాభూత రూపముగా నుండుట}; సంస్కార = విషయస్థితి {సంస్కార – ఆ పంచభూతముల విషయములైన శబ్ద స్పర్శాదులుగా నుండుట}; కామ = అభిలాషస్థితి {కామ – ఆ శబ్దాదు లందు గల రాగద్వేష రూపములైన అభిలాషలు కలిగి ఉండుట}; కర్మ = నడవడి {కర్మ – ఆ అభిలాషలకు తగిన నడవడులు}; గుణంబులు = స్వభావస్థితి {గుణంబులు – ఆ నడవడులకు తగిన స్వభావములు కలిగి ఉండుట}; సేవింపన్ = కొలచుచుండగా; వేదాంతవిదులు = బ్రహ్మజ్ఞానులు {వేదవిదులు – వేదాం తార్థములు తెలిసిన బ్రహ్మవేత్తలు}; కైనన్ = కి అయినను; ఎఱుంగరాని = తెలియబడని; తెఱంగున = విధముగ; మెఱయుచున్ = ప్రకాశించుచు; కానబడిన = కనపడుతున్న; వారలన్ = వారిని; కనుంగొని = చూసి.

భావము:- అని బ్రహ్మదేవుడు ఆశ్చర్యపోయాడు. అతను తన తలవాకిట సరస్వతి ఉన్నదనే అభిమానం వలన కొంత గర్వపడుతూండే వాడు. నాలుగు మొగాలున్న ఆ మహా మాయగాడు జంకి వెనుకకు తగ్గుతూ, తన మనస్సులో ఎన్నోరకాలుగా ఆలోచించి చూసాడు. ఒకసారి బాలుర వంక చూసాడు. అందరూ మేఘశ్యామల మూర్తులూ, హారాలు కుండలాలు కిరీటాలు వైజయంతీ మాలికలూ ధరించి చాలా అందంగా ఉన్నారు; వక్షస్థలం పైన శ్రీవత్సం అనే పుట్టుమచ్చ, శుభకరాలైన బాహుపురుషులు, కాలిగజ్జెలు, బంగారు కడియాలు, నడుములకు కాంచీకలాపాలతో కనిపిస్తూ బ్రహ్మదేవుడిని బెదరగొట్టారు; పాదాలనుండి శిరస్సులవరకూ తులసీ దళాల మాలలు ధరించారు; వ్రేళ్ళకు

రవ్వల ఉంగరాలు మెరుస్తున్నాయి; అందరికీ నాలుగేసి బాహువులు ఉన్నాయి; నాలుగు చేతులలో శంఖం, గద, చక్రం, పద్మం ధరించి ఉన్నారు; బంగారు పట్టువస్త్రాలు ధరించి ఉన్నారు; వెన్నెలవంటి చల్లని తెల్లని చిరునవ్వులు వెదజల్లుతున్నారు; కన్నుల నుండి కరుణాకటాక్షాలు వెలువడుతున్నాయి; కోటిసూర్యుల కాంతితో వెలిగిపోతున్నారు; సచ్ చిత్ ఆనందాలు తామే అయిన అనంత రూపాలతో విలసిల్లుతున్నారు; అణిమ, గరిమ, మహిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అనబడే ఎనిమిది అష్టసిద్ధుల గుణాలూ తమలోనే ధరించి ఉన్నారు; అందరూ అంతర్యామి స్వరూపులే కనుక, ఇది పరాయిదనే భేదం వారికిలేదు; లక్ష్మీదేవితోకూడిన నారాయణుని ప్రతిబింబాలైన రూపాలతో విలసిల్లుతున్నారు; సృష్టిలో ఉన్న బ్రహ్మ దగ్గర నుండి చరాచర జీవ రాశులు; అణిమ మొదలైన సిద్ధులు, మాయ, అహంకారము, బుద్ధి, మనస్సు, పంచ మహాభూతాలు, పంచతన్మాత్రలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రి యాలు మొదలైన ఇరవై నాలుగు తత్వాలు; మూడు గుణముల కలయిక, కాలము, మార్పు, కారణము, సంస్కారము, కామము, కర్మము, వాని గుణాలు ఇవన్నీ రూపాలు ధరించి నృత్యాలు గానాలు మొదలైనవి చేస్తూ ఈ నారాయణ స్వరూపు లైన బాలకులకు లోబడి సేవిస్తూ ఉన్నాయి; వేదాంత మంతా తెలిసినవారికి ఐనా ఈ విశ్వరూపాలు తెలియవు. ఈవిధంగా దేదీప్య మానంగా ప్రకాశిస్తూన్న బాలురను బ్రహ్మదేవుడు చూసాడు. చూసి ఇలా అనుకున్నాడు.

10.1-538-ఉ.

**"బాలురఁ గంటి నాచెయిది బాసినవారిని మున్ను వారి నేఁ**
**బోలఁగఁ జూచునంతటన భూరినిరర్గళదుర్గమప్రభా**
**జాలముతోడఁ జూపులకుఁ జాలమిఁ దెచ్చుచు నున్నవార; లే**
**మూలమొ మార్గమెయ్యదియొ? మోసమువచ్చెఁగదే విధాతకున్."**

**టీక:- బాలురన్ = చిన్నపిల్లలను; కంటిన్ = చూసితిని; నా = నాయొక్క; చెయిది = కృత్యమున; కిన్ = కు; పాసిన = మీరిన; వారిని = వారిని; మున్ను = ఇంతకుముందు; వారిన్ = వాళ్ళను; నేన్ = నేను; పోలగన్ = సరిగా, పోల్చుకొన; చూచున్ = చూసెడి; అంతన = అప్పటికి, సరికి; భూరి = అత్యధికమైన; నిరర్గళ = అడ్డములేని; దుర్గమ = పొందరాని; ప్రభా = కాంతుల; జాలము = సమూహ ముల; తోడన్ = తోటి; చూపుల్ = చూచుటకు; చాలమి = అశక్తతను; తెచ్చుచున్న = కలిగించుచున్నట్టి; వారలు = వారు; ఏ = ఏమిటి; మూలమొ = కారణమో ఏమో; మార్గము = దారితెన్ను, చేయదగ్గది; ఎయ్యదియొ = ఏదో ఏమిటో; మోసమువచ్చెన్ = మోసము వచ్చినది; కదే = కదా; విధాతకున్ = బ్రహ్మత్వమునకు.**

**భావము:- "నా చేష్టకు లోబడక తప్పించుకున్న బాలురను ముందు నుంచీ చూస్తూనే ఉన్నాను. వారు చూడగా చూడగా గొప్ప తేజస్సుతో కనపడు తున్నారు. ఆ తేజస్సు మహా ప్రవాహం లాగ చూపులతో సైనా సమీపించడానికి వీలుకాకుండా ఉంది. వారి వర్చస్సు చూడడానికి నా చూపులకు శక్తి చాలటం లేదు. దీనికి అంతటికి మూలకారణం ఏమిటి? ఇప్పుడు నేనేమిటి చేయడం. సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడను నాకే మోసం వచ్చింది కదా."**

**10.1-539-వ.**

## అని సకలేంద్రియంబులకు పెక్కసంబైన స్రుక్కి.

**టీక:- అని = అని; సకల = సమస్తమైన (మనసాది) {మనసాది, ఏకదశేంద్రియములు - 1మనస్సు 5జ్ఞానేంద్రియములు 5కర్మేంద్రియములు.}; ఇంద్రియంబుల్ = ఇంద్రియముల; కున్ = కు; పెక్కసంబు = సహింపరానిది; ఐన = కాగా; స్రుక్కి = సంతాపముపొంది.**

**భావము:-** ఆ బాలురరూపాలు బ్రహ్మదేవుని ఇంద్రియాల అన్నిటికీ భరించరానివి అయి పోయాయి. చూసి చూసి అతడు చేష్టలు దక్కి డస్సి పోయాడు.

**10.1-540-ఉ.**

**ఏ పరమేశు తేజమున నీ సచరాచరమైన లోక ము**
**ద్దీపిత మయ్యె నట్టి విభుతేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా**
**నోపక పారవశ్యమును నొందుచు సంస్తిమితాఖిలేంద్రియుం**
**డై పరమేష్టి మైమఱచె నప్పుడు చిత్రపురూపుకైవడిన్.**

**టీక:-** ఏ = ఏ ఒక్క; పరమ = సర్వోత్కృష్టమైన; ఈశు = దేవుని; తేజమునన్ = తేజస్సుచేత; ఈ = ఈ; సచరాచర = స్థావర జంగ మాత్మక మైన; లోకము = లోకము; ఉద్దీపితము = ప్రకాశింప జేయబడినది; అయ్యెన్ = అయినదో; అట్టి = అటువంటి; విభున్ = ప్రభువుయొక్క {విభుడు - శ్రుతి. నతత్ర సూర్యోభాతి న చంద్రతారకం, నేమా విద్యుతోభాంతి కుతోయమగ్నిః, తమేవ భాంతిమనుభాతి సర్వం, తస్య సర్వమిదం విభాతి.}; తేజమున్ = తేజస్సును; కన్నులన్ = కళ్ళతో; చక్కన్ = చక్కగా; చూడగాన్ = చూచుటకు; ఓపక = శక్యముగాక; పారవశ్యమును = పరవశత్వమును; ఒందుచున్ = పొందుతు; సంస్తిమిత = పనిచేయలేని {సంస్తిమిత – శబ్దస్పర్శాది వ్యాపార శూన్యములైన, వాటిపని అవి చేయలేని}; అఖిల = సమస్తమైన (మనసాది); ఇంద్రియుండు = ఇంద్రియములు కలవాడు; ఐ = అయ్యి; పరమేష్ఠి = బ్రహ్మ దేవుడు {పరమేష్ఠి - శ్రేష్ఠమైన స్థానమగు సత్యలోకమున ఉండువాడు, పరమ (శ్రేష్ఠమైన) ఇష్టి (యజ్ఞముచేయువాడు),బ్రహ్మ}; మైమఱచెన్ = స్మృతి తప్పిన వాడయ్యెను; అప్పుడు = ఆ సమయము నందు; చిత్రపు = చిత్తరువు నందలి; రూపు = ఆకృతి, బొమ్మ; కైవడిన్ = వలె.

భావము:- ఈసృష్టి అంతటికి పరముడైన ఈశ్వరుడు విష్ణుమూర్తి. తేజస్సు అనేది అతని నుండే పుట్టినది. దానివలన చరాచరమైన ఈ సృష్టి అంతా రూపొంది కాంతిమంతమై కళ్ళకు కనపడు తోంది. ఆ తేజస్సులో బ్రహ్మదేవుడు ఒక భాగం మాత్రమే కనుక ఆ తేజస్సును బ్రహ్మదేవుడు కన్నులారా చూడలేకపోయాడు. అతడు పరవశించి పోయాడు. అన్ని ఇంద్రియాలూ వ్యాపార శూన్యములు అయిపోయాయి. అప్పుడు బ్రహ్మదేవుడు బొమ్మగీసినట్లు ఒడలు తెలియక నిశ్చేష్టుడయి నిలబడి పోయాడు.

10.1-541-వ.

**ఇట్లు మాయాతీతుండును, వేదాంత విజ్ఞాన దుర్లభుండును, స్వప్రకాశానందుండునునైన తన బాహుళ్యంబుఁ జూచి నివ్వెఱ పడిన బ్రహ్మంగని యీశ్వరుండు.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; మాయా = అవ్యక్తమును {మాయ - అనృత జడ దుఃఖ అనిత్య మలినములే రూపములుగా కలిగిన స్వస్వరూప విస్మృతికి కారణమైన అవ్యక్తము}; అతీతుండును = అతిక్రమించినవాడు; వేదాంత = ఉపనిషదర్థము లందలి; విజ్ఞాన = విశిష్ఠ జ్ఞానము చేతనైనను; దుర్లభుండును = పొందరానివాడు; స్వప్రకాశ = తనంతటతనే వెలిగెడి {స్వప్రకాశుడు – సాధనాం తరము లేక స్వయముగా ప్రకాశించువాడు}; ఆనందుడును = నిరతిశయానందము కలవాడు; ఐన = అయినట్టి; తన = తనయొక్క; బాహుళ్యంబున్ = అతిశయము, విరాడ్రూపము; చూచి = కనుగొని; నివ్వెఱపడిన = నిశ్చేష్టుడైన; బ్రహ్మన్ = బ్రహ్మదేవుని; కని = ఉద్దేశించి; ఈశ్వరుండు = భగవంతుడు, శ్రీకృష్ణుడు.

భావము:- ఈశ్వరుడైన శ్రీకృష్ణుడు బ్రహ్మదేవుడిని చూసాడు. మాయకు అతీతుడు వేదాంతాలు చదివినంత మాత్రాన దొరకని వాడు, తన ప్రకాశములో

తాను ఆనందమై ఉన్నవాడు. అయిన పరబ్రహ్మ విశ్వరూపాన్ని చూసి బ్రహ్మదేవుడు నిశ్చేరపోవడం గమనించాడు. గమనించి. . .

10.1-542-శా.

బాలుండై చతురాననుండు తన యీ బ్రహ్మాభిమానంబునన్
లోలుండై మతిదప్పి నా మహిమ నాలోకింప నేతెంచెఁ దా
నాలోకింపఁగ నెంతవాఁ? డనుచు మాయాజాలమున్ విప్పి త
ల్లీలా రూపము లెల్ల డాఁచె నటఁ గేళీచాతురీధుర్యుఁడై.

టీక:- బాలుండు = తెలివి తక్కువగా కలవాడు; ఐ = అయ్యి; చతురాననుండు = బ్రహ్మదేవుడు {చతురాననుడు - నాలుగు ముఖములు కలవాడు, చతుర్ముఖబ్రహ్మ}; తన = అతనిదై నటువంటి; ఈ = ఈయొక్క; బ్రహ్మ = బ్రహ్మను అనెడి; అభిమానంబునన్ = అహంకారమునకు; లోలుండు = లొంగిపోయినవాడు; ఐ = అయ్యి; మతి = బుద్ధి; తప్పి = చెడి; నా = నాయొక్క; మహిమన్ = మహత్మ్యమును; ఆలోకింపన్ = చూచుటకు; ఏతెంచెన్ = వచ్చెను; తాన్ = అతను; ఆలోకింపన్ = చూచుటకు, తెలిసికొనుటకు; ఎంతవాడు = ఎంతటివాడు, అశక్తుడు; అనుచున్ = అని; మాయా = మాయయొక్క; జాలమున్ = ప్రభావమును (వల); విప్పి = తొలగించి; తత్ = ఆయా; లీలా = మాయ; రూపములు = స్వరూపములు; ఎల్లన్ = అన్నిటిని; డాచెన్ = అణచివేసెను; అటన్ = అక్కడ, అప్పుడు; కేళీ = క్రీడించుట యందు; చాతురీ = నేర్పును; ధుర్యుడు = ధరించినవాడు; ఐ = అయ్యి.

భావము:- "ఈ బ్రహ్మదేవుడు తనకు నాలుగు తలలు ఉన్నాయి అనుకుంటున్నాడు. బాలభావంతో తన ఈ బ్రహ్మపదవిని చూసుకుని అహంకారంలో మునిగిపోయాడు. అజ్ఞానంలో నిమగ్నమైపోయి నా మహిమ ఎంతటిదో చూడాలని వచ్చాడు. ఇంతటి మహామహిమ చూడడానికి అతడు

ఎంతో చిన్నవాడు కదా.” అని జాలిపడి భగవంతుడైన బాలకృష్ణుడు తన మాయాజాలాన్ని విప్పివేసాడు. తాను సృష్టించిన లీలారూపాలు అన్నింటినీ అక్కడికక్కడే దాచేసాడు, మాయంచేసేసాడు. ఆటలాడడంలో గానీ ఆడించడంలో గాని ఆయన చాతుర్యం ఊహించరానిది.

10.1-543-వ.

**అంతలోన నజీవుండు సజీవుండైన తెఱంగున నెనిమిది కన్నులుగల వేల్పుగమికాఁడు తేఱితెప్పఱి కాలుఁగేలుఁ గదలించి చెచ్చెరం గన్నులు విచ్చిచూడ సమర్థుండై ముందటఁ గని వెనుకఁ జూచి, దివి విలోకించి దిక్కులు వీక్షించి, యెల్లయె డలం గలయ దర్శించి తన పురోభాగంబున హరి సంచరిం చుటం జేసి జాతివైరంబు లేని నర పక్షి మృగాదులకు నాట పట్టయి సిరి గలిగి కామ క్రోధాది రహితులకు జీవనంబైన బృందావనంబుఁ బొడగాంచి; యందు.**

టీక:- అంతలోనన్ = అంతటితో; అజీవుండు = ప్రాణములు పోయినవాడు; సజీవుండు = బతికున్నవాడు; ఐన = అయిన; తెఱంగునన్ = విధముగ; ఎనిమిది = ఎనిమిది (8); కన్నులు = కళ్ళు; కల = కలిగిన; వేల్పుగమి కాడు = బ్రహ్మదేవుడు {వేల్పు గమికాడు - వేల్పు (దేవత)లకు గమికాడు (నాయకుడు), బ్రహ్మ}; తేఱి = తేరుకొని; తెప్పఱి = సంభాళించుకొని; కాలున్ = కాళ్ళు; కేలున్ = చేతులు; కదలించి = ఆడించి; చెచ్చెరన్ = శీఘ్రముగా; కన్నులు = కళ్ళు; విచ్చి = తెరుచుకొని; చూడన్ = చూచుట; సమర్థుండు = చేయగలవాడు; ఐ = అయ్యి; ముందటన్ = ఎదురుగా; కని = చూసి; వెనుకన్ = వెనుకవైపు; చూచి = చూసి; దివిన్ = పైకి; విలోకించి = చూసి; దిక్కులున్ =

అన్ని దిక్కులకు; వీక్షించి = చూసి; ఎల్లఎడలన్ = అన్ని వైపులా; కలయన్ = తరచి; దర్శించి = చక్కగా చూసి; తన = అతని; పురోభాగంబున = ఎదుట; హరి = శ్రీకృష్ణుడు {హరి – ప్రళయకాలమున రుద్రరూపముతో సకలజీవులను లయింపజేయువాడు, విష్ణువు}; సంచరించుటన్ = మెలగుట; చేసి = వలన; జాతి = జాతుల మధ్య ఉండు; వైరంబు = శత్రుత్వములు; లేని = లేనట్టి; నర = మానవులు; పక్షి = పక్షులు; మృగ = జంతువుల; కున్ = కు; ఆటపట్టు = నివాసము; అయి = ఐ; సిరి = శాంతి యనెడి సంపద; కలిగి = కలిగి; కామక్రోధాది = అరిషడ్వర్గములు {అరిషడ్వర్గములు – 1కామము 2క్రోధము 3లోభము 4మోహము 5మదము 6మాత్సర్యము}; రహితుల్ = లేనివారల; కున్ = కు; జీవనంబు = జీవనాధారము; ఐన = అయినట్టి; బృందావనంబున్ = బృందావనమును; పొడగాంచి = చూచి; అందు = దానిలో.

భావము:–ఇంతలో అంతటి ఎనిమిదికన్నులున్న దేవతలపెద్ద బ్రహ్మదేవుడూ, మృతిచెందినవాడు బ్రతికి వచ్చినట్లు, తేరుకుని తెప్పరిల్లాడు. కాళ్లు చేతులు కదలించి చూసుకున్నాడు. తరువాత కళ్ళు విప్పి చూడడానికి శక్తి వచ్చింది. ముందు వైపు వెనుక వైపు చూసుకున్నాడు. తలపైకెత్తి చూసుకున్నాడు. అన్ని దిక్కులకూ చూసాడు. అప్పుడు అన్ని చోట్ల పరిశీలనగా చూసాడు. ఎదుట బృందావనం కనిపించింది. కృష్ణుడు ఉండడం వలన నరులు, పక్షులు, జంతువులు, తమ తమ జాతి సహజమైన శత్రుత్వాలను మరచి తిరుగుతూ ఉండడంగమనించాడు. ఆబృందావనంలోసిరిసంపదలు ఉన్నాయి. అందు ఉన్న వారెవరికి కామక్రోధాలు లేవు. ఆ బృందావనం చూసాడు బ్రహ్మదేవుడు.



**10.1-544-సీ.**

**తన కన్యములు లేక తనరారి ముమ్మూల-**
**విభుడయ్యుఁ గ్రేపుల పెదకువాని**
**నఖిలజ్ఞుఁడై యొక్కఁడయ్యు నజ్ఞాకృతిఁ-**
**జెలికాండ్రఁ బెక్కండ్రఁ జీరువాని**
**బహిరంతరాద్యంత భావశూన్యుండయ్యు-**
**నంతంత నడుగు ఘోష్టరయువాని**
**గురుగభీరుండయ్యుఁ గురువులు వాఱుచు-**
**నట్టిట్టు పాతరలాడువాని**

**10.1-544.1-ఆ.**

**జాతిరహితుఁ డయ్యుఁ జతుర గోపార్భక**
**భావ మెల్ల నచ్చుపడిన మేటి**
**చెలువువాని హస్త శీతాన్నకబళంబు**
**వానిఁ గాంచె నపుడు వాణిమగఁడు.**

**టీక:-** తన = అతని; కిన్ = కి; అన్యములు = ఇతరములు; లేక = ఏవియులేక; తనరారి = ఒప్పి; ముమ్మూల = ఆదిమూలకారణుడైన; విభుడు = ప్రభువు; అయ్యున్ = అయినప్పటికి; క్రేపులన్ = దూడలను; పెదకు = అన్వేషించెడి; వానిన్ = అతనిని; అఖిల = సమస్తము; జ్ఞుడు = తెలిసినవాడు; ఐ = అయ్యి; ఒక్కడు = అద్వితీయుడు; అయ్యున్ = అయినప్పటికి; అజ్ఞాకృతిన్ = తెలివిలేనివానివలె; చెలికాండ్రన్ = స్నేహితులను; పెక్కండ్రన్ = అనేకమందిని; చీరు = పిలిచెడి; వానిన్ = వానిని; బహిర్ = వెలుపల; అంతర = లోపల; ఆది = మొదలు; అంత = చివర, తుద అనెడి; భావ = భావమునకుకూడ;

శూన్యుండు = లేనివాడు; అయ్యున్ = అయినప్పటికి; అంతంతన్ = అక్కడక్కడ; అడుగు = అడుగుల; ఛొప్పు = జాడను; అరయు = వెదకెడి; వానిన్ = అతనిని; గురు = మిక్కిలి; గభీరుండు = గాంభీర్యము కలవాడు; అయ్యున్ = అయినప్పటికి; గురువులువాఱుచున్ = వేగముగా పరుగెడుతు; అట్టిట్టు = అటునిటు; పాతరలాడు = నటించెడి; వానిన్ = వానిని.

జాతి = జాతిభేదములు; రహితుడు = లేనివాడు; అయ్యున్ = అయినప్పటికి; చతుర = నేర్పుగల; గోప = యాదవ; అర్భక = పిల్లల; భావము = స్వభావము; ఎల్లన్ = అంతటిని; అచ్చుపడిన = ప్రతిరూపుగా పొందిన; మేటి = అధికుడైన; చెలువు = దేహసౌందర్యము కల; వానిన్ = వానిని; హస్త = చేతి యందు; శీత = చద్ది; అన్న = అన్నపు; కబళంబు = ముద్ద కలిగిన; వానిన్ = వానిని; కాంచెను = చూసెను; అపుడు = ఆ సమయము నందు; వాణిమగడు = బ్రహ్మదేవుడు.

భావము:- పిమ్మట, సృష్టికి మూలము లైన త్రిగుణాలకూ ఆధారమూ, ప్రభువూ అయినవాడు; తనకు తాను ఒక్కడే అయినా, లేగల కోసం చూస్తూ వెతుకుతున్నాడు కృష్ణుడు. సర్వం తెలిసినవాడు తాను ఒక్కడే అయి సత్యం తానే అయినవా డైనా, ఎందరో స్నేహితులు ఉన్నట్లు పిలుస్తూ ఉన్నాడు. బయట లోపల మొదలు తుద అనే భావాలేవీ లేనివా డైనా, అక్కడక్కడా దూడల జాడలు వెదుకుతూ ఉన్నాడు, ఎంతో లోతైనవాడైనా, పరుగులు తీస్తూ ఇటూ అటూ చూస్తూ అడుగులు వేస్తున్నాడు. అతనికి జాతి అనేది లేదు అయినా, నేర్పరి అయిన గోపబాలుని లక్షణాలన్నీ చక్కగా అచ్చుపోసినట్లు ఉన్న శరీరంతో అందంగా వెలుగొందుతూ ఉన్నాడు. చేతిలో చల్ది అన్నపు ముద్ద పట్టుకుని ఉన్నాడు. ఇలా సర్వ లక్షణాలు మేళవించిన కృష్ణుని కేవలం వాక్కుకు మాత్రమే అధిపతియైన బ్రహ్మదేవుడు చూసాడు.

10.1-545-వ.

**కని సంభ్రమించి విరించి రాయంచ డిగ్గనుఱికి కనకదండ సుకుమారంబైన శరీరముతోడ నేలఁ జాగిలంబడి మణిగణ సుప్రకాశంబు లైన తన కిరీటశిఖర ప్రదేశంబు లా కుమారుని పాదపద్మంబులు మోవ మ్రొక్కి తోరంబులగు నానందబాష్ప జల పూరంబుల నతని యడుగులు గడిగి మఱియును.**

టీక:- కని = చూసి; సంభ్రమించి = హుషారుచెంది; విరించి = బ్రహ్మదేవుడు; రాయంచన్ = హంస వాహనమునుండి; డిగ్గనుఱికి = దుమికి దిగి; కనక = బంగారపు; దండ = కడ్డీవలె మెరిసెడి; సుకుమారంబు = కోమలము; ఐన = అయినట్టి; శరీరము = దేహము; తోడన్ = తోటి; నేలన్ = భూమిపైన; సాగిలపడి = సాష్టాంగనమస్కారము చేసి; మణి = రత్నాల; గణ = సమూహములచే; సు = మంచి; ప్రకాశంబులు = మెరిసిపోయెడివి; ఐన = అయిన; తన = అతనియొక్క; కిరీట = కిరీటముల; శిఖర = పైపైపుకొనల; ప్రదేశంబులు = భాగములు; ఆ = ఆయొక్క; కుమారుని = బాలుని; పాద = పాదములు అనెడి; పద్మంబులు = పద్మములు; మోవన్ = తాకునట్లుగ; మ్రొక్కి = నమస్కరించి; తోరంబులు = అధికములు; అగు = ఐన; ఆనంద = ఆనందమువలన కలిగిన; బాష్పజల = కన్నీటి; పూరంబులన్ = ప్రవాహములచే; అతని = అతని; అడుగులు = అడుగులను; కడిగి = కడిగి; మఱియును = ఇంకను.

భావము:- కృష్ణుడిని చూసి చూడగానే బ్రహ్మదేవుడు తత్తరపాటుతో హంసవాహనం నుండి దభాలున క్రిందికి దూకాడు. బంగారు శలాకు వలె రంగులీనుతూ ఉండి సుకుమారంగా ఉన్న తన శరీరంతో నేలపై సాగిలపడ్డాడు. ఎన్నోమణులతో వెలుగుతున్న తన కిరీటాలు కృష్ణుని

పాదపద్మాలకు తాకేలాగ మ్రొక్కేడు. ఆనందబాష్పాలు ధారలుగా కారుతూ ఉండగా అతని పాదాలు కడిగాడు. ఆపైన.

10.1-546-క.

**అడుగులపైఁ బడు లేచున్**

**బడుఁ గ్రమ్మఱఁ లేచు, నిట్లు భక్తిన్ మును దాఁ**

**బొడగనిన పెంపుఁ దలఁచుచు**

**దుడుకని మహిమాబ్ధి నజుఁడు దుడు కడఁచె నృపా!**

టీక:- అడుగుల = పాదముల; పైన్ = మీద; పడున్ = వాలిపడును; లేచున్ = పైకిలేచును; పడున్ = వాలిపడును; క్రమ్మఱన్ = మరల; లేచున్ = పైకి లేచును; ఇట్లు = ఈ విధముగ; భక్తిన్ = భక్తితో; మునున్ = ఇంతకు ముందు; తాన్ = అతను; పొడగనిన = చూసినట్టి; పెంపున్ = అతిశయమును; తలచు చున్ = గుర్తుచేసుకొనుచు; దుడుకని = ఉధృతికలవాని (కృష్ణుని); మహిమ = ప్రభావమనెడి; అబ్ధిన్ = సముద్రము నందు; అజుడు = బ్రహ్మదేవుడు; దుడుకు = ఉధృతిని (తన); అడచెన్ = అణచివేసెను; నృపా = రాజా.

భావము:- పరవశత్వంతో బ్రహ్మదేవుడు కృష్ణుడి పాదాలపై అనేక సార్లు పడుతూ లేస్తూ ప్రణమిల్లాడు. భక్తిపరవశుడై ఇంతకు ముందు తాను చూసిన విశ్వరూపం తలచుకుని ఆ బాలుని మహిమ అనే మహాసముద్రంలో మునిగిపోయాడు.

10.1-547-వ.

**అంతనల్లనల్లనలేచినిలుచుండి నయనారవిందంబులు దెఱచి, గోవిందుని సందర్శించి చతుర్ముఖుండు ముఖంబులు వంచి కృతాంజలియై దిగ్గన డగ్గుత్తికయిడుచు నేకచిత్తంబున జతు ర్ముఖంబుల నిట్లని స్తుతియించె.**

టీక:- అంతన్ = అప్పుడు; అల్లనల్లనన్ = మెల్లగా; లేచి = పైకిలేచి; నిలుచుండి = నిలబడి; నయన = కన్నులు అనెడి; అరవిందంబులున్ = పద్మములను; తెఱచి = తెరచుకొని; గోవిందునిన్ = శ్రీకృష్ణుని; సందర్శించి = చక్కగా చూసి; చతుర్ముఖుండు = బ్రహ్మదేవుడు {చతుర్ముఖుడు - నాలుగు ముఖముల వాడు, బ్రహ్మ}; ముఖంబులున్ = మోములను; వంచి = వాల్చి; కృత = చేయబడిన; అంజలి = ముడిచినచేతులుకలవాడు; ఐ; దిగ్గనన్ = తటాలున; డగ్గుతిక = గద్గదస్వరము; ఇడికొనుచు = పెట్టుకొని; ఏక = అచంచల మైన; చిత్తంబునన్ = మనసుతో; చతః = నాలుగు; ముఖంబులన్ = మోములతోను; ఇట్లు = ఈ విధముగ; అని = అని; స్తుతియించె = స్తోత్రములు చేసెను.

భావము:- తరువాత, బ్రహ్మదేవుడు నెమ్మదిగా లేచి నిలబడి కళ్ళు తెరచి గోవులను కాస్తున్న గోవిందుని దర్శనం చేసుకున్నాడు. తన ముఖాలు నాలుగూ వంచి చేతులు జోడించి డగ్గుత్తిక పడిన గొంతుతో ఏకాగ్రమైన మనస్సుతో నాలుగు నోరులారా ఇలా స్తుతించాడు.

## బ్రహ్మ పూర్ణిజేయుట

10.1-548-సీ.

"శంపాలతికతోడి జలదంబు కైవడి-
    మెఱుఁగు టొల్లియతోడి మేనివానిఁ
కమనీయ మృదులాన్నకబళ వేత్ర విషాణ-
    వేణుచిహ్నంబుల వెలయువాని
గుంజా వినిర్మిత కుండలంబులవాని-
    శిఖిపింఛవేష్టిత శిరమువానిఁ

**వనపుష్పమాలికావ్రాత కంఠమువాని-**

**నళినకోమల చరణములవానిఁ**

**10.1-548.1-ఆ.**



**గరుణ గడలుకొనిన కడగంటివాని గో**

**పాలబాలుభంగిఁ బరగువాని**

**నగుమొగంబువాని ననుఁగన్నతండ్రిని**

**నిను భజింతు మ్రొక్క నీరజాక్ష!**

టీక:- శంపా = మెరుపు; లతిక = తీగ; తోడి = తోకూడియున్న; జలదంబు = మేఘము; కైవడిన్ = వలె; మెఱుగు = మెరుస్తున్న; ఒల్లియ = పైబట్ట; తోడి = తోకూడుకొన్న; మేని = దేహముకల; వానిన్ = వానిని; కమనీయ = మనోజ్ఞ మైన; మృదుల = మృదువైన; అన్న = అన్నపు; కబళ = ముద్ద; వేత్ర = బెత్తముకఱ్ఱ; విషాణ = కొమ్ము; వేణు = మురళి; చిహ్నంబులన్ = గురుతులుగా; వెలయు = ప్రకాశించెడి; వానిన్ = అతనిని; కుంజా = ఏనుగు దంతంతో; వినిర్మిత = చక్కగాచేయబడిన; కుండలంబుల = చెవికుండలములుకల; వానిన్ = అతనిని; శిఖి = నెమలి {శిఖి – తలపైన శిఖగలది, నెమలి}; పింఛ = పింఛము చేత; వేష్టిత = చుట్టుకొనబడిన; శిరము = తల కలిగిన; వానిన్ = అతనిని; వన = అడవి; పుష్ప = పూల; మాలికా = దండల; వ్రాత = సమూహములున్న; కంఠము = మెడకలిగిన; వానిన్ = అతనిని; నళిన = పద్మములవంటి; కోమల = మృదువైన; చరణముల = పాదములుకలిగిన; వానిన్ = వానిని; కరుణ = దయారసము; కడలుకొనిన = అతిశయించిన.

కడకంటి = కంటిచివరలు కలిగిన; వానిన్ = వానిని; గోపాలబాలు = గొల్లపిలవాని; భంగిన్= వలె; నగు= నవ్వుతున్న; మొగంబు = ముఖము కలిగిన;

వానిన్ = వానిని; ననున్ = నన్ను; కన్న = పుట్టించిన; తండ్రిని = తండ్రిని; నిన్నున్ = నిన్ను; భజింతు = సేవింతును; మ్రొక్కి = నమస్కరించి; నీరజాక్ష = శ్రీకృష్ణా.

భావము:- "మెరపుతీగతోకూడిన మేఘంవలే నీ శరీరం బంగారు రంగు ఉత్తరీయంతో ప్రకా శిస్తున్నది. నీ చేతిలో ఉన్న చలిది ముద్ద మృదువుగా ఎంతో అందంగా ఉంది. పెదురుకఱ్ఱ, కొమ్ము బూర, మురళి మొదలైనవి అలంకారాలవలె కలిగి ప్రకాశిస్తున్నావు. ఏనుగు దంతంతో చక్కగా చేసిన నీ కుండలాలు; నెమలి పింఛంతో చుట్టబడిన శిరస్సు; అడవిపూల మాలికతో అలంకరించబడిన నీ కంఠం; తామరపూవులా సున్నితమైన నీ పాదాలు ఎంతో అందంగా ఉన్నాయి. అదిగో కడగంటితో నన్ను చూస్తున్న నీ చూపులో కరుణ తొణికిసలాడుతోంది. నీ గోపాలబాల రూపాన్ని నేను స్తుతిస్తూ ఉంటే, నన్ను చూసి నవ్వుతున్న నీ మోము చాలా రమణీయంగా ఉంది. కమలదళాలవంటి కన్నులకల నీవు నన్ను కన్నతండ్రివని ఇప్పుడు గుర్తించాను. ఓ విష్ణుమూర్తి! నీకు మ్రొక్కి నిన్ను సేవించుకుంటు న్నాను.

10.1-549-మ.

**ననుఁ మన్నించి భవజ్జనంబులకు నానందంబు నిండించు నీ**
**తను రూపంబిదె నామనంబున కచింత్యం బయ్యెఁ; నీ యుల్లస**
**ద్ఘన విశ్వాకృతి సెప్పఁ డోపు? నెఱుఁగన్ గైవల్యమై యొప్పు నా**
**త్మ నివేద్యంబగు నీదు వైభవము చందం బెట్టిదో? యీశ్వరా!**

టీక:- ననున్ = నన్ను; మన్నించి = క్షమించి; భవత్ = నీ; జనంబులు = వారల; కున్ = కు; ఆనందంబున్ = సంతోషమును; నిండించు = పరిపూర్ణగా జేయు; నీ = నీయొక్క; తను = దేహముయొక్క; రూపంబు = స్వరూపము; ఇదె = ఇదిగో; నా = నాయొక్క; మనంబున్ = మనసున; కున్ = కు; అచింత్యంబు = విచారించ శక్యము కానిది; అయ్యెన్ = అయినది; నీ = నీయొక్క; ఉల్లసత్ =

ప్రకాశించునట్టి; ఘన = గొప్ప; విశ్వాకృతిన్ = విరాడ్రూపమును; ఎవ్వడు = ఎవరు మాత్రము; ఓపున్ = శక్తి కలవా డగును; ఎఱుగన్ = తెలిసికొనుటకు; కైవల్యము = ముక్తి రూపు దాల్చినది; ఐ = అయ్యి; ఒప్పున్ = చక్కగా ఉండునది; ఆత్మ = పరమాత్మను; నివేద్యంబు = ఎరిగింపదగినది; అగు = ఐన; నీదు = నీయొక్క; వైభవము = మహిమముయొక్క; చందంబు = విధము; ఎట్టిదో = ఎలాంటిదో; ఈశ్వరా = కృష్ణా {ఈశ్వరుడు – సర్వనియామకుడు, విష్ణువు}.

భావము:- పరమేశ్వరా! నన్ను అనుగ్రహించు. నీ వారికి అందరకీ ఆనందం నిండించే నీ ఈ చిన్నరూపమే నా మనస్సుకే ఊహించడానికి సాధ్యం కాలేదు. ఇక నీవు ఉల్లాసంతో ధరించిన మహావిశ్వరూపాన్ని తెలుసుకోవడానికి సమర్థు లెవరు? నాలో నేను గా నున్న నీకు మాత్రమే తెలియదగిన నీ వైభవ విశేషం ఎంతటిదో ఎవరికి మాత్రం తెలుస్తుంది?

10.1-550-క.

**విజ్ఞాన విధము లెఱుఁగక**

**తద్జ్ఞులు నీ వార్త చెప్పఁ దను వాఙ్మనముల్**

**యజ్ఞేశ! నీకు నిచ్చిన**

**యజ్ఞులు నినుఁబట్టి గెలుతు రజితుఁడవైనన్.**

టీక:- విజ్ఞాన = అనుభవ జన్య జ్ఞానము; విధముల్ = మార్గములను; ఎఱుగక = తెలియకపోయినను; తద్జ్ఞులు = తత్వజ్ఞానము కలవారు; నీ = నీయొక్క; వార్తన్ = వృత్తాంతమును; చెప్పన్ = బోధింపగా; తను = దేహమును; వాక్కు = మాటలను; మనముల్ = మనసులను; యజ్ఞేశ = శ్రీకృష్ణా {యజ్ఞేశుడు – యజ్ఞములకు కర్త, విష్ణువు}; నీ = నీ; కున్ = కు; ఇచ్చిన = సమర్పించిన; అజ్ఞులున్ = మూఢులు కూడ; నినున్ = నిన్ను; పట్టి = కనుగొని; గెలుతురు =

**జయింతురు, పొందెదరు; అజితుడవు = జయింపరానివాడవు; ఐనన్ = అయినప్పటికిని.**

**భావము:-ఓ యజ్ఞరూపా! శ్రీహరీ! మహాపండితులు తాము వివరించదలచిన నీ పరబ్రహ్మతత్వాన్ని "అది (తత్)" అని వ్యవహరిస్తారు. వారు ఆత్మజ్ఞానాన్ని తెలియలేక, చెప్పడానికిపదాన్నే వాడుతూ ఉంటారు. అంతేతప్ప, ఎంతటి పండితు లకైనా నీవు జయింపరానివాడవే. అయితే, ఏమీతెలియనివాళ్ళు సైతం, త్రికరణ ములు అనే శరీరము వాక్కు మనస్సులతోసహా తమనుతాము నీకు సమర్పించు కుని భక్తితో గట్టిగా నిన్ను పట్టుకుంటే, నిన్ను అందుకో గలుగుతారు.**

**10.1-551-క.**

**శ్రేయములుఁ గురియు భక్తిని**
**జేయక కేవలము బోధసిద్ధికిఁ దపమున్**
**జేయుట విఫలము; పొల్లున**
**నాయము జేకుఱునె తలఁప నధికం బైనన్.**

**టీక:- శ్రేయములున్ = శుభములను; కురియు = సమృద్ధిగా ఇచ్చునట్టి; భక్తిని = పూజించుట; చేయక = చేయకుండగ; కేవలము = ఒక్క; బోధ = జ్ఞానము; సిద్ధి = పండుట; కిన్ = కుమాత్రమే; తపమున్ = తపస్సును; చేయుట = చేయుట; విఫలము = ఫలితము లేనిది; పొల్లునన్ = పొట్టునుండి, ఊకనుండి; ఆయము = వచ్చుబడి బియ్యము; చేకుఱునె = లభించునా, లభించదు; తలపన్ = తరచి చూసినచో; అధికంబు = ఎంత ఎక్కువ; ఐనన్ = ఉన్నప్పటికిని.**

**భావము:- భక్తి అనేది సర్వ శుభాలనూ వర్షిస్తుంది. అటువంటి భక్తిని వదలిపెట్టి కేవలం జ్ఞానంకోసం తపస్సు చేయడం వ్యర్థం. ఎంత ఎక్కువగా కూడపెట్టినా ఊక (బియ్యంపైన ఉండే పొట్టు)వల్ల ఏమి ఆదాయం లభిస్తుంది? ఎంత ఊకదంపుడు చేసినా ఏమి ఫలితం దక్కుతుంది?**

10.1-552-క.

నిజముగ నిన్నెఱుఁగఁగ మును

నిజవాంఛలు నిన్నుఁ జేర్చి నీ కథ వినుచున్

నిజకర్మలబ్ధ భక్తిన్

సుజనులు నీ మొదలిటెంకిఁ జొచ్చి రధీశా!

టీక:- నిజముగన్ = వాస్తవమునకు; నిన్నున్ = నీతత్వమును; ఎఱుగగన్ = తెలిసికొనుటకు; మునున్ = ముందుగా; నిజ = తమ; వాంఛలున్ = కోరికలందు; నిన్నున్ = నిన్ను; చేర్చి = పెట్టుకొని; నీ = నీయొక్క; కథ = వృత్తాంతము; వినుచున్ = శ్రద్ధగా వినుచు; నిజ = తము; కర్మ = చేసిన కర్మలవలన; లబ్ధ = లభించిన; భక్తిన్ = భక్తితో; సుజనులు = సత్పురుషులు; నీమొదలిటెంకి = పరమపదమును {నీ మొదలి టెంకి - నీ (భగవంతునియొక్క) మొదలి (మూల) టెంకి (నివాసము), వైకుంఠము, పరమపదము}; చొచ్చిరి = ప్రవేశించిరి; అధీశ = ప్రభూ.

భావము:- ప్రభూ! విష్ణుమూర్తీ! నిన్ను తెలుసుకోవడం కోసం ముందుగా తమ కోరికలన్నీ నీ యందు సమర్పించి, నీ కథలు వింటూ ఉండాలి. అప్పుడు తాము చేసిన సత్ కర్మలకు ఫలితంగా భక్తి అనేది లభిస్తుంది. ఇలా లభించిన భక్తితో సజ్జనులు మాత్రమే నీ మూలస్థానం అయిన పరమపదాన్ని చేరతారు.

10.1-553-సీ.

విక్రియాశూన్యమై విషయత్వమును లేని-

దగుచు నాత్మాకారమై తనర్చు

నంతఃకరణ మొక్క యధిక సాక్షాత్కార-

విజ్ఞానమునఁ బట్టి పే ళ్ళోరులకుఁ

**సెఱుఁగంగ రానిదై యేపారి యుండుటఁ-**

**జేసి నీ నిర్గుణ శ్రీవిభూతి**

**బహిరంగవీధులఁ బాఱక దిరములై-**

**యమలంబు లగు నింద్రియములచేత**

**10.1-553.1-ఆ.**

**సెట్టకేలకైన సెఱుఁగంగ నగుగాని**

**గుణవిలాసి వగుచుఁ గొమరుమిగులు**

**నీ గుణవ్రజంబు సేర రా దెఱుఁగంగ**

**నొక్క మితము లేక యుంట నీశ!**

**టీక:-** విక్రియా = వికారములు (షడ్విధ) {షడ్విధ వికారములు - 1పుట్టుట 2పెరుగుట 3ముదియుట 4చిక్కుట 5చచ్చుట 6గర్భనరకస్థితి}; శూన్యము = సంపూర్తిగా లేనిది; ఐ = అయ్యి; విషయత్వములేనిది = ఇంద్రియాతీతము {విషయత్వములేనిది - విషయత్వము (ఇంద్రియార్థములైన 1శబ్ద 2స్పర్శ 3రూప 4రస 5గంధ లక్షణములేవియును) లేనిది, ఇంద్రియములకందనిది}; అగుచున్ = ఔతూ; ఆత్మ = పరబ్రహ్మ; ఆకారము = స్వరూపము; ఐ = అయ్యి; తనర్చు = ఒప్పునట్టి; అంతఃకరణము = అంతరంగము నందు; ఒక్క = అఖండాకారమైన; అధిక = సర్వోత్కృష్టమైన; సాక్షాత్కార = అపరోక్షమైన; విజ్ఞానమునన్ = అనుభవైకజ్ఞానమును; పట్టి = అవలంబించి; పేఱొరులకు = మిగిలినవారి కెవరికిని; ఎఱుంగరానిది = తెలిసికొన శక్యము కానిది; ఐ = అయ్యి; ఏపారి = అతిశయించి; ఉండుటన్ = ఉండుట; చేసి = వలన; నీ = నీయొక్క; నిర్గుణ = గుణత్రయరహితమైన {నిర్గుణము - శాంత ఘోర మూఢ వృత్తులు కలగిన సత్వ రజస్తమో గుణత్రయ

రహితము}; శ్రీ = సంపద; విభూతి = మహాత్మ్యము; బహిరంగవీధులన్ = బాహ్యప్రదేశములందు {బహిరంగవీధులు – అంతర బాహ్య శబ్ద దృశ్యాది విషయ పంచక మార్గములు, బాహ్యప్రదేశములు}; పాఱక = వ్యాపింపక; తిరములు = స్థిరముగా నుండునవి; ఐ = అయ్యి; అమలంబులు = నిర్మలంబులు {అమలంబులు – నిర్మలములు, రాగద్వేషాదులు లేనివి}; అగు = ఐన; ఇంద్రియముల = ఇంద్రియముల; చేత = వలన; ఎట్టకేలకున్ = అతికష్టముచేతనైనను; ఎఱుగంగన్ = తెలిసికొనుట; అగున్ = సాధ్యము; కాని = కాని.

గుణ = సగుణ {సగుణవిలాసి – గుణత్రయముయొక్క విలాసముచే, సత్వగుణమువలన సకల దేవతల రూపములను రజోగుణముచేత సకల భూలోకజీవులను తమోగుణముచేత భౌతిక రూపములైన భూమి పర్వతములు శిలలు మున్నగునవి ధరించినవాడు}; విలాసివి = మెలగెడివాడవు; అగుచున్ = అగుచు; కొమరుమిగులు = అందగించునట్టి; నీ = నీయొక్క; గుణ = సర్వగుణముల {గుణవ్రజము – సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వపాలకత్వ సర్వ స్రష్టత్వ సర్వసంహారకత్వ సర్వభోక్తృత్వాది గుణముల సముదాయము}; వ్రజంబున్ = సమూహమును; నేరరాదు = శక్యముకాదు; ఎఱుగంగ = తెలిసికొనుటకు; ఒక్క = ఏదో ఒక; మితము = పరిమితన్నది; లేకన్ = లేకుండగ; ఉంటన్ = ఉండుటచేత; ఈశ = కృష్ణా {ఈశుడు – సర్వ నియామకుడు, విష్ణువు}.

భావము:- ఓ పరమేశా! కృష్ణా! నీ నిర్గుణ వైభవంలో ఏ మార్పులూ ఉండవు కనుక తెలియడానికి ఏమీ ఉండదు. పైగా తన కన్నా వేరే తనకు వెలుపల ఏమీ ఉండదు. దానినే తత్ లేదా ఆత్మ అంటాము. అది అన్నింటి లోపల అంతర్యామియైన ప్రయోజనంగా ఉంటుంది. అది ఇంద్రియాలకి, ఎదుట కనిపించడానికి అవకాశం లేదు. ఎందుకంటే, అంతకు ముందున్న విజ్ఞానం అనే అలవాటు ఉన్నప్పుడే ఇంద్రియాలు తెలుసుకోగలవు కదా. అది

తనకు తప్ప ఇంకొకళ్ళకు తెలియదు. ఎందుకనగా, దానికి అదే కాని ఇతరము ఏదీ ఉండదు. అది ఎప్పడూ పెలుపల కనిపించేది కాదు. కనుక ఇంద్రియాలను లోపలికి త్రిప్పితే తనకు తాను అనిపిస్తుంది. ఇలా తిప్పలుపడి ఎలాగో అలాగ నీ నిర్గుణ తత్వాన్ని తెలుసుకోవచ్చు. అదే కష్టం అనుకుంటారు కానీ, నిజానికి నీ సగుణరూపం తెలుసుకోవడమే అసాధ్యం. నీవు ప్రదర్శించే గుణాలు ఎవరికీ అంతుపట్టవు. నీవు గుణాలతో కూడి మాత్రమే గోచరిస్తూ ఉంటావు. మరి (గుణాతీతుడవైన) నీ గుణాలకు పరిమితి అన్నదే లేదు కనుక, నీయొక్క కనిపించే రూపాలను తెలుసుకోవడమే అసాధ్యం.

10.1-554-క.

తారా తుషార శీకర

భూరజములకైన లెక్క బుధు లిడుదురు; భూ

భారావతీర్ణకరుఁ డగు

నీ రమ్యగుణాలి సెన్న నేర రగణ్యా!

టీక:- తారా = నక్షత్రముల; తుషార = మంచు; శీకర = తుంపరల; భూ రజముల = ధూళికణముల; కైనన్ = అయినప్పటికి; లెక్క = లెక్కించి వివరము లను; బుధులు = పండితులు; ఇడుదురు = ఇచ్చెదరు; భూ = భూమండలము మీది; భార = భారమును; అవతీర్ణకరుడవు = తగ్గించెడివాడవు; అగు = ఐన; నీ = నీయొక్క; రమ్య = చక్కటి; గుణ = గుణముల; ఆలిన్ = సమూహమును; ఎన్నన్ = గణించుట; నేరరు = చేయలేరు {ప్రత్యక్షాది ప్రమాణములు (8) - 1ప్రత్యక్షము 2అనుమానము 3ఉపమానము 4శాబ్దము 5అర్థాపత్తి 6అనుప లబ్ధి 7సంభవము 8ఐతిహ్యము. వీనిలో మొదటి 4 తార్కికులమతము 6వేదాంతులమతము 8పౌరాణికులమతముప్రకారము ఎంచబడును}; అగణ్యా

= శ్రీకృష్ణా {అగణ్యుడు - ప్రత్యక్షాది అష్ట ప్రమాణములచేతను ప్రమాణింప (గణింప) శక్యము కానివాడు, విష్ణువు}.

భావము:- ఓ గణనాతీతా! శ్రీకృష్ణా! ఆకాశంలో మెరిసే తారలను, మంచు తుంపరలను, భూమి మీది ధూళి కణాలను అయినా లెక్కించడం సాధ్యం కావచ్చు. కాని భూభారాన్ని తగ్గించడానికి అవతరించిన నీ మనోహరమైన గుణాలను ఎంతటి పండితులూ లెక్కపెట్టలేరు. నీవు అన్ని లెక్కలకూ పైనున్నవాడవు కదా.

10.1-555-శా.

**ఏ వేళం గృపఁ జూచు నెన్నఁడు హరిన్ వీక్షింతు నం చాఢ్యుఁడై**
**నీవెంటంబడి తొంటికర్మచయమున్ నిర్మూలముం జేయుచున్**
**నీ వాఁడై తను వాఙ్మనోగతుల నిన్ సేవించు విన్నాణి వో**
**కైవల్యాధిపలక్ష్మి నుద్దవడిఁ దాఁ గైకొన్నవాఁ డీశ్వరా!**

టీక:- ఏ =ఏ; వేళన్ = సమయమందు; కృపన్ = కరుణాదృష్టితో; చూచున్ = చూచునో (నన్ను); ఎన్నడు = ఎప్పుడు; హరిన్ = నారాయణుని; వీక్షింతున్ = దర్శించెదనో; అంచున్ = అనుచు; ఆఢ్యుడు = అధికాసక్తి గలవాడు; ఐ = అయ్యి; నీ = నీ యందు; వెంటంబడి = లగ్నమై {వెంటంబడి - వెంబడించి, చతుర్దశేంద్రియ వ్యాపారములను నీ యందె చేర్చి}; తొంటి = మునుపటి; కర్మ = ప్రారబ్ధకర్మముల {ప్రారబ్ధ కర్మములు - ఆగామి సంచిత కర్మములు}; చయమున్ = సముదాయమును; నిర్మూలమున్ = మొదలంట చెరచుట; చేయుచున్ = చేస్తూ; నీ = నీ దయకు పాత్రుడైన; వాడు = వాడు; ఐ = అయ్యి; తనువాఙ్మనోగతుల = మనోవాక్కాయ కర్మలను; నిన్ = నిన్ను; సేవించు = కొలిచెడి; విన్నాణి వో = విజ్ఞానియే; కైవల్య = పరమపదమునకు; అధిప = నాథుని సంబంధమైన;

లక్ష్మిన్ = సంపదను (మోక్ష); ఉద్దవడిన్ = అతిశీఘ్రముగా; తాన్ = అతను; కైకొన్నవాడు = పొందినవాడు; ఈశ్వరా =సర్వాంతర్యామి అయిన భగవంతుడా.

భావము:- సర్వేశ్వరా! శ్రీకృష్ణా! నన్ను ఏ నాటికి దయతోచూస్తాడో ఎప్పుడు నేను శ్రీహరిని చూడగలుగుతానో అనే ఆర్తితో ఉన్నవాడు నిజమైన సంపన్నుడు. అట్టి నీ భక్తుడు నీ వెంటపడాలి. ఆ మార్గంలో ప్రయాణం సాగిస్తూ తన పూర్వకర్మల మొత్తాన్ని మొదలంటా తొలగించుకొని, నీ వాడు కావాలి. మనస్సుతోను, వాక్కుతోను, చేష్టలతోను నిన్నే సేవించాలి. అతడు నిజమైన నేర్పరి. అటువంటి నేర్పరికి గాని మోక్షలక్ష్మిని పూర్తిగా అందుకోవడం సాధ్యం కాదు.

10.1-556-ఉ.

**మాయలు గల్గువారలను మాయలఁ బెట్టెడి ప్రోడ నిన్ను నా**
**మాయఁగలంచి నీమహిమ మానముఁ జూచెద నంచు నేరమిం**
**జేయఁగఁబూనితిం; గరుణచేయుము; కావుము; యోగిరాజవా**
**గ్గేయ! దవాగ్నిఁ దజ్జనిత కీలము గెల్చి వెలుంగ నేర్చునే.**

టీక:- మాయలున్ = కపట వ్యాపారములు; కల్గు = కలిగిన; వారలను = వారిని; మాయలన్ = మాయలలో; పెట్టెడి = చిక్కించునట్టి; ప్రోడ = నేర్పరి; నిన్నున్ = నిన్ను; నా = నాయొక్క; మాయన్ = మాయచేత; కలంచి = కలవరపెట్టి; నీ = నీయొక్క; మహిమన్ = ప్రభావము; మానము = కొలదిని; చూచెదన్ = పరీక్షించెదను; అంచున్ = అనుచు; నేరమిన్ = తెలియకపోవుటచేత; చేయగాన్ = చేయవలె నని; పూనితిన్ = ప్రయత్నించితిని; కరుణచేయుము = దయచూడుము; కావుము = కాపాడుము; యోగి = యోగులలో; రాజ = శ్రేష్ఠుల; వాక్ = వాక్కులచేత; గేయ = కీర్తింపబడువాడ; దవాగ్నిన్ = కార్చిచ్చును; తత్ = దానిలో; జనిత = పుట్టిన; కీలము = మంట; గెల్చి = జయించి, మీరి; వెలుంగన్ = ప్రకాశించ; నేర్చునే = చేయగలదా.

భావము:- ఓ గడసరివాడా! కృష్ణమూర్తీ! యోగీశ్వరులు అందరిచేతా వాక్కుల తోను పాటలతోను స్తుతింపబడుతూ ఉండేవాడా! దావాగ్ని నుండి పుట్టిన ఒక అగ్నిజ్వాల, ఆ దావాగ్నినే మించి ప్రకాశించడం ఎలా సాధ్యం అవుతుంది? నీవు ఎంతటి మాయలు కల వారిని అయినా మాయలో పడవేస్తుంటావు. అటువంటి నిన్ను నా మాయతో ఇబ్బందిపెట్టి నీ మాయ ఎంతటిదో చూద్దాం అనుకున్నాను. చేత కాదని తెలియక చేయడానికి సాహసించాను. నా యందు దయ చూపి రక్షించు.

10.1-557-సీ.

సర్వేశ! నే రజోజనితుండ; మూఢుండఁ-
    బ్రభుఁడ నేనని పెత్త్రి ప్రల్లదమున
గర్వించినాఁడను; గర్వాంధకారాంధ-
    నయనుండ గృపఁజూడు ననుఁ; బ్రధాన
మహదహంకృతి నభో మరుదగ్ని జల భూమి-
    పరివేష్టితాండకుంభంబులోన
నేడు జేనల మేన నెనయు నే నెక్కడ?-
    నీ దృగ్విధాండంబు లేరి కైన

10.1-557.1-తే.

సంఖ్య జేయంగ రానివి; సంతతంబు
నోలిఁ బరమాణవుల భంగి నొడలి రోమ
వివరముల యందు వర్తించు విపులభాతి
నెనయుచున్న నీ వెక్కడ? నెంతకెంత?

<u>టీక:</u>- సర్వేశా = శ్రీకృష్ణా {సర్వేశుడు - సర్వమునకు నియామకుడు, విష్ణువు}; నీ = నీకు సంబంధించిన; రజస్ = రజోగుణముచేత; జనితుండన్ = పుట్టినవాడను; మూఢుండన్ =ఏమీతెలియనివాడను; ప్రభుడన్= అధికారము కలవాడను; నేన్ = నేనే; అని = అనుకొని; పెట్టి = పిచ్చి; ప్రల్లదమునన్ = పౌరుషముచేత; గర్వించినాడను = గర్వము పొందితిని; గర్వ = గర్వము యనెడి; అంధకార = చీకటిచేత; అంధ = కనిపించని; నయనుండన్ = కళ్ళు కలవాడిని; కృపన్ = దయతో; చూడు = అనుగ్రహింపుము; ననున్ = నన్ను; ప్రధాన = అవ్యక్తము; మహత్ = మహత్తత్వము; అహంకృతి = అహంకారము; నభో = ఆకాశము; మరుత్ = వాయువు; అగ్ని = నిప్పు; జల = నీరు; భూమి = భూమి చేతను; పరివేష్టిత = పూర్తిగా ఆవరింపబడిన (పై అష్టావరణముల చేతను); అండకుంభంబు = బ్రహ్మాండభాండము నందు {అండకుంభము - బ్రహ్మాండములు కల కుండ, బ్రహ్మాండభాండము}; ఏడు = ఏడు (7) {ఏడుజానలమేను - దేహి (ఏ మనిషి అయినా) తన జానతో ఏడుజానల పొడుగు ఉండును అన్నది ఒక సాముద్రికశాస్త్ర ప్రమాణము.}; జేనల = జేనల కొలది గల {జేన, జాన - బాగా సాచిన బొటకనవేలు చిటికినవేలుల చివర్ల మధ్య దూరము, (సుమారు 10 అంగుళములుండును)}; మేనన్ = దేహమునందు; ఎనయు = కూడి యుండువాడను; నేను = నేను; ఎక్కడ = ఎక్కడ; ఈ = ఈయొక్క; దృక్ విధ = కనబడెడి; అండంబులు = బ్రహ్మాండాలు, విశ్వాలు; ఏరి = ఎవరి; కైనన్ = కి అయినప్పటికి.

సంఖ్యచేయంగన్ = లెక్కించుట; రానివి = శక్యముకానివి; సతతంబున్ = ఎల్లప్పుడు; ఓలిన్ = వరుసగా; పరమాణువుల = సూక్ష్మాతిసూక్ష్మకణముల {పరమాణువు - కిటికీలోంచి పడెడి సూర్య కిరణమునందు కనబడెడి రేణువు నందు ఆరవభాగము అణువు. ఇది కంటికికనబడదు. అట్టిదానిలో ఆరవ భాగము పరమాణువుసెదరు.}; భంగిన్ = వలె; ఒడలి = ఒంటిమీది; రోమ =

వెంట్రుకల; వివరముల = మూలరంధ్రముల; అందున్ = లో; వర్తించు = ఉండు నట్టి; విపుల = విస్తారమైన; భాతిన్ = విధముగా; ఎనయుచున్న = అతిశయిం చునట్టి; నీవు = నీవు; ఎక్కడ = ఎక్కడ; ఎంతకెంత = పోల్చలేనంత తేడా ఉంది.

భావము:- సర్వేశ్వరా! కృష్ణా! నేను రజోగుణము నుండి జనించిన వాడను. కనుక మోహం చెంది ఉన్నాను. నేనే ప్రభువును అనుకుని పెత్త్తి అహంకారంతో గర్వించాను. గర్వం అనే చీకటితో నా కన్నులు చీకట్లు క్రమ్మాయి. ప్రధాన పురుషుడు అతని చుట్టూ మహత్తు అహంకారము ఆకాశము వాయువు అగ్ని జలము భూమి ఇలా ఒకదాని చుట్టూ మరియొకటి ఆవరించి యున్న బ్రహ్మాండంలో ఏడుజానల పొడవున్న నేనెంతవాడను? ఎవరికీ లెక్కించనలవి కానన్నిఇలాంటి బ్రహ్మాండాలు కల బ్రహ్మాండ భాండాలు ఎన్నింటినో నిత్యమూ ఒకదానివెంట ఒకటిగా నీ శరీరంలోని రోమకూపాలలో పరమాణువులుగా ధరిస్తూ ఉన్న నీవెక్కడ? నేనెక్కడ? ఎక్కడి కెక్కడికి పోలిక?

10.1-558-త.

కడుపులోపల నున్న పాపఁడు కాలఁ దన్నినఁ గిన్కతో
నడువఁ బోలునె క్రాఁగి తల్లికి? నాథ! సన్నము దొడ్డునై
యడఁగి కారణ కార్యరూపమునైన యీ సకలంబు నీ
కడుపులోనిదె గాదె? పాపఁడఁ గాక నే మఱి యెవ్వఁడన్?

టీక:- కడుపు = గర్భము; లోపలన్ = అందు; ఉన్న = ఉన్నట్టి; పాపడు = శిశువు; కాలన్ = కాలితో; తన్నినన్ = తన్నినప్పటికిని; కిన్క = కోపముతో; తోన్ = తోటి; అడువబోలునే = అణచివేయవచ్చా; క్రాగి = మండిపడి; తల్లి = మాతృ మూర్తి; కిన్; నాథ = ప్రభువా; సన్నము = చిన్నది; దొడ్డు = పెద్దది; ఐ = అన బడుతు; అడగి = ఒకదానికొకటి అణగి; కారణకార్యరూపము = కార్యకారణ సంబంధమే {కార్యకారణ సంబంధము - సృష్టిలో కార్యము కారణములకు

**అవినాభావ (విడదీయరాని) సంబంధము కలదు అన్నది ప్రమాణము}; రూపమున్ = స్వరూపముగా గలది; ఐన = అయినట్టి; ఈ = ఈ; సకలంబున్ = సమస్తము; నీ = నీ; కడుపు = గర్భము, అంతర్భాగము; లోనిదె = లోపలిదే; కాదె = కదా; పాపడన్ = శిశువును (గర్భంలోని); కాక = కాకపోతే; నేన్ = నేను; మఱి = ఇక; ఎవ్వడన్ = ఎవరిని.**

**భావము:- ఓ కృష్ణ ప్రభూ! కడుపులో ఉన్న పాపడు కాలితో తన్ని బాధపెట్టినా తల్లి కోపగించి కొట్టదు కదా. సూక్ష్మము, స్థూలము, అయి కారణ రూపము కార్యరూపము అయిన ఈసృష్టి సమస్తం నీ కడుపులోనిదే కదా. మరి నేను నీ పాపడనుకాక మరెవ్వడను?**

**10.1-559-క.**

**భూరి లయ జలధినిద్రిత**

**నారాయణనాభికమలనాళమున నజుం**

**డారఁయఁ బుట్టె ననుట నిజ**

**మో! రాజీవాక్ష! పుట్టె నోటు తలంపన్.**

**టీక:- భూరిలయ = విస్తారమైనలయ, విలయ; జలధిన్ = సముద్రము నందు {జలధి - జలము నిధి, కడలి}; నిద్రిత = నిద్రించెడి; నారాయణ = విష్ణుమూర్తియొక్క {నారాయణుడు - నారములు (నీరు, జీవులు) యందు నివసించువాడు, విష్ణువు}; నాభి = బొడ్డు; కమల = తమ్మి; నాళమునన్ = కాడ యందు; అజుండు = బ్రహ్మదేవుడు {అజుడు - పుట్టుకలేనివాడు, బ్రహ్మ}; అరయన్ = చక్కగా; పుట్టెను = జనించెను; అనుట = అని లోకులు చెప్పుట; నిజము = సత్యమే; ఓ = ఓ; రాజీవాక్ష = శ్రీకృష్ణా {రాజీవాక్షుడు - రాజీవము (పద్మము) లవంటి అక్షుడు (కన్నులు కలవాడు), విష్ణువు}; పుట్టెనోటు = ఓటమి కూడ పుట్టింది ; తలంపన్ = తరచిచూసినచో.**

భావము:- మహాప్రళయసమయంలో ఆ సముద్ర జలాల నడుమ నిద్రిస్తూ ఉన్న నారాయణుని బొడ్డుతామర నుండి బ్రహ్మదేవుడు పుట్టాడు అనే మాట సత్యం. ఆలోచిస్తే, నేను పుట్టినప్పుడే నాతోపాటే నా ఓటమి కూడా పుట్టిందేమో అనిపిస్తోంది..

10.1-560-సీ.

నళినాక్ష! నీ వాది నారాయణుండవు-
జలము నారము జీవచయము నార
మందు నీవుంట నీ యం దవి యుంటను-
నారాయణుండను నామ మయ్యె
సకల భూతములకు సాక్షి వధీశుండ-
వబ్ధి నిద్రించు నారాయణుఁడవు
నీ మూర్తి యిది నీకు నిజమూర్తి యనరాదు-
నళిననాళము త్రోవ నడచి మున్ను

10.1-560.1-తే.

కడఁగి నూతేండ్లు వెదికి నేఁ గాననయితి
నేకదేశస్థుఁడవు గా వనేక రుచివి
జగములోనుందు; నీలోన జగములుండు
నరుదు; నీ మాయ నెట్లైన నగుచు నుండు.

టీక:- నళినాక్ష = శ్రీకృష్ణా {నళినాక్షుడు - నళినము (కమలము)ల వంటి అక్షుడు (కన్నులు కలవాడు), విష్ణువు}; నీవు = నీవు; ఆది = ప్రపంచాదియైన {ప్రపంచము - 1పంచభూతములు 2పంచజ్ఞానేంద్రియములు 3పంచకర్మేంద్రియములు 4పంచతన్మాత్రలు 5పంచవాయువులు అనెడి పంచ

పంచకప్రవర్తకము}; నారాయణుండవు = నారాయణుడవు; జలము = జలము; నారము = నారము అనబడును; జీవ = సకలజీవుల; చయము = జాలము; నారము = నారము అనబడును; అందు = వానిలో; నీవు = నీవు; ఉంటన్ = ఉండుటచేత; నీ = నీ; అందున్ = లోపల; అవి = అవి; ఉంటను = ఉండుట చేత; నారాయణుడవు = నారాయణుడు {నారాయణుడు – శ్లో. ఆపోనారా ఇతి ప్రోక్తాః ఆపోవైనరసూనవః: ఆయనంతస్యతాః ప్రోక్తాః తేన నారాయణ స్మృతః:: – విష్ణుపురాణ ప్రమాణము}; అను = అనెడి; నామము = పేరు; అయ్యెన్ = కలిగినది; సకల = సమస్తమైన; భూతములకు = జీవులకు; సాక్షివు = అతీతముగా నుండి చూచువాడవు; అధీశుండవు = అధిపతివి; అబ్ధిన్ = సముద్రము నందు; నిద్రించు = నిద్రపోయెడి; నారాయణుడ = నారాయణుడవు; నీ = నీ; మూర్తి = స్వరూపము; ఇది = ఇది (గోపాలరూపము); నీకు = నీకు; నిజమూర్తి = స్వస్వరూపము; అనరాదు = అనితలపరాదు; నళిన = పద్మము; నాళము = కాడరంధ్రపు; త్రోవన్ = దారిలో; నడచి = వెళ్ళి; మున్ను = పూర్వము. కడగి = పూని ప్రయత్నించి; నూఱు = వంద (100); ఏండ్లు = సంవత్సరములు; వెదికితిన్ = అన్వేషించితిని; నేన్ = నేను; కాననైతి = చూడలేకపోతిని; ఏక = ఒకే; దేశస్థుడవు = తావుననుండెడివాడవు; కావు = కావు; అనేక = బహువిధ ముల; రుచివి = ప్రకాశించెడివాడవు; జగము = విశ్వము; లోన్ = అంతటను; ఉందు = ఉంటావు; నీ = నీ; లోనన్ = లోపల; జగములు = లోకములన్నియు; ఉండున్ = ఉండును; అరుదు = అద్భుతమైనది; నీ = నీయొక్క; మాయ = ప్రభావము, మహిమ; ఎట్లు = ఏవిధముగను; అయినన్ = అయినప్పటికి; అగుచున్ = జరుగుతునే; ఉండు = ఉండును.

భావము:– తామరరేకులవంటికన్నులకలవాడా! కృష్ణా! నీవు త్రిమూర్తులకూ మూలమైన ఆదినారాయణుడవు. జలములు, జీవరాసులు నారములు అని పిలవబడతాయి. నారములలో నీవు ఉండడం చేత, నీ యందు అవి ఉండడం

చేతా నీకు నారాయణుడు అనే పేరు మేము పెట్టుకున్నాం. భూతములు జీవరాశులు సర్వం వస్తూ పోతూ ఉంటే, నీవు సాక్షిగా ఉంటావు. నీవు వాటికి అన్నింటికీ అధిష్టానమైన ఈశ్వరుడవు. సముద్రంలో నిద్రించే నారాయణా అదే నీ నిజమైన రూపం అనడానికీ వీలులేదు. నేను పూర్వం తామరతూడు లోపల పయనిస్తూ నూరేండ్లు వెదకినా నీ అసలు రూపం ఏమిటో చూడలేకపోయాను కదా. నీవు ఒకచోట ఉంటావు అనడానికి వీలులేదు. నీవు ఎన్నో రూపాలు కాంతులు కలవాడవు. సృష్టిలో నీవు ఉంటావు నీ లోపల సృష్టి ఉంటుంది. నీ మాయాప్రభావంతో ఏ విధంగా నైనా ఉండగలవు.

10.1-561-మ.

**వినుమో; యీశ్వర! వెల్వలన్ వెలుఁగు నీ విశ్వంబు నీమాయగా**
**క నిజంబైన యశోద యెట్లుగనియెం? గన్నార నీ కుక్షిలోఁ**
**గనెఁబోఁ గ్రమ్మఱఁగాంచెనే? భవదపాంగశ్రీఁ బ్రపంచంబు చ**
**క్కనలోనౌ; వెలియౌను; లోనువెలియుంగాదేఁ దదన్యం బగున్;**

టీక:- వినుము = వినుము; ఓ = ఓ; ఈశ్వర = కృష్ణా; వెల్వలన్ = బయట, నీకంటె అన్యముగ; వెలుగు = ప్రకాశించెడి; ఈ = ఈ; విశ్వంబు = భువనములు; నీ = నీయొక్క; మాయ = మాయయే; కాక = అలా కాకుండ; నిజంబు = సత్యమైనది; ఐన = అయినచో; యశోద = యశోదాదేవి; ఎట్లు = ఏ విధముగా; కనియెన్ = చూచెను; కన్నారన్ = కళ్ళారా; నీ = నీ; కుక్షి = కడుపు; లోన్ = అందు; కనెబో = చూసింది అనుకో; క్రమ్మఱన్ = మరల; కాంచెనే = చూసినది కదా; భవత్ = నీయొక్క; అపాంగ = కడకంటిచూపుయొక్క; శ్రీ = ప్రకాశముచేత; ప్రపంచంబు = లోకములన్నియు; చక్కనన్ = ఒప్పుగా; లోన్ = లోపలున్నవి; ఔన్ = అగును; వెలియు = బయటనున్నవి; ఔన్ = అగును; లోను

= లోపలనున్నవి; వెలియున్ = బయటనున్నవికూడా; కాదా = లేదా; తత్ = వాటికి (లోని బయటికి); అన్యంబు = భిన్నమైనవి; అగున్ = అగును.

భావము:- ఓ శ్రీకృష్ణ ప్రభూ! వెలుపల కనిపిస్తున్న ఈ విశ్వం అంతా నీ మాయకాక నిజమే అయినట్లయితే, యశోద కనులారా నీ కడుపులో ఈ విశ్వాన్ని ఎలా చూడగలిగింది? చూసిందే అనుకో, మళ్లీ ఏనాడైనా చూడగలిగిందా? నీ కడగంటిచూపుతో ఈ ప్రపంచమంతా నీ లోపలది అవుతుంది; నీ బయటది అవుతుంది; లోపల వెలుపల కాకపోతే మూడవది అవుతుంది; లోపలా వెలుపలా కూడా అవుతుంది.

10.1-562-మ.

**ఒకఁడై యుంటివి; బాలవత్సములలో నొప్పారి తీ వంతటన్**
**సకలోపాసితులౌ చతుర్భుజులునై సంప్రీతి నేఁ గొల్వఁగాఁ**
**బ్రకటశ్రీ గలవాఁడ వైతి; వటుపై బ్రహ్మాండముల్ జూపి యొ**
**ల్లక యిట్లొక్కఁడవైతి; నీ వివిధ లీలత్వంబుఁ గంటిం గదే?**

టీక:- ఒక్కడు = అన్యరహితుడవు; ఐ = అయ్యి; ఉంటివి = ఉన్నావు; బాల = పిల్లలు; వత్సములు = దూడల; లోన్ = అందు; ఒప్పారితి = చక్కగా ఉండి; ఈవు =నీవు; అంతటన్ =సర్వత్ర; సకల = సర్వ ప్రాణులచేత; ఉపాసితులు = సేవించునవి; ఔ = అయిన; చతుర్భుజులున్ = నాలుగు చేతులు కల వాడను; ఐ =అయ్యి; సంప్రీతిన్ = మిక్కిలి ఇష్టముతో; నేన్ = నేను; కొల్వగాన్ = సేవించుచుండగా; ప్రకట = ప్రసిద్ధమైన; శ్రీ = సంపద; కల = కలిగిన; వాడవు = వాడివి; ఐతివి = అయినావు; అటపై = పిమ్మట; బ్రహ్మాండముల్ = విశ్వగోళములు; చూపి = జనింపజేసి, ప్రకటితముజేసి; ఒల్లక =అంగీకరించక; ఇట్లు; ఒక్కడవు = ఒంటరివి; ఐతి = అయిపోతివి; నీ = నీయొక్క; వివిధ = బహుళత్వము యొక్క; లీలత్వంబున్ = క్రీడను; కంటిన్ = చూసితిని; కదే = కదా.

భావము:- మొదట నీవు ఒక్కడవే ఉన్నావు; తరువాత గోపబాలురలో లేగలలో వెలుగొందేవు; ఆ తరువాత అందరిచేత నమస్కారాలు అందు కుంటున్న చతుర్భుజులైన విష్ణువుల రూపాలలో కనిపించి నన్ను ఆనందపరచి నీ వైభవాన్ని చక్కగా ప్రదర్శించావు; ఆ తరువాత బ్రహ్మాండాలన్నీ చూపించావు; తరువాత అది కాదని మళ్లీ ఇప్పుడు ఇలా ఒక్కడివిగా కనిపిస్తున్నావు; ఆహా! ఏమి నా భాగ్యం? ఇన్నాళ్ళకు ఇన్నిరకాల నీ లీలలు చూసాను.

10.1-563-క.

ఎఱిఁగిన వారికిఁ దోఁతువు
సెఱిఁ బ్రకృతిం జేరి జగము నిర్మింపఁగ నా
తెఱఁగున రక్షింపఁగ నీ
తెఱఁగున బ్రహరింప రుద్రు తెఱఁగున నీశా!

టీక:- ఎఱిగినవారి = బ్రహ్మజ్ఞానుల; కిన్ = కు; తోతువు = భావములో కనబడెదవు; సెఱిన్ = క్రమముగా; ప్రకృతిన్ = మాయతో; చేరి = కూడుకొని; జగమున్ = జగత్తును; నిర్మింపగాన్ = సృష్టించుటకు; నా; తెఱంగునన్ = విధముగను; రక్షింపన్ =పాలించుటకు; నీ =నీ(విష్ణుని); తెఱంగునన్ = విధ ముగను; ప్రహరింపన్ = సంహరించుటకు; రుద్రు = పరమ శివుని; తెఱగు నన్ = విధముగను; ఈశ = భగవంతుడా {ఈశుడు -సర్వనియామకుడు, విష్ణువు}.

భావము:- శ్రీకృష్ణ ప్రభూ! నీవు ప్రకృతితోకూడి జగత్తును నిర్మిస్తూ ఉండి నేను గానూ; రక్షిస్తూ ఉండి నీవు గానూ; లయం చేస్తూ ఉండి రుద్రుని గానూ జ్ఞానులకు నీవే తెలుస్తూ ఉంటావు.

10.1-564-వ.

అదియునుం గాక.

టీక:- అదియునన్ = అంతే; కాక = కాకుండగ.

భావము:- అంతే కాకుండా. . .

10.1-565-క.

జలచర మృగ భూసుర నర

కులముల జన్మించి తీవు కుజనులఁ జెఱుపన్

జెలిమిని సుజనుల మనుపను

దలపోయఁగ రాదు నీ విధంబు లనంతా!

టీక:- జలచర = మత్స్యకూర్మాది; మృగ = నరసింహాది; భూసుర = పరశురామాది; నర = రామాది; కులములన్ = వంశములలో; జన్మించితి = అవతరించితివి; ఈవు = నీవు; కుజనులన్ = దుష్టులను; చెఱుపన్ = సంహరించెడి; చెలిమిన్ = సుహృదముతో; సుజనులన్ = మంచివారిని; మనుపనున్ = కాపాడెడి; తలపోయగన్ = ఊహింప; రాదు = శక్యముకాదు; నీ = నీయొక్క; విధంబులున్ = వర్తనవిధములను; అనంతా = కృష్ణా {అనంతుడు - అంతములేని (కాల ప్రదేశ భావముల పరిమితులకు మీరిన) వాడు, విష్ణువు}.

భావము:- ఓ అనంత కృష్ణా! నీవలసే నీ మార్గాలు కూడా అంతం లేనివి. నీవు దుర్మార్గులను శిక్షించడానికే, సజ్జనులను ప్రేమతో రక్షించడానికి జలచరములుగా, మృగములుగా, బ్రాహ్మణులుగా, సాధారణ మానవులుగా ఎన్నో అవతారాలు ఎత్తావు. నీ మార్గాలు ఈవిధంగా ఉంటాయని ఊహించడం అసాధ్యం కదా.

10.1-566-ఆ.

మ్రబ్బుగొలిపి యోగమాయ నిద్రించిన

యో! పరాత్మభూమ! యోగిరాజ!

యే తెఱంగు లెన్ని యెంత యెచ్చోట నీ

హేల లెవ్వఁ డెఱుఁగు నీశ్వరేశ!

<u>టీక:-</u> మబ్బు = అజ్ఞానావరణలో (లోకమును); కొలిపి = కప్పి; యోగ = అవ్యక్తనామ {యోగమాయ – అవినాభావముగా భగవంతుని యందు వెలిగెడి అవ్యక్త నామక ప్రకృతి}; మాయన్ = ప్రకృతి యందు; నిద్రించిన = సుషుప్తిలో ఉండెడి; ఓ = ఓయీ; పరాత్మభూమ = కృష్ణా {పరాత్మభూమ – పరబ్రహ్మము తానే ఐన వాడు, విష్ణువు}; యోగిరాజ = కృష్ణా {యోగిరాజ – పరమయోగు లలో శ్రేష్ఠుడు, విష్ణువు}; ఏ = ఏ; తెఱంగులు = పద్ధతులు, విధానములు; ఎన్ని = ఎన్నిఎన్ని; ఎంత = ఎంతవరకు; ఎచ్చోట = ఏఏ చోటులందు; నీ = నీయొక్క; హేలలు = లీలలు (కలుగునని); ఎవ్వడు = ఎవరు మాత్రము; ఎఱుగున్ = తెలియగలరు; ఈశ్వరేశ = కృష్ణా {ఈశ్వరేశ – ఈశ్వరుల (సృష్టి స్థితి లయ తిరోధాన అనుగ్రహములను నియమించెడి బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివాదుల)కు ఈశ (నియామకుడా), విష్ణువు, భగవంతుడు}.

<u>భావము:-</u> ఓ పరమాత్మా! మహాయోగీశ్వరేశ్వరా! శ్రీకృష్ణా! నీ కన్న ఇతరులుగా జీవిస్తున్నజీవులందరూ ఎవరికివారు "నేను" అని మిగిలినవారిని "వారు" అని అనుకుంటున్నారు. వారందరిలో ఉన్న "నేను" నివాసంగా "నీవు" ఉన్నావు. దానిని దర్శించడానికి సాధన చేసేవారే యోగులు. వారి యోగంగా వారిలో వెలుగుతూ ఉన్నది నీవే మిగిలినవారు ఈ నీ యందు మరుపు కలిగి ఉంటారు. "తాము ఉన్నామనే తెలివి" మైకంగా కప్పుతుంది. ఈ మైకాన్నికలిగించి నీవు లోపల ఉంటే వారికి నీవు నిద్రిస్తున్నట్లు ఉంటావు. అలాంటి యోగనిద్రలో ఉన్న నీ లీలలు ఎవరికి తెలుస్తాయి? ఎప్పుడు తెలుస్తాయి? ఎక్కడ తెలుస్తాయి?

10.1-567-సీ.

అది గాన నిజరూప మనరాదు; కలవంటి-

దై బహువిధదుఃఖమై విహీన

సంజ్ఞానమై యున్న జగము సత్సుఖబోధ-

తనుఁడవై తుదిలేక తనరు నీదు

మాయచేఁ బుట్టుచు మనుచు లే కుండుచు-

నున్న చందంబున నుండుచుండు;

నొకఁడ; వాత్మఁడ; వితరోపాధి శూన్యుండ-

వాద్యుండ; వమృతుండ; వక్షరుండ;

10.1-567.1-ఆ.

వద్వయుండవును; స్వయంజ్యోతి; వాపూర్ణుఁ

డవు; పురాణపురుషుఁడవు; నితాంత

సౌఖ్యనిధివి; నిత్యసత్యమూర్తివి; నిరం

జనుఁడ వీవు; తలఁపఁ జనునె నిన్ను. ?

టీక:- అదిగాక = అంతేకాకుండ; నిజరూపము = అసలుస్వరూపము (నీది); అనరాదు = అనుట యుక్తము కాదు; కల = స్వప్నము, అసత్యము; వంటిది = లాంటిది; ఐ = అయ్యి; బహు = అనేక; విధ = రకముల; దుఃఖము = దుఃఖములు కలది; ఐ = అయ్యి; విహీన = పూర్తిగాలేని; సంజ్ఞానము = సరియగు జ్ఞానము కలది; ఐ = అయ్యి; ఉన్న = ఉండునట్టి; జగమున్ = లోకమును; సత్ = సత్యము {సత్యము - సర్వకాలసర్వావస్థలందు వికారములు లేనిది, సత్తు}; సుఖ = నిరతిశయానందము; బోధ = జ్ఞానము {బోధ - పరమాత్మ స్వస్వరూపమై తెలిసి యుండుట, జ్ఞానము}; తనుడవు = దేహముగా

కలవాడవు; ఐ = అయ్యి; తుదిలేక = అనంతమవు యై {తుదిలేక – ఆది (సృష్టి) స్థితి అంతము(లయము)లు లేకుండ, అనంతమై}; తనరు = వర్తించెడి; నీదు = నీయొక్క; మాయ = నీ యందలి ప్రకృతి; చేన్ = వలన; పుట్టుచున్ = జనించుచు; మనుచున్ = వృద్ధిపొందుతు; లేకుండుచున్ = నశించుచు, లయించుచు; ఉన్న = ఉన్నట్టి; చందంబునన్ = విధముగ; ఉండుచుండు = తోచుచుండును; ఒకడవు = ఒంటరివి {ఒకడవు – సజాతీయ విజాతీయ స్వ గత బేధశూన్యుఁడవు, విష్ణువు}; ఆత్ముడవు = ఆత్మగా నుండువాడవు {ఆత్మ – అతతితత్తద్వస్తురూపేణ వ్యాప్నోతీత్యాత్మా ఆతసాతత్యగమనే (వ్యుత్పత్తి), సర్వ వస్తు నామ రూపములతో మరియు అందు అంతట నిండి యున్నట్టిది}; ఇతర = స్వేతర, తనకుభిన్నమైన; ఉపాధి = ఉపాధిత్రయము {ఉపాధిత్రయము – స్థూల సూక్ష్మ కారణోపాధులు}; శూన్యుండవు = లేనివాడవు; ఆద్యుండవు = ఆది (మూల)కారణుడవు {ఆద్యుడ – విశ్వ సృష్టి స్థితి లయములకు మూలకారణుడు, విష్ణువు}; అమృతుండవు = ముక్తిప్రదాతవు {అమృతుడు – మోక్షమును యిచ్చుట ద్వారా జననమరణ చక్రమునుండి విముక్తి కలిగించువాడు, విష్ణువు}; అక్షరుండవు = శాశ్వతుడవు {అక్షరుడు – శ్లో. క్షరస్సర్వాణిభూతాని కూటస్థోక్షర ఉచ్యతే (గీత), సర్వ భూతముల నాశము పిమ్మటను యుండువాడు అక్షరుడు, విష్ణువు}; అద్వయుండవును = రెండవవస్తువులేనివాడవు {అద్వయుడు – శ్రు. ఏకమేవాద్వితీయంబ్రహ్మ, ఒక్కడై ఉండి తను తప్పించి రెండవ వస్తువు (స్వేతరము) లేనివాడు పరబ్రహ్మ అనబడును, విష్ణువు}; స్వయంజ్యోతివి = స్వయంప్రకాశకుడవు {స్వయంజ్యోతి – తన వెలుగుచేతనే ప్రకాశించువాడు, విష్ణువు}; ఆపూర్ణుడవు = అఖండస్వరూపుడవు {ఆపూర్ణుడు –అంతట నిండియుండు వాడు, అఖండ స్వరూపుడు, విష్ణువు}; పురాణ పురుషుడవు = ఆదిపురుషుడవు {పురాణపురుషుడు – సృష్టికి ఆది (ముందు) నుండి ఉన్నవాడు, విష్ణువు}; నితాంతసౌఖ్యనిధివి = నిత్యసౌఖ్యప్రదాతవు

**{నితాంతసౌఖ్యనిధి – నితాంత (క్షీణములేని) సౌఖ్య (ఆనందమునకు) నిధివి (స్థానమైనవాడు), విష్ణువు}; నిత్యసత్య మూర్తివి = శాశ్వతమైన సత్యస్వరూపుడవు {నిత్యసత్యమూర్తివి – నిత్య (శాశ్వతమైన) సత్య (సత్యమే) మూర్తి (తన స్వరూపైనవాడు), విష్ణువు}; నిరంజనుడవు = పరిశుద్ధుడవు {నిరంజనుడు – మచ్చలేని వాడు, పరిశుద్ధుడు}; ఈవు = నీవు; తలపన్ = ఇట్టి వాడవని ఊహించుటకు; చనునె = సాధ్యపడునా, కాదు; నిన్ను = నిన్ను.**

**భావము:–** కనుక ఇది నీ అసలు స్వరూపం అని అనటానికి లేదు. ఈ జగత్తు అంతా కల వంటిది, ఎన్నో రకాల దుఃఖాలు కలది "సత్య జ్ఞానం" నష్టపోవడంలో మునిగి ఉంది. అటువంటి జగత్తు అంతా నీ మాయ చేత పుట్టుతూ, ఉంటూ, లేకుండా పోతూ ఉన్నట్లు అనిపిస్తుంది. నీవు మాత్రం సత్తు, నిరతిశయానంద రూపుడవు. ఆది, అంతమూ అంటూ లేనివాడవు; నీవు అనితరుడవు, స్వేతరుడవు కనుక ఒక్కడివే; ఆత్మ స్వరూపుడవు; నీవు మరో శరీరం అక్కరలేని వాడవు; నీవే అంతటికీ మూలమైన వాడవు; అంతము లేని వాడవు; తరిగిపోవడం అంటూ ఉండని వాడవు; నీకు సాటి రెండవవాడు లేడు; నీ యంత నీవు వెలుగుతూ ఉన్నావు; మొదటినుండీ సర్వమూ నీ లోనే ఉన్నవాడవు; ప్రాచీను లలో కెల్లా ప్రాచీనతముడవు అయిన మొట్టమొదటి పురుషుడవు నీవే; నిరంతరమైన సంపూర్ణమైన సుఖమునకునిధియైనవాడవు నీవు; సమస్త సృష్టికీ నిత్యమూ ఆధారమైన సత్యము నీవే; షోడశకళా పూర్ణ స్వరూపుడవు నీవు. ఇటువంటి నిన్ను ఉత్తి భౌతిక మనస్సుతో భావించాలంటే సాధ్యమా?

**10.1–568–వ.**

**దేవా! యిట్టి నీవు జీవాత్మ స్వరూపకుఁడవు, సకలాత్మలకు నాత్మయైన పర మాత్మ స్వరూపకుఁడవు నని యెవ్వ రెఱుంగుదురు, వారు గదా గురువని యెడు దినకరునివలనఁ బ్రాప్తం**

బైన యుపనిషదర్థజ్ఞానంబను సునేత్రంబు నంజేసి సంసార మిథ్యాసాగరంబుఁ దరించిన చందంబున నుండుదురు; రజ్జు వందు రజ్జువని యెఱింగెడి యెఱుక లేకుండ, న య్యెఱుంగమి నది సర్ప రూపంబయి తోఁచిన పిదప నెఱింగిన వారివలన రజ్జువు రజ్జువని యెఱుం గుచుండ, సర్పరూపంబు లేకుండు కైవడి, నాత్మ యప్పరమాత్మయని యెవ్వరెఱుంగరు వారి కయ్యె ఱుంగమివలన సకల ప్రపంచంబు గలిగి తోఁచు; నాత్మ యప్పరమాత్మయని యెవ్వరెఱుంగుదురు, వారి కయ్యెఱుక వలనఁ బ్రపంచం బులేకుండు నజ్ఞాన సంభావిత నామకం బులైన సంసార బంధ మోక్షంబులు, జ్ఞాన విజ్ఞానంబుల లోనివి గావు; కావునఁ గమలమిత్రున కహోరాత్రంబులు లేని తెఱంగునఁ, బరిపూర్ణజ్ఞానమూర్తియగు నాత్మ యందు నజ్ఞా నంబులేమిని బంధంబును సుజ్ఞానంబులేమిని మోక్షంబు లే; వాత్మవయిన నిన్ను దేహాదికం బని తలంచియు, దేహాదికంబు నిన్నుఁగాఁదలంచియు, నాత్మ వెలి నుండు నంచు మూఢులు మూఢత్వంబున వెదకుచుందురు; వారి మూఢత్వంబుఁ జెప్ప నేల? బుద్ధిమంతులయి పరతత్వంబు గాని జడంబును నిషేధించుచున్న సత్పురుషులు తమ తమ శరీరంబుల యంద నిన్నరయుచుందు రదిగావున.

**టీక:-** దేవా = భగవంతుడా {దేవుడు – వ్యు. దీవ్యతి ఇతి దేవః, భూత భవిష్యద్వర్తమాన కాలములందు వెలుగుచుండువాడు, విష్ణువు}; ఇట్టి = ఇటు వంటి; నీవు = నీవు; జీవాత్మస్వరూపకు డవు = క్షేత్రజ్ఞుడవు {జీవాత్మస్వరూప కుడు – సకల జీవులలోన ఉండెడి ఆత్మయే తన రూపైన వాడు, శ్లో. ప్రకృతిం పురుషంచైవక్షేత్రం క్షేత్రమేవచ, ఇదంశరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే, ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతితద్విదః, క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత (భగవద్గీత), అర్జునా క్షేత్రమనగా ప్రకృతి ప్రకృతి అనగా దేహము దానిని తెలియువాడు క్షేత్రజ్ఞుడు ఆ క్షేత్రజ్ఞుడను నేనని తెలియుము, విష్ణువు}; సకల = సమస్తమైన; ఆత్మల = జీవాత్మల {జీవాత్మ – జీవులలో నుండెడి జీవి (ఆత్మ)}; కున్ = కి; ఆత్మ = శరీరివి; ఐన = అయినట్టి; పరమాత్మ = పరమాత్మ; స్వరూపకుడవు = తనరూపమైనవాడవు; అని = అని; ఎవ్వరు = ఎవరైతే; ఎఱుం గుదురు = తెలియుదురో; వారు = వారే; కదా = కదా; గురువు = గురువు {గురువు – శ్లో. గుశబ్దస్త్వంధకారస్స్యా ద్రుశబ్దస్తన్నివర్తకః, అంధకార నివృత్తి త్వాద్గురు రిత్యభిధీయతే, అజ్ఞానాంధకార నివారకుడైన కారణాచార్యుడు}; అనియెడి = అనెడి; దినకరుని = సూర్యుని {దినకరుడు – దినమును కలిగించు వాడు, సూర్యుడు}; వలన = వలన; ప్రాప్తంబు = లభించినది; ఐన = అయినట్టి; ఉపనిషత్ = వేదాంత; అర్థ = సారపు; జ్ఞానంబు = అపరోక్ష జ్ఞానము; అను = అనెడి; సు = మంచి; నేత్రంబునన్ = కన్నుల; చేసి = వలన; సంసార = సంసార మనెడి {సంసారము – శరీరేంద్రియాదులు నేననుట సంసారము}; మిథ్యా = అనృత; సాగరంబున్ = సముద్రమును; తరించిన = దాటిన; చందంబునన్ = విధమున; ఉండుదురు = ఉండెదరు; రజ్జువు = తాడు; అందు = ఎడల; రజ్జువు = తాడు; అని = అని; ఎఱింగెడి = తెలుసుకొనెడి; ఎఱుక = జ్ఞానము; లేకుండన్ = లేక; ఆ = ఆయొక్క; ఎఱుంగమిన్ = అజ్ఞానముచేత; అది = అది; సర్ప = పాము; రూపంబు = రూపము; అయి = కలిగి; తోచినన్ = కనపడిన;

పిదపన్ = ఆ తరువాత; ఎఱింగినవారి = తెలిసినవారి; వలన = వలన; రజ్జువు = తాడు; రజ్జువు = తాడే; అని = అని; ఎఱుంగుచుండన్ = తెలుస్తుండగా; సర్ప = పాము; రూపంబు = రూపము; లేకుండు = ఉండని; కైవడిన్ = విధముగనే; ఆత్మ = జీవుడు; ఆ = ఆ; పరమాత్మ = పరబ్రహ్మము {పరమాత్మ – సర్వోత్కృష్టమైన ఆత్మ, సచ్చిదానంద పరబ్రహ్మము}; అని = అని; ఎవ్వరు = ఎవరైతే; ఎఱుంగరు = తెలియరో; వారి = వారల; కిన్ = కు; ఆ = అట్టి; ఎఱుంగమి = అజ్ఞానము; చేత = వలన; సకల = సమస్తమైన; ప్రపంచంబు = లోకములు; కలిగి = ఉన్నట్లు; తోచున్ = కలబడును; ఆత్మ = జీవుడే; ఆ = ఆ; పరమాత్మ = పరబ్రహ్మము; అని = అని; ఎవ్వరు = ఎవరైతే; ఎఱుంగుదురు = తెలిసిన వారో; వారి = వారల; కిన్ = కు; ఆ = ఆ; ఎఱుక = జ్ఞానము; వలన = వలన; ప్రపంచంబు = ప్రపంచము; లేకుండున్ = అసత్తు అని తెలియును; అజ్ఞాన = తన్ను తా నెరుగక పోవుటచేత; సంభావిత = కలిగినవి; నామకంబులు = అనెడి పేరుగలవి; ఐన = అయినట్టి; సంసార = సంసారముతో; బంధ = బంధములు; మోక్షంబులు = విడుదలలు; జ్ఞాన = వేదాంతా ధ్యాయ జన్యజ్ఞానము; విజ్ఞానంబులు = అనుభవజన్యజ్ఞానములకు; లోనివి = చెందినవి; కావు = కావు; కావునన్ = అందుచేత; కమలమిత్రున్ = సూర్యుని {కమల మిత్రుడు – పద్మము లకు కావలసినవాడు, సూర్యుడు}; కున్ = కి; అహోరాత్రంబులు = రాత్రింబగళ్ళనెడితేడా; లేని = లేకపోయిన; తెఱంగునన్ = విధముగనే; పరిపూర్ణ = సంపూర్ణమైన; జ్ఞాన = తను తనేనసెడి జ్ఞానమే; మూర్తి = స్వస్వరూపమైనది; అగు = ఐన; ఆత్మ = ఆత్మ; అందున్ = ఎడల; అజ్ఞానంబు = అజ్ఞానము; లేమిని = లేకపోవుటచేత; బంధంబును = బంధములు; సుజ్ఞానంబు = ఎరుక; లేమిని = లేకపోవుటచేత; మోక్షంబున్ = విడుద లగుటలు; లేవు = ఉండవు; ఆత్మవు = పరబ్రహ్మమవు; అయిన = ఐనట్టి; నిన్ను = నిన్ను; దేహ = శరీరము; ఆదికంబు = మొదలగునవి; అని = అని; తలంచియు = ఎంచుకొనినను; దేహ

**= శరీరము; ఆదికంబు = మొదలగునవి; నిన్ను = నీవే; కాన్ = అయినట్లుగా; తలంచియున్ = భావించి; ఆత్మ = ఆత్మ; వెలిన్ = వేరేగా; ఉండున్ = ఉండును; అంచున్ = అనుచు; మూఢులు = తెలివిలేనివారు; మూఢత్వంబునన్ = మూర్ఖముగా; వెదుకుచుందురు = శోధించుచుంటారు; వారి = వారలయొక్క; మూఢత్వంబున్ = తెలివితక్కువను; చెప్పనేల = తలచుట ఎందుకు; బుద్ధిమంతులు = ఆత్మజ్ఞానము కలవారు; అయి = ఐ; పరతత్వంబు = పరబ్రహ్మము; కాని = కానట్టి; జడంబును = చైతన్యముకానిదానిని; నిషేధించు చున్న = వదలివేయుచున్న; సత్పురుషులు = విజ్ఞానులు; తమతమ=వారియొక్కమాత్రమే; శరీరంబుల = దేహములు; అందే = లోనే; నిన్ను = నిన్ను; అరయుచుందురు = చూచుచుందురు; అదిగావున = అందుచేత.**

**భావము:- ఓ దేవా! శ్రీకృష్ణా! ఇట్టి నీవు జీవాత్మస్వరూపుడ వని; ఆత్మలు అన్నింటికీ ఆత్మ యైన పరమాత్మ స్వరూపుడ వని గ్రహించ గలిగినవారు, గురువు అనే సూర్యుని వలన ఉపనిషత్తుల జ్ఞానం అనే కన్నును పొందినవారు. అటువంటివారు సంసార మనే ఈ మాయాసముద్రాన్ని దాటినట్లు కనిపిస్తారు. అది త్రాడే అను జ్ఞానం లేనప్పుడు, దానిని చూస్తే అది పాములా కనిపిస్తుంది. తరవాత తెలిసినవారి వలన అది త్రాడే అని తెలుసుకున్న తర్వాత ఇంక పాము అనే రూపం ఉండదు. అలాగే తనలో నున్న ఆత్మయే పరమాత్మ అని తెలియని వారికి, ఈ ప్రపంచ మంతా ఉన్నట్లుగా కనిపిస్తుంది. తరువాత తాను ఆత్మ అని ఆత్మయే పరమాత్మ అని తెలిసిన తరువాత వారికి "అజ్ఞానం కారణంగా ఈ ప్రపంచమంతా తనకు కనిపించినదే తప్ప నిజంగా అక్కడ ఏమీ లే" దని తెలుస్తుంది. సంసార బంధము అనేది అజ్ఞానం వలన పుట్టినది. మోక్షం అనేది కూడా అజ్ఞానం వలననే పుట్టినదే. ఈ బంధ మోక్షాలు జ్ఞాన విజ్ఞానాల లోనికి చేరవు. సూర్యుని చుట్టూ భూమి పరిభ్రమణం వలన మనకు రాత్రింబవళ్ళు ఉన్నాయి గానీ సూర్యునికి రాత్రి పగలు లేవు అలాగే సంపూర్ణ**

డైన, జ్ఞాన స్వరూపు డైన ఆత్మకు అజ్ఞానం లేనందువలన బంధ మోక్షాలు ఉండవు. ఆత్మ పైన నిన్ను శరీర మని శరీరాదులు నీ వని భావించేవారు శరీరానికి బయట ఎక్కడో ఆత్మ ఉంటుంది అనుకునేవారు మూఢులు. అంటే మోహం చెందిన వారు. అ మోహంలోనే పడి ఆత్మ కోసం వెతుకులాడుతూ ఉంటారు. వారి మూఢత్వం ఇంత అని చెప్పడ మెందుకు. జడపదార్థంలో కూడా పరమాత్మనే దర్శనం చేసేవారు బుద్ధిమంతు లైన సత్పురుషులు. వారు తమ శరీరాల లోనే నిన్ను చూడగలుగుతారు. అందుచేత...

10.1-569-శా.

**దేవా! నీ చరణప్రసాదకణలబ్ధిం గాక లేకున్న నొం**
**డేవెంటం జను నీ మహామహిమ నూహింపంగ నెవ్వారికిన్?**
**నీ వారై చనువారిలో నొకఁడనై నిన్ గొల్చు భాగ్యంబు నా**
**కీవే యిప్పటి జన్మమం దయిన నొం డెం దైన నో! యీశ్వరా!**

టీక:- దేవా = కృష్ణా {దేవా - స్వయంప్రకాశకుడు, విష్ణువు}; నీ = నీ యొక్క; చరణ = పాదముల; ప్రసాద = అనుగ్రముయొక్క; కణ = రేణుపైన; లబ్ధిన్ = దొరకుటచేత; కాక = తప్పించి; లేకున్న = లేకపోతే; ఒండేవెంటన్ = మరింకేవిధముగనైన; చనున్ = వీలగునా, కాదు; నీ = నీయొక్క; మహా = గొప్ప; మహిమన్ = మహత్మ మును; ఊహింపగన్ = ఊహించుటకైనను; ఎవ్వారికిన్ = ఎవరికైనను; నీ = నీకు; వారు = చెందినవారు; ఐ = అయ్యి; చను = వర్తించెడి; వారి = వారలలో; లోన్ = అందు; ఒకడను = ఒకానొకడను; ఐ = అయ్యి; నిన్ = నిన్ను; కొల్చు = సేవించెడి; భాగ్యంబున్ = అదృష్టమును; నా = నా; కున్ = కు; ఈవే = ఇమ్ము; ఇప్పటి = ప్రస్తుత; జన్మము = పుట్టుక; అందున్ = లోన; అయినన్ = అయినప్పటికి; ఒండు = మరొకటి (జన్మము); ఎందు = దేనిలో;

ఐనన్ = అయినప్పటికి; ఓ = ఓ; ఈశ్వరా = శ్రీకృష్ణా {ఈశ్వరుడు – సర్వ కర్త, విష్ణువు}.

భావము:– ఓ శ్రీకృష్ణ ప్రభూ! నీ మహోన్నత మహిమను ఊహించా లంటే నీ పాద ధూళికణ ప్రాప్తి వలన మాత్రమే సాధ్యం తప్ప మరి ఎవరికి సాధ్యం కాదు. నీవారుగా జీవించ గల ధన్యులలో నేను ఒకడిగా ఉండి నిన్ను సేవించుకునే భాగ్యాన్ని నాకు ప్రసాదించు. ఈ జన్మలో కాకపోతే మరో జన్మలో నైనా సరే ఆ మహాభాగ్యం నాకు ప్రసాదించు.

10.1-570-త.

**క్రతుశతంబునఁ బూర్ణ కుక్షి వి; గాని నీ విటు క్రేపులున్**

**సుతులునై చనుఁబాలు ద్రావుచుఁ జొక్కి యాడుచుఁ గౌతుక**

**స్థితిఁ జరింపఁగఁ దల్లులై విలసిల్లు గోవుల గోపికా**

**సతుల ధన్యత లెట్లు చెప్పగఁ జాలువాఁడఁ గృపానిధీ!**

టీక:– క్రతు = యజ్ఞములు; శతంబునన్ = నూటివలనను (100); పూర్ణకుక్షి వి = నిండిన కడుపు గలవాడవు {పూర్ణకుక్షి వి – నిండిన కడుపు కల వాడవు, తృప్తుడవు}; కాని = కానట్టి; నీవు = నీవు; ఇటు = ఈ విధముగ; క్రేపులున్ = దూడలుగ; సుతులున్ = బాలురుగ; ఐ = అయ్యి; చనుబాలు = స్తన్యము; త్రావుచున్ = తాగుచు; చొక్కి = సోలి, మైమరచి; ఆడుచున్ = క్రీడించుచు; కౌతుక = కుతూహలము కలిగిన; స్థితిన్ = విధముగ; చరింపన్ = మెలగుచుండగ; తల్లులు = తల్లిపాత్రలు పోషించుచు; ఐ = ఉండి; విలసిల్లు = ప్రకాశించెడి; గోవుల = ఆవులయొక్క; గోపికా = యాదవ; సతుల = ఇల్లాళ్ళ యొక్క; ధన్యతన్ = కృతార్థత్వములు; ఎట్లు = ఏ విధముగా; చెప్పగజాలు = స్తుతించగలిగిన; వాడన్ = వాడిని; కృపానిధీ = దయాసాగరా.

భావము:- ఓ కృపానిధీ! కృష్ణా! నీవు యజ్ఞపురుషుడవు; వందల కొద్దీ యజ్ఞాలు నీ కడుపులో దాగి ఉన్నాయి; అయినా నీవు ఈ విధంగా లేగలుగా, గోపాలురుగా రూపాలు ధరించి ఉన్నావు; గోవుల వద్ద గోపికల వద్ద నీవు పాలు త్రాగి పరవశిస్తూ, ఆటలుఆడుతూ, ఎంతో ఉత్సాహంతో సంచరి స్తున్నావు; నీకు తల్లులు కాగలిగిన ఆ గోవులు గోపికలు ఎంత పుణ్యం చేసుకున్నారో ఎలా చెప్పగలను; నీవు కరుణామయుడవు కనుకనే ఆ గోవులు గోపికలు అంత ధన్యత్వాన్ని అందుకోగలిగారు.

10.1-571-క.

పరిపూర్ణంబుఁ బురాణముఁ

బరమానందంబునైన బ్రహ్మమె చెలికాఁ

డరు దరుదు నందఘోష

స్థిరజనముల భాగ్యరేఖ చింతింపంగన్

టీక:- పరిపూర్ణంబున్ = అంతట నిండి ఉన్నది; పురాణంబున్ = సృష్ట్యాదినుండి ఉన్నది; పరమానందంబున్ = నిరతిశయ సుఖ రూపము; ఐన = అయినట్టి; బ్రహ్మమె = పరబ్రహ్మమే స్వయముగా; చెలికాడు = స్నేహితుడు; అరుదరుదు = అత్యద్భుతము; నంద = నందునియొక్క; ఘోష = వ్రేపల్లెలో; స్థిర = నివసించెడి; జనములు = వారియొక్క; భాగ్యరేఖ = అదృష్టము; చింతింపగన్ = తరచిచూసినచో.

భావము:- అంతా తన యందు ధరించినది; అన్నిటికి మొదటిది; పరమానంద స్వరూపము అయిన పరబ్రహ్మమే; ఈ నందగోకులం లోని జనులకు చెలికాడు అయినా డట; ఆహా! ఇది ఎంత అపురూప మైన విషయం. వీరి భాగ్యరేఖ ఎంత అద్భుత మైనదో ఊహించడం కూడా విధాత నైన నాకే సాధ్యం కావడం లేదు.

10.1-572-సీ.

**ఏకదశేంద్రియాధీశులు చంద్రాదు-**

**లేను ఫాలాక్షుండు నిట్లు గూడఁ**

**బదుమువ్వురము సెడపడక యింద్రియ పాత్ర-**

**ముల నీ పదాంభోజముల మరంద**

**మమృతంబుగాఁ ద్రావి యమర నేకైకేంద్రి-**

**యాభిమా నులుమయ్యు నతి కృతార్థ**

**భావుల మైతిమి; పరఁగ సర్వేంద్రియ-**

**వ్యాప్తులు నీ మీఁద వ్రాల్చి తిరుగు**

10.1-572.1-తే.

**గోప గోపికాజనముల గురు విశిష్ట**

**భాగ్య సంపదఁ దలపోసి ప్రస్తుతింప**

**నలవిగా దెవ్వరికి నైన నంబుజాక్ష!**

**భక్తవత్సల! సర్వేశ! పరమపురుష!**

టీక:- ఏకాదశేంద్రియ = ఏకదశేంద్రియములకు {ఏకదశేంద్రియములు - జ్ఞానేంద్రియములు (5) కర్మేంద్రియములు (5) మరియు మనస్సు మొత్తం (11)}; అధీశులు = అధిదేవతలు; చంద్ర = చంద్రుడు {చంద్రాదులు - 1చంద్రుడు మనసునకు, 2దిక్కులు చెవికి, 3గాలి చర్మమునకు, 4సూర్యుడు కంటికి, 5వరుణుడు నాలుకకు, 6అశ్వినులు ముక్కునకు, 7అగ్ని వాక్కునకు, 8దేవేంద్రుడు హస్తమునకు, 9విష్ణువు పాదమునకు, 10మృత్యువు గుదమునకు, 11ప్రజాపతి గుహ్యమునకు అధిదేవతలు}; ఆదులు = మున్నగువారు; ఏనున్ = బ్రహ్మదేవుడనునేను {బ్రహ్మ - బుద్ధింద్రియమునకు అధిదేవత}; ఫాలాక్షుండును

= పరమశివుడు {శివుడు – అహంకారేంద్రియము నకు అధిదేవత}; ఇట్లు = ఇలా; కూడన్ = కలుపుకొనినచో; పదముప్పురము = పదముగ్గురము (13); ఎడపడక = ఎడతెగక; ఇంద్రియ = ఇంద్రియములు అనెడి; పాత్రములన్ = పాత్రల యందు; నీ = నీయొక్క; పద = పాదములు అనెడి; అంభోజముల = పద్మములందలి; మరంద = మకరందము అనెడి; అమృతంబున్ = అమృత మును (దుఃఖరహితస్థితి); కాన్ = ఐనట్లు; త్రావి = తాగి (స్వీకరించి); అమరన్ = ఒప్పియుండి; ఏకైక = ఒకే; ఇంద్రియ = ఇంద్రియములకు; అభిమానులము = అభిమా నించువారము; అయ్యున్ = అయినప్పటికి; అతి = మిక్కిలి; కృతార్థ = ధన్యమైన; భావులము = కలిగినవారము; ఐతిమి = అయినాము; పరగన్ = ప్రసిద్ధముగా; సర్వ = ఎల్ల; ఇంద్రియ = ఇంద్రియ ములయొక్క; వ్యాప్తులున్ = వర్తనలను; నీ = నీ; మీదన్ = అందే; వాల్చి = ఉంచి; తిరుగు = మెలగెడి.

గోప = యాదవులు, గొల్లలు; గోపిక = గోపికలు, గొల్లస్త్రీలు; జనముల = అందరి; గురు = గొప్ప; విశిష్ట = శ్రేష్ఠమైన; భాగ్య = అదృష్టము అనెడి; సంపద = కలిమి; తలపోసి = విచారించి; ప్రస్తుతింపన్ = స్తోత్రముచేయుటకు; అలవి = శక్యము; కాదు = కాదు; ఎవ్వరి = ఎవరి; కిన్ = కి; ఐనన్ = అయినప్పటికి; అంబుజాక్ష = పద్మాక్షా, కృష్ణా {అంబుజాక్షుడు - అంబుజము (పద్మము) వంటి అక్షుడు (కన్నులు కలవాడు), విష్ణువు}; భక్తవత్సల = కృష్ణ {భక్తవత్సలుడు - భక్తుల ఎడ వాత్సల్యము కలవాడు, విష్ణువు}; సర్వేశా = కృష్ణ {సర్వేశుడు - సర్వులకు నియామకుడు, విష్ణువు}; పరమపురుష = కృష్ణ {పరమపురుషుడు - పురుషులలో (కారణభూతులలో) ఉత్తముడు (మూలమైనవాడు), విష్ణువు}.

భావము:- సర్వేశ్వరా! పరమపురుషా! పుండరీకాక్షా! చంద్రుడు మొదలైన పదకొండు ఇంద్రియాలకు అధిపతులు, నేను, శివుడు ఈ పదముగ్గురమే నీ యందు ఏమరుపాటు చెందకుండా ఉన్న వారము. మేము మా మా ఇంద్రియాలు అనే పాత్రలలో నీ పాదపద్మముల నుండి పుట్టిన

మకరందాన్ని అమృతం వలె త్రాగుతున్నాము. కనుకనే ఒక్కక్క ఇంద్రియానికి వేరువేరుగా అధిపతులం అయ్యాము. ఎంతో ధన్యులం అయ్యాము. అలాంటిది అన్ని ఇంద్రియాల ప్రవృత్తులూ నీ పైననే ఉంచుకో గలుగుతున్న గోపికల భాగ్యం ఎంత గొప్పదో ఎంత విశిష్ట మైందో దానిని గురించి ఆలోచించడానికి గాని స్తోత్రం చేయడానికి గాని ఎవరికీ సాధ్యం కాదు. నీవు భక్తుల యెడల వాత్సల్యం కలవాడవు కనుకనే గోపగోపికా జనాలకు ఇంతటి భాగ్యం లభించింది.

10.1-573-శా.

**ఏలా బ్రహ్మపదంబు? వేదములకున్ వీక్షింపఁగారాని ని**
**న్నీలోకంబున నీ వనాంతరమునం దీ మందలోఁ గృష్ణ యం**
**చాలాపాది సమస్త భావములు నీ యందే సమర్పించు నీ**
**వ్రేలం దొక్కని పాదరేణువులు పై వేష్టించినం జాలదే?**

టీక:- ఏలా = ఎందులకు; బ్రహ్మ = బ్రహ్మదేవు డనెడి; పదంబు = పదవి, అధికారస్థానము; వేదముల్ = చతుర్వేదముల కైనను {చతుర్వేదములు - 1ఋగ్వేదము 2యజుర్వేదము 3సామ వేదము 4అధర్వణవేదము}; వీక్షింపగాన్ = దర్శించుటకు; రాని = శక్యముగాని; నిన్ను = నిన్ను; ఈ = ఈ; లోకంబునన్ = లోకము నందు; ఈ = ఈయొక్క; వన = అడవి; అంతరము = లోపల; అందున్ = అందు; ఈ = ఈ; మంద = గొల్లపల్లె; లోన్ = లోపల; కృష్ణ = కృష్ణుడా; అంచున్ = అనుచు; ఆలాప = ముచ్చటలాడుట; ఆది = మున్నగు; సమస్త = ఎల్ల; భావములున్ = వ్యాపారములు; నీ = నీ; అందే = ఎడలనే; సమర్పించు = భక్తిగా నడపించెడి; ఈ = ఈ; వ్రేలన్ = గోపాలుర; అందున్ = లో; ఒక్కని = ఏదో ఒకని; పాద = కాలి; రేణువులు = దుమ్ముకణములు; పైన్ = మీద (శరీరముమీద); వేష్టించినన్ = కమ్ముకొన్నను; చాలదే = సరిపోదా, సరిపోతుంది కదా.

భావము:- వేదాలు నిన్నుగురించి చెబుతాయే గాని. నిన్ను దర్శించ లేవు కదా. అటువంటి నిన్ను ఈ భూలోకంలో ఈ అడవిలో ఈ గోకులంలో సహచరుడుగా పొందగలిగారు. ఈ గోపకులు "కృష్ణా! కృష్ణా!" అంటూ మాటల దగ్గర నుంచీ అన్ని భావాలు నీ యందే సమర్పించుకుంటున్నారు. ఈ గొల్లలలో ఒక్కడి పాదరేణువులలో ఒక్క కణం నా శిరస్సు పైన ధరించగలిగితే చాలదా? ఈ బ్రహ్మ పదవి ఎందుకయ్యా నాకు.

10.1-574-మ.

**నిను హింసించిన పూతనాదులకు మున్ నీ మేటి సంకేత మి**
**చ్చిన నీకుం బుర దార పుత్ర గృహ గో శ్రీ ప్రాణ దేహాదు లె**
**ల్లను వంచింపక యిచ్చు గోపకులకున్ లక్షింప నే మిచ్చెదో?**
**యని సందేహము దోఁచుచున్నది ప్రపన్నానీకరక్షామణీ!**

టీక:- నినున్ = నిన్ను; హింసించినన్ =చంపవచ్చిన; పూతన = పూతన; ఆదులు = మొదలగు వారి; కున్ = కి; మున్ = ఇంతకుముందు; నీ = నీయొక్క; మేటి = గొప్ప; సంకేతము = పరమ పదమును; ఇచ్చిన = ప్రసాదించినట్టి; నీ = నీ; కున్ = కు; పుర = పట్టణము; దార = భార్యలు; పుత్ర = కొడుకులు; గృహ = నివాసములు; గో = ఆవులు; శ్రీ = సంపదలు; ప్రాణ = పంచప్రాణులు; దేహ = శరీరములు; ఆదులు = మున్నగునవి; ఎల్లను = సర్వము; వంచింపక = వెనుదీయక; ఇచ్చు = సమర్పించెడి; గోపకుల్ = యాదవుల; కున్ = కు; లక్షింపన్ = విచారించినచో; ఏమి = ఏమిటి; ఇచ్చెదో = ప్రసాదించెదవో; అని = అని; సందేహము = అనుమానము; తోచుచున్నది = కలుగుచున్నది; ప్రపన్నానీకరక్షామణీ = శ్రీకృష్ణా {ప్రపన్నానీకరక్షామణి - ప్రపన్న (ప్రపత్తిని [భక్తులు చేయు శరణాగతిని] పొందిన వారి) అనీక (సమూహమును, గుంపును) రక్షా (రక్షించునట్టి) మణి (శ్రేష్ఠుడు), విష్ణువు}.

భావము:- భక్తులకు అందరికి రక్షామణిపైన ఓ కృష్ణా! నిన్ను చంప దలచి వచ్చిన పూతన మొదలైన రాక్షసులకే అద్భుతమైన మోక్షాన్ని ప్రసాదిం చావు. అటువంటి నీకు గోపకు లందరూ తమ ఊరిని, భార్యలను, పుత్రులను, ఇండ్లను, గోవులను, స్త్రీలను, ప్రాణాన్ని, శరీరం మొదలైన వాటిని అన్నింటినీ సందేహం లేకుండా సమర్పణ చేసుకున్నారు. అటువంటి వారికి ఆ మోక్షం కన్నా ఇంకా ఎక్కువైనది ఏమి ఇస్తావో అని నాకు సందేహం కలుగుతూ ఉంది.

10.1-575-క.

**దేహము కారాగేహము**

**మోహము నిగళంబు; రాగముఖరములు రిపు**

**వ్యూహములు భక్తితో ని**

**న్నూహింపఁని యంతదడవు నో! కమలాక్షా!**

టీక:- దేహము = శరీరము; కారాగేహము = చెరసాల వంటిది; మోహము = అత్యాసక్తి, వలపు {మోహము - శరీరాదులు నేను అనుకోనుట}; నిగళంబు = సంకెళ్ళు; రాగముఖరంబులు = రాగద్వేషములు {రాగద్వేషములు - 1రాగము 2ద్వేషము 3కామము 4క్రోధము 5లోభము 6మోహము 7మదము 8మాత్సర్యము 9ఈర్ష్య 10అసూయ 11దంభము 12దర్పము 13అహంకారము}; రిపు = శత్రు; వ్యూహములు = సేనలు; భక్తి = అనన్యభక్తి; తోన్ = తోటి; నిన్ను = నిన్ను; ఊహింపని = తలచని; అంత = అంత; తడవునే = సేపు; ఓ = ఓ; కమలాక్షా = పద్మాక్షా, కృష్ణా.

భావము:- కమలములవంటి కన్నులకలకృష్ణా! భక్తితో నిన్ను స్మరించనంత కాలమూ ఎవరికైనా శరీరము కారాగారము; మోహము అనేది సంకెళ్ళూ; రాగద్వేషాదులు శత్రువ్యూహాలూ; అవుతాయి.

10.1-576-ఆ.

ఆశ్రయించు జనుల కానందసందోహ

మీఁ దలంచి వివిధ హేలతోడ

నప్రపంచకుండ వయ్యుఁ బ్రపంచంబు

పెలయఁజేయు దీవు విశ్వమూర్తి!

టీక:- ఆశ్రయించు = నిన్ను ఆశ్రయించునట్టి; జనుల్ = వారల; కిన్ = కు; ఆనంద = సంతోషములు; సందోహము =సమాహారము; ఈన్ = ఇయ్యవలెనని; తలచి = భావించి; వివిధ = అనేక రకముల; హేల =లీలల; తోడన్ = తోటి; అప్రపంచకుండవు = ప్రపంచాతీతుడవు; అయ్యున్ = అయినప్పటికిని; ప్రపంచంబున్ = జగత్తును; పెలయజేయుదువు = అలర జేయుదువు; ఈవు = నీవు {విశ్వము - శ్రు. విశ్వశబ్దస్య ఓంకారోభిధీయతే, శ్లో. ఓమితి బ్రహ్మ ఓమితీదగం సర్వం ఓమిత్యేకాక్షరం బ్రహ్మ (ఉపనిషత్) శ్రు. ఓం భూః ఓంభువః ఓంగంసువః ఓంమహః ఓంజనః ఓంతపః ఓంగం సత్యం}; విశ్వమూర్తి = శ్రీకృష్ణా {విశ్వమూర్తి - విశ్వ (జగత్తు, ఓంకార) మూర్తి (స్వరూపుడు), శ్రీశ్రీశంకరభాష్యం విష్ణుసహస్రనామాలు 717వ నామం, శ్లో॥ విశ్వమూర్తి ర్మామూర్తి ర్దీప్తమూర్తి రమూర్తిమాన్। అనేకమూర్తి రవ్యక్త శ్శతమూర్తి శ్శతాననః॥}.

భావము:- విశ్వమంతటా అంతర్యామిగా ఉన్న ఓ విశ్వమూర్తీ! నీకు ప్రపంచం అంటూ నిజంగా లేదు అయినా నిన్ను భక్తితో ఆశ్రయించిన జనులకు ఆనందాన్ని ప్రసాదించటానికి ఎన్నో విలాసాలతో ఈ ప్రపంచాన్ని సృష్టించి, నడుపుతూ ఉంటావు.

10.1-577-క.

**ఎఱిఁగిన వార లెఱుంగుదు**

**రెఱుఁగన్ బహు భాషలేల? నీశ్వర! నీ పెం**

**పెఱుఁగ మనోవాక్కులకున్**

**గుఱిచేయం గొలది గాదు గుణరత్ననిధీ!**

టీక:- ఎఱిగినవారలు = బ్రహ్మవేత్తలు {బ్రహ్మవేత్తలు - శ్రు. బ్రహ్మై వేద బ్రహ్మవిద్భవతి, బ్రహ్మవేత్తలు బ్రహ్మమే (నీ స్వరూపులే) ఐయున్నారు}; ఎఱుంగుదురు = తెలిసికొందురు; ఎఱుగన్ = తెలిసికొనుటకు; బహుభాషలు = ఇన్నిమాటలు; ఏలన్ = ఎందుకు; ఈశ్వర = సర్వనియామకా; నీ = నీయొక్క; పెంపున్ = ఘనతను; ఎఱుగన్ = తెలిసికొనుటకు {తెలియరానివాడు - శ్రు. నతత్ర చక్షుఃగచ్ఛతి నవాగ్గచ్ఛతి నోమనః, నీవు ఇట్టివాడవు అని చూపులచేత మాటలచేత ఊహలచేత తెలియ శక్యము కాదు}; మనస్ = మనసు; వాక్కుల = మాటల; కున్ = చేతను; గుఱిచేయన్ = లక్షించుటకు, అందుకొన; కొలది = శక్యము; కాదు = కాదు; గుణరత్ననిధీ = కృష్ణా {గుణరత్ననిధీ - సర్వజ్ఞత్వము సర్వేశ్వరత్వము సర్వభోక్తృత్వము మున్నగు గుణములలో రత్నముల (శ్రేష్ఠమైనవాని)కి నిధివంటివాడు లేదా రత్ననిధి (సముద్రము వంటివాడు), విష్ణువు}.

భావము:- శ్రీకృష్ణ పరమశ్వరా! సర్వోత్తమ గుణాలకు నిధి వంటివాడా! నిన్ను తెలియవలె నంటే అది ఎలాగో జ్ఞానులకే తెలుసు. ఇన్ని మాట లెందుకు. నీ గొప్పతనం తెలుసుకోవడానికి మనస్సు గాని వాక్కు గాని ఉపయోగించడం కష్టంగా ఉంది.

10.1-578-క.

**సర్వము నీవ యెఱుంగుదు**

**సర్వవిలోకనుఁడ వీవ; జగదధిపతివిన్;**

**సర్వాపరాధి నను నో!**

**సర్వేశ! యనుగ్రహింపు; చనియెద నింకన్.**

టీక:- సర్వము = సమస్తమును; నీవ = నీవే; ఎఱుంగుదు = తెలియువాడవు; సర్వ = సమస్త మును; విలోకనుడవు = చక్కగా చూచువాడవు; ఈవ = నీవే; జగత్ = విశ్వమంతటికి; అధిపతివిన్ = ఈశుడవు; సర్వ = ఎల్ల; అపరాధిన్ = తప్పులు చేసిన వాడను; ననున్ = నన్ను; ఓ = ఓ; సర్వేశ = కృష్ణా {సర్వేశుడు - సర్వమునకు ప్రభువైనవాడు, విష్ణువు}; అనుగ్రహింపు = కరుణ చూపుము; చనియెదన్ = వెళ్ళిపోయెదను; ఇంకన్ = ఇక.

భావము:- సర్వేశ్వరా! శ్రీకృష్ణా! సర్వం నీవే ఎరుగుదువు. నీవు అన్నీ చూడగలిగిన వాడవు. ఈ జగత్తు అంతటికీ అధిపతివి నీవే. అన్ని విధాలైన అపచారాలు చేసిన నన్ను మన్నించి అనుగ్రహించు. నేనింక సెలవు తీసుకుంటాను.

10.1-579-క.

**జిష్ణు! నిశాటవిపాటన!**

**వృష్ణికులాంభోజసూర్య! విప్రామర గో**

**వైష్ణవ సాగర హిమకర!**

**కృష్ణా! పాషండధర్మగృహదావాగ్నీ!**

టీక:- జిష్ణు = కృష్ణా {జిష్ణుడు - జయశీలుడు, విష్ణువు}; నిశాట విపాటన = కృష్ణా {నిశాటవిపాటన - నిశాట (రాత్రించరుల, రాక్షసుల)ను విపాటన (పడగొట్టువాడు), విష్ణువు}; వృష్ణికులాంభోజసూర్య = కృష్ణా {వృష్ణికు

లాంభోజసూర్యుడు -వృష్ణి అనెడి కుల (వంశము) అనెడి అంభోజ (పద్మము)నకు సూర్యునివంటివాడు, కృష్ణుడు}; విప్ర = బ్రాహ్మణులు; అమర = దేవతలు; గో = గోవులు; వైష్ణవ = విష్ణుభక్తులు అనెడి; సాగర = సముద్రము నకు; హిమకర = చంద్రునివంటివాడా {హిమకరుడు – చల్లదనము ఇచ్చు వాడు, చంద్రుడు}; కృష్ణా = కృష్ణా; పాషండ = నాస్తికులయొక్క; ధర్మ = ఆచారము లనెడు; గృహ = ఇంటికి; దావాగ్ని = కార్చిచ్చువంటివాడా, కృష్ణా.

భావము:- కృష్ణా! నీవు సాక్షాత్తూ విష్ణుమూర్తివి; రాక్షసులను సంహరించ డానికి అవతరించావు; వృష్ణి కులము అనే తామరపూవును వికసింప జేసే సూర్యుడవు నీవు; బ్రాహ్మణులు, దేవతలు, గోవులు, విష్ణుభక్తులు అనే పాల సముద్రంలో ప్రభవించి వారిని సంతోషింప జేసి చల్లగా చూసే చంద్రుడవు నీవు; ఈ అవతారంలో ప్రత్యేకంగా వేదాలకు విరుద్ధమైన పాషండధర్మం అనే ఇంటిని దహించే అగ్నిహోత్రుడవు.

## పులినంబునకు తిరిగివచ్చుట

10.1-580-వ.

**దేవా! నీకుఁగల్పపర్యంతంబు నమస్కరించెద"నని**
**యివ్విధంబున సంస్తుతించి ముమ్మాఱు వలగొని**
**పాదంబులపైఁ బడి వీడ్కొని బ్రహ్మ తన నెలవునకుం జనియె;**
**నతని మన్నించి భగవంతుండైన హరి తొల్లి చెడి తిరిగి వచ్చిన**
**వత్స బాలకులం గ్రమ్మఱం గైకొని పులినంబుకడఁ జేర్చె; నిట్లు.**

టీక:- దేవా = కృష్ణా {దేవుడు – తనంతటతను వెలుగువాడు, విష్ణువు}; నీకున్; కల్ప = ఈకల్పము; పర్యంతము = అంతమై ప్రళయము వరకు; నమస్కరిం చెదను = నమస్కారము చేసెదను; అని = అని; ఈ = ఈ; విధంబునన్ =

రీతిగా; సంస్తుతించి = గట్టిగా స్తోత్రముచేసి; ముమ్మాఱు = మూడు సార్లు; వలగొని = ప్రదక్షిణముచేసి; పాదంబుల్ = కాళ్ళ; పైన్ = మీద; పడి = మ్రొక్కి; వీడ్కొని = సెలవు తీసుకొని; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; తన = తనయొక్క; సెలవున్ = నివాసమున; కున్ = కు; చనియెన్ = వెళ్ళిపోయెను; మన్నించి = ఆదరించి; భగవంతుండు = కృష్ణు {భగవంతుడు -షడ్గుణైశ్వర్యముల (మహత్వ ధైర్య యశో శ్రీ జ్ఞాన వైరాగ్యములు అనెడి ఐశ్వర్యములు)తో సంపన్నుండు (సమృద్ధిగా కల వాడు), విష్ణువు}; ఐన = అయినట్టి; హరి = కృష్ణుడు {హరి - భక్తుల పాపములను హరించువాడు, విష్ణువు}; తొల్లి = ఇంతకుముందు; చెడి = కనబడకుండపోయి; తిరిగి = వెనుకకు; వచ్చిన = వచ్చినట్టి; వత్స = దూడలు; బాలకుల్ = బాలురను; క్రమ్మఱన్ = మరల; కైకొని = స్వీకరించి; పులినంబు = ఇసుకదిబ్బ (ముందు చల్దులు తిన కూర్చున్న స్థలము); కడన్ = వద్దకు; చేర్చెన్ = చేర్చెను; ఇట్లు = ఈ విధముగ.

భావము:- ఓ భగవంతుడా! నా ఆయుర్దాయం ఈ కల్పాంతం వరకూ ఉంది కదా. అంత వరకూ నీకు నమస్కరిస్తూనే ఉంటాను.” అని స్తుతించి బ్రహ్మదేవుడు మూడుసార్లు కృష్ణుడికి ప్రదక్షిణం చేసి, పాదాలకు మ్రొక్కి, సెలవు తీసుకుని తన సత్యలోకానికి వెళ్ళిపోయాడు. కృష్ణుడు అతనిని క్షమించి గౌరవించాడు. ఇంతకు ముందు మాయమై తిరిగి వచ్చిన దూడలను, బాలకులను మళ్ళీ ఇసుక తిన్నెల వద్దకు చేర్చాడు.ఈ విధముగా. . .

10.1-581-క.

క్రించు దనంబున విధి దము
వంచించిన యేఁడు గోపవరనందను లో
క్కించుక కాలంబుగ నీ
క్షించిరి రాజేంద్ర! బాలకృష్ణుని మాయన్.

టీక:- క్రించుదనంబునన్ = అల్పత్వముతో; విధి = బ్రహ్మదేవుడు; తమున్ = తమను; వంచించిన = మోసపుచ్చిన; ఏడు = సంవత్సరకాలము; గోప = యాదవ; వర = శ్రేష్ఠుల; నందనులు = కుమారులు; ఒక్కించుక = చాలాకొద్ది; కాలంబు = కాలము; కన్ = ఐనట్లు; ఈక్షించిరి = చూచిరి, భావించిరి; రాజేంద్ర = మహారాజా {రాజేంద్రుడు - రాజులలో ఇంద్రుని వంటివాడు, మహారాజు}; బాలకృష్ణుని = చిన్నికృష్ణుని; మాయన్ = మహిమవలన.

భావము:- మహారాజా! ఈవిధంగా బ్రహ్మదేవుడు అల్పత్వంతో మోసగించి తమను దాచిపెట్టిన ఏడాది కాలాన్ని కృష్ణుని మాయ కారణంగా గోపబాలకులు కొద్దిసేపుగా భావించారు.

10.1-582-ఆ.

ఏ మహాత్ము మాయ నీ విశ్వమంతయు
మోహితాత్మక మయి మునిగి యుండు
నట్టి విష్ణుమాయ నర్భకు లొక్క యేఁ
డెఱుఁగ కుండి రనుట యేమి పెఱుఁగు?

టీక:- ఏ = ఏ; మహాత్ము = మహిమ గలవాని; మాయన్ = మహిమత్వముచేత; ఈ = ఈయొక్క; విశ్వము = జగత్తు; అంతయున్ = సమస్తమును; మోహిత = మోహము చెందిన; ఆత్మకము = ఆత్మ కలది; అయి = అయ్యి; మునిగి =మగ్నం అయి, ఓలలాడి; ఉండున్ = ఉండును; అట్టి = అటువంటి; విష్ణు = కృష్ణునియొక్క {విష్ణువు - విశ్వమంత వ్యాపించి ఉండువాడు, హరి}; మాయన్ = మాయ వలన; అర్భకులు = చిన్నపిల్లలు; ఒక్క = ఒకే ఒక; ఏడున్ = సంవత్సరము; ఎఱుగక = కలదని తెలియక; ఉండిరి = ఉన్నారు; అనుట = అని చెప్పట; ఏమి = ఏమి; పెఱగు = వింత.

భావము:- మొత్తం విశ్వమంతా మహాత్ముడైన విష్ణుదేవుడి మాయ వలన మోహంలో మునిగిపోయి ఉంటుంది. అంతటి విష్ణుమాయ వలన గోపబాలకులు ఏడాది కాలాన్ని తెలుసుకోలేక పోడంలో ఆశ్చర్యం ఏముంది?

10.1-583-వ.

**అప్పుడు.**

టీక:- అప్పుడు = ఆ తరువాత.

భావము:- బ్రహ్మదేవుడి మాయా గుహనుండి పులినతలానికి కృష్ణబాలుడు తీసుకువచ్చిన సమయంలో. . .

10.1-584-మ.

**“చెలికాఁడా! యరుదెంచితేయిచటికిన్? క్షేమంబునం గ్రేపులున్**
**సెలవుల్ జేరె నరణ్యభూమివలనన్ నీ వచ్చునం దాకఁ జ**
**ల్దులు వీరించుకయెవ్వరుంగుడువ; రాలోకింపు; ర”మ్మంచు నా**
**జలజాక్షుండునగన్ భుజించిరచటన్ సంభాషలన్డింభకుల్.**

టీక:- చెలికాడా = స్నేహితుడా; అరుదెంచితే = వచ్చితివా; ఇచటికిన్ = ఇక్కడికి; క్షేమంబునన్ = కులాసాగా;క్రేపులున్ = దూడలును; సెలవుల్ = వాటి స్థానములకు; చేరెన్ = తిరిగి వచ్చినవి; అరణ్య = అటవీ; భూమి = ప్రాంతము; వలనన్ = నుండి; నీవు = నీవు; వచ్చున్ = వచ్చెడి; అందాక = వరకు; చల్దులు = చల్దిభోజనములు; వీరు = వీరందరు; ఇంచుకన్ = కొంచెముకూడ; ఎవ్వరున్ = ఏ ఒక్కరు; కుడువరు = తినలేదు; ఆలోకింపుము = చూడుము; రమ్ము = రా; అంచున్ = అనుచు; ఆ = ఆయొక్క; జలజాక్షుండు = పద్మాక్షుడు, కృష్ణుడు; నగన్ = నవ్వుతుండగా; భుజించిరి = తినిరి; సంభాషలన్ = కబుర్లుచెప్ప కొంటు; డింభకుల్ = బాలురు.

భావము:- (ఇసుకతిన్నెల మీద కూర్చుని చల్దులు తింటూ అర్థాంతరంగా ఆపు చేసిన గోపబాలురు కృష్ణుని చూసి ఇలా అన్నారు.) "చెలికాడా! వచ్చావా? ఇదిగో లేగదూడలు అరణ్య మధ్యం నుండి ఇప్పుడే తిరిగి వచ్చేసాయి. నీవు తిరిగివచ్చే వరకూ మాలో ఎవరమూ చల్దులు తినలేదు. చూడు. త్వరగారా! తిందాము." అని పిలిచారు కృష్ణుడు నవ్వుతూ వచ్చి వారి మధ్యలో కూర్చోగానే అందరూ కబుర్లు చెప్పుకుంటూ చల్దులు తిన్నారు.

10.1-585-వ.

**ఇట్లు బాలకులతోడఁ జల్ది గుడిచి వారలకు నజగర**

**చర్మంబు చూపుచు వనంబున నుండి తిరిగి.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; బాలకుల్ = పిల్లల; తోడన్ = తోటి; చల్ది = చద్దన్నములు; కుడిచి = తిని; వారల్ = వారి; కున్ = కి; అజగర = కొండచిలువ; చర్మంబు = కళేబరమును; చూపుచున్ = చూపించుచు; వనంబున్ = అడవి; నుండి = నుండి; తిరిగి = మరలి.

భావము:- అలా కృష్ణుడు వారితో చల్దులు తిని వనంలో నుండి తిరిగి వస్తుంటే, వారికి కొండచిలువ చర్మం చూపాడు.

10.1-586-పంచ.

**ప్రసన్నపింఛమాలికా ప్రభావిచిత్రితాంగుఁడుం**

**బ్రసిద్ధ శృంగ వేణునాద పాశబద్ధ లోకుఁడుం**

**బ్రసన్న గోప బాలగీత బాహువీర్యుఁ డయ్యు ను**

**ల్లసించి యేగె గోపకుల్ జెలంగి చూడ మందకున్.**

టీక:- ప్రసన్న = నిర్మలమైన, మనోహరమైన; పింఛ = నెమలి పింఛముల; మాలికా = వనమాలల; ప్రభా = కాంతులచే; విచిత్రిత = అలంకరింపబడిన; అంగుండున్ = దేహము కలవాడు; ప్రసిద్ధ = ఖ్యాతికెక్కిన; శృంగ = కొమ్ము;

వేణు = మురళీ; నాద = ధ్వను లసెడి; పాశబద్ధ = తాళ్ళచే కట్టివేయబడిన; లోకుండున్ = లోకులు కలవాడు; ప్రసన్న = సంతోషించిన; గోప = గొల్ల; బాల = పిల్లలు; గీత = కీర్తించెడి; బాహువీర్యుడు = భుజబలము గలవాడు; అయ్యున్ = అయ్యి; ఉల్లసించి = సంతోషించి; ఏగెన్ = వెళ్ళెను; గోపకుల్ = యాదవులు; చెలంగి = చెలరేగి; చూడన్ = చూచుచుండగా; మందకున్ = మంద విడిచిన చోటికి.

భావము:- శ్రీ కృష్ణుడు తలలో అడవిపూలు నెమలిపింఛము ధరించాడు. వాటి రంగురంగుల కాంతులు అంతటా ప్రసరించి అతని శరీరభాగాలను అలంకరిస్తున్నాయి. కృష్ణుని కొమ్ముబూర మోత, అతని వేణుగానం అందరికీ పరిచయమైనవి. అవి వినపడగానే లోకమంతా పరవశం చెంది ఆకర్షించబడుతుంది. గోపబాలురు సంతోషంతో అతని బాహుబలాన్ని స్తోత్రం చేసారు. కృష్ణుడు గోపబాలురతో కూడి ఉల్లాసంతో మందకు చేరుకుంటూ ఉంటే గోపకు లందరూ సంతోషంతో వారిని ఆదరించారు.

10.1-587-వ.

ఆ సమయంబున.

టీక:- ఆ = ఆ; సమయంబునన్ = సమయమునందు.

భావము:- అప్పుడు

10.1-588-క.

పెనుఁబాము దమ్ము ద్రింగిన
మన నందసుతుండు పాము మర్దించి మమున్
మనిచె నరణ్యములోపల
నని ఘోషించిరి కుమారు లా ఘోషములోన్."

టీక:- పెను = పెద్ద; పాము = సర్పము; తమ్మున్ = తమను; ఖ్రింగినన్ = మింగివేయగా; మన; నంద = నందుని; సుతుండు = పుత్రుడు; పామున్ = సర్పమును; మర్దించి =చితగ్గొట్టి; మమున్ =మమ్ములను; మనిచెన్ = కాపాడెను; అరణ్యము = అడవి; లోపలన్ = అందు; అని = అని; ఘోషించిరి = చాటించిరి; కుమారులు = బాలకులు; ఆ = ఆ; ఘోషము = గొల్లపల్లె; లోన్ = అందు.

భావము:- బాలకులు గోకులంలో అడుగు పెడుతూనే అందరికీ వినిపించేటట్లు కేకలు వేస్తూ "మన నందగోపకుమారుడు అడవిలో ఒక పెద్ద పామును చంపి మమ్మల్ని అందరిని రక్షించాడు" అని చాటి చెప్పారు."

10.1-589-వ.

## అనిన విని నరేంద్రుం డిట్లనియె

టీక:- అనినన్ = అనగా; విని = విని; నరేంద్రుడు = రాజు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- శుకయోగి అలా చెప్పగానే పరీక్షన్మహారాజు ఇలా అన్నాడు.

## కృష్ణుడు అత్మీయు డగుట

10.1-590-క.

**"కని మనిచి యెత్తి పెంచిన**

**తనుజన్ములకంటె నందతనయుం డా ఘో**

**షనివాసులకు మనోరం**

**జనుఁ డెట్లయ్యెను? బుధేంద్ర! చను సెఱిఁగింపన్."**

టీక:- కని = ప్రసవించి; మనిచి = పోషించి; ఎత్తి = ఎత్తుకొని; పెంచిన = పెద్దచేసిన; తనుజన్ముల = స్వంతపిల్లల; కంటెన్ = కంటెను; నంద =

నందుని; తనయుండు = పుత్రుడు; ఆ = ఆయొక్క; ఘోష = గొల్లపల్లె; నివాసుల్ = ప్రజల; కున్ = కు; మనోరంజనుడు = ఇష్టుడు {మనోరంజ నుడు - మనసును రంజింప చేయువాడు, ఇష్టుడు}; బుధ = జ్ఞానులలో; ఇంద్ర = శ్రేష్ఠుడా; చనున్ = తగును; ఎఱిగింపన్ = తెలియజేయ.

భావము:- "ఓ శుక మునీంద్రా! గోకులం లోని వారికి తాము కని పెంచిన తమ బిడ్డల కన్నా కృష్ణుడు ప్రేమపాత్రుడు ఎలా అయ్యాడు? నీవు జ్ఞానులలో శ్రేష్ఠుడవు ఇది వివరించడం నీకే సాధ్యపడుతుంది."

10.1-591-వ.

**అనిన శుకుం డిట్లనియె.**

టీక:- అనినన్ = అనగా; శుకుండు; ఇట్లు; అనియె = పలికెను.

భావము:-అలాఅడిగిన పరీక్షన్మహారాజునకు శుకమహర్షి ఇలా చెప్పసాగాడు.

10.1-592-సీ.

**"అఖిల జంతువులకు నాత్మవల్లభమైన-**
**భంగి బిడ్డలు నిండ్లుఁ బసిఁడి మొదలు**
**వస్తువు లెవ్వియు వల్లభంబులు గావు-**
**సకలాత్మకుండైన జలజనేత్రు**
**డఖిల జంతువులకు నాత్మ గావున ఘోష-**
**వాసుల కెల్లను వల్లభత్వ**
**మున మిక్కిలొప్పెను మూడులోకములకు-**
**హితము చేయఁగ జలజేక్షణుండు**

**10.1-592.1-ఆ.**

**మాయతోడ మూర్తిమంతుడై యొప్పారు;**

**గలఁ డతండు నిఖిల గణము లందు**

**భవతిధాతు వెట్లు భావార్థమై సర్వ**

**ధాతు గణమునందుఁ దనరు నట్లు.**

**టీక:-** అఖిల = సమస్తమైన; జంతువుల = ప్రాణుల; కున్ = కు; ఆత్మ = ఆత్మ; వల్లభము = అతిప్రియమైనది; ఐన = అయినట్టి; భంగిన్ = విధముగా; బిడ్డలున్ = పిల్లలు; ఇండ్లు = నివాసములు; పసిడి = బంగారము; మొదలు = మొదలగు; వస్తువులు = వస్తువులు; ఎవ్వియున్ = ఏవికూడ; వల్లభంబులు = ప్రియతరములు; కావు = కావు; సకల = సమస్తమును; ఆత్మకుండు = తన రూపముగకలవాడు; ఐన = అయినట్టి; జలజనేత్రుడు = కృష్ణుడు {జలజ నేత్రుడు - జలజము (పద్మము)ల వంటి నేత్రుడు (కళ్ళు కల వాడు), విష్ణువు};

మాయ = ప్రకృతి; తోడన్ = తోకూడి; మూర్తిమంతుడు = దేహధారి; ఐ; ఒప్పారు = అతిశయించును; కలడు = ఉన్నాడు; అతండు = అతను; నిఖిల = ఎల్ల; గణములు = జీవజాలము; అందున్ = లోను; భవతిధాతువు = భూ ధాతువు (సంస్కృతమున); ఎట్లు = ఎలా ఐతే; భావ = క్రియావాచ్యమైన; అర్థము = అర్థముకలది; ఐ = అయ్యి; సర్వ = సమస్తమైన {ధాతుగణము - భ్వాది, అదాది, జుహోత్యాది దివాది సునోత్యాది తుదాది రుధాది తనోత్యాది క్ర్యాది చురాది}; ధాతు = ధాతువుల; గణమున్ = సమూహమున; అందున్ = కును; తనరు = అతిశయించును; అట్లు = ఆ విధముగనే.

**భావము:-** జీవరాసులు అన్నింటికి “తనకు తాను ఇష్టమైనంత” బిడ్డలు గాని, ఇండ్లు గాని, బంగారం మొదలైన వస్తువులు గాని ప్రియమైనవి కావు. అన్నిటి యందు ఆత్మగా ఉన్న విష్ణువు అన్ని జీవరాసులలో

“ఆత్మస్వరూపుడుగా” ఉన్నాడు. కనుకనే గోకుల నివాసులకు అందరికి ప్రియుడై చక్కగా ప్రకాశిస్తూ ఉన్నాడు. పద్మముల వంటి కన్నులు ఉన్న విష్ణుమూర్తి మాయతో కూడిన రూపం ధరించి ప్రకాశిస్తున్నాడు. ఇదంతా మూడు లోకాలకూ మేలు చేయడానికే. క్రియలను తెలిపే అన్ని ధాతువులకూ “భవతి” అనే ధాతువు భావంగా అంతర్లీనమై ఉంటుంది. అలాగే చరాచర సృష్టి లోని అన్నిటి యందూ విష్ణువు ఉన్నాడు.

10.1-593-క.

**శ్రీపతి పదమను నావను**

**బ్రాపించి భవాబ్ధి వత్సపదముగ ధీరుల్**

**రూపించి దాఁటి చేరుదు**

**రాపత్పద రహితు లగుచు నమృతపదంబున్.**

టీక:- శ్రీపతి = శ్రీవిష్ణుమూర్తియొక్క; పదము = పాదాశ్రయము; అను = అనెడి; నావను = పడవను; ప్రాపించి =పొంది; భవ = సంసార, జన్మాది; అబ్ధి = సాగరమును; వత్స = దూడయొక్క; పదము = గిట్టల ముద్ర; కన్ = ఐనట్లు; ధీరుల్ = ఆత్మజ్ఞాన సంపన్నులు; రూపించి = రూఢి చేసుకుని, నిశ్చయించుకొని; దాటి = తరించి; చేరుదురు = చెందెదరు; ఆపత్ = సకల దుఃఖములకు; పద = స్థానమైన అజ్ఞానము; రహితులు = విడువబడినవారు; అగుచున్ = అగుచు; అమృత = మరణములేని, ముక్తి; పదంబున్ = స్థానమును.

భావము:- బుద్ధిమంతు లైనవారు శ్రీహరి పాదము అనే నావను ఆధారంగా చేసుకుని సంసారం అనే సముద్రాన్ని, ఒక లేగదూడ అడుగును అంగవేసి దాటినంత తేలికగా దాటి ఆపద అనే స్థితిని పొందకుండా, అమృత స్థితిని చేరుకుంటారు.

10.1-594-ఆ.

**అఘుని( జంపి కృష్ణు( డాప్తులు దానును**

**జల్ది గుడిచి జలజసంభవునకు(**

**జిద్విలాసమైన చెలువు( జూపిన కథ(**

**జదువ వినిన( గోర్కి సంభవించు.**

టీక:- అఘుని = అఘాసురుని; చంపి = సంహరించి; కృష్ణుడు = శ్రీకృష్ణుడు; ఆప్తులున్ = తనకు కావలసినవారు; తానునున్ = అతను; చల్ది = చద్దన్నములు; కుడిచి = తిని; జలజసంభవున్ = బ్రహ్మదేవుని; కున్ = కి; చిత్ = ప్రజ్ఞాస్వరూపమైన తన; విలాసము = లీలావిలాసము; ఐన = అయినట్టి; చెలువున్ = చక్కదనమును; చూపిన = చూపినట్టి; కథన్ = వృత్తాంతమును; చదువన్ = చదువుటవలన; వినినన్ = వినుట వలన; కోర్కి = వారియొక్క కోరిక; సంభవించు = తీరును.

భావము:- శ్రీ కృష్ణుడు అఘాసురుని సంహరించడం ఆప్తులైన గోపబాలుర తోకూడి చల్దిఅన్నం ఆరగించడం బ్రహ్మకు తానే అన్నిటి యందూ అన్ని రూపాలలో ఉండటం అనే తన లీలలు చూపడం మొదలుగా గల ఈ కథను ఎవరు చదివినా ఎవరు విన్నా వారు కోరిన కోరిక తీరుతుంది."

10.1-595-వ.

**అని చెప్పి మఱియు వ్యాసనందనుం డిట్లనియె**

టీక:- అని; చెప్పి = తెలిపి; మఱియున్ = ఇంకను; వ్యాసనందనుండు = శుకుడు {వ్యాసనందనుడు - వ్యాసునియొక్క కొడుకు, శుకమహర్షి}.

భావము:- ఇలా చెప్పి వ్యాసుని కుమారుడైన శుకయోగి ఇంకా ఇలా అన్నాడు.

10.1-596-క.

**రాగంబున బలకృష్ణులు**

**పొగండవయస్కు లగుచుఁ బశుపాలకతా**

**యోగంబున బృందావన**

**భాగంబునఁ గాఁచి రంతఁ బశువుల నధిపా!**

టీక:- రాగంబునన్ = ఆత్మీయతతో; బల = బలరాముడు; కృష్ణులు = కృష్ణులు; పొగండ వయస్కులు = పొగండావస్థ చేరువారు; అగుచున్ = ఔతూ; పశుపాలకతా = పశువులను పాలించుట అనెడి; యోగంబునన్ = యోగ వృత్తితో; బృందావన = బృందావనముయొక్క; భాగంబునన్ = వాటిక యందు; కాచిరి = మేపిరి; అంతన్ = అప్పుడు; పశువులన్ = గోవులను; అధిపా = రాజా.

భావము:- "బలరామకృష్ణులు ఈవిధంగా పొగండ వయస్సు గల వారై అనురక్తితో పశువులను మేపుతూ గోపబాలురుతో కలసి బృందావనంలో విహరించారు.



## పూర్తి

10.1-1790-క. *

**కువలయరక్షాతత్పర!**

**కువలయదళ నీలవర్ణ కోమలదేహా!**

**కువలయనాథ శిరోమణి!**

**కువలయజన వినుత విమలగుణ సంఘాతా!**

టీక:- కువలయరక్షాతత్పర = శ్రీరామా {కువలయ రక్షా తత్పరుడు – కు (భూమి) వలయ (మండలమును) రక్షా (కాపాడుట యందు) తత్పరుడు (ఆసక్తి కలవాడు), శ్రీరాముడు}; కువలయదళనీలవర్ణకోమలదేహా = శ్రీరామా {కువలయ దళ నీలవర్ణ కోమల దేహుడు – కువలయ (నల్లకలువ) యొక్క దళ (రేకులవంటి) వర్ణ (రంగు కలిగిన) కోమల (మృదువైన) దేహుడు (శరీరము కలవాడు), శ్రీరాముడు}; కువలయనాథశిరోమణి = శ్రీరామా {కువలయనాథ శిరోమణి – కు (భూమి) వలయ(మండలమును) నాథ (ఏలువారిలో) శిరోమణి (తలమీది మణివలె శ్రేష్ఠమైన వాడు), శ్రీరాముడు}; కువలయజన వినుత = శ్రీరామా {కువలయజన వినుత – కువలయ (భూమండలము యొక్క) జన (సర్వ ప్రజలచేత) వినుత (స్తుతింపబడువాడు), శ్రీరాముడ}; విమలగుణసంఘాతా = శ్రీరామా {విమల గుణ సంఘాతుడు – విమల (స్వచ్ఛమైన) గుణ (సుగుణముల) సంఘాత (సమూహములు కలవాడు), శ్రీరాముడు}.

భావము:- భూమండలాన్ని రక్షించటంలో ఆసక్తి కలవాడా! కలువ రేకుల వంటి నల్లని కాంతితో విరాజిల్లే మృదువైన దేహం కలవాడా! భూమండలంలోని భూపతు లందరికి శిరోభూషణ మైన వాడా! పుడమి మీదనుండే జనులందరిచే పొగడబడే సుగుణాల సమూహం కలవాడా! శ్రీ రామచంద్ర ప్రభో! నీకు వందనం.

ఈ శ్రీరాముని ప్రార్థనలోని చమత్కర మాధుర్యం తొణికిసలాడుతోంది. కువలయ అని నాలుగు పాదాలు ఆరంభిస్తు లోకం, కలువలు, రాజులు, మానవులు అని నాలుగు రకాల అర్థభేదంతో యమకం పండించిన తీరు అద్భుతం. రెండు గాని అంతకంటె ఎక్కువ అక్షరాలు ఉన్న పదాలు, అర్థభేదం కలిగి, మరల మరల వస్తూ ఉంటే యమకాలంకారం.

10.1-1791-మాలి. *

**సరసిజనిభ హస్తా! సర్వలోక ప్రశస్తా!**
**నిరుపమ శుభమూర్తీ! నిర్మలారూఢ కీర్తీ!**
**పరహృదయ విదారీ! భక్తలోకోపకారీ!**
**గురు బుధజన తోషీ! ఘోరదైతేయ శోషీ!**

**టీక:-** సరసిజనిభహస్తా = శ్రీరామా {సరసిజనిభహస్తుడు - సరసిజ (పద్మము) నిభ (వంటి) హస్తుడు (అరచేతులు కలవాడు), శ్రీరాముడు}; సర్వలోకప్రశస్తా = శ్రీరామా {సర్వలోకప్రశస్తుడు - సర్వ (సమస్తమైన) లోక (లోకములలోను) ప్రశస్తుడు (శ్లాఘింపబడువాడు), శ్రీరాముడు}; నిరుపమ శుభమూర్తీ = శ్రీరామా {నిరుపమశుభ మూర్తి - నిరుపమ (సాటిలేని) శుభ (మేళ్ళు కలిగించెడి) మూర్తి (ఆకృతి కలవాడు), శ్రీరాముడు}; నిర్మలారూఢ కీర్తీ = శ్రీరామా {నిర్మలారూఢకీర్తి - నిర్మల (పరిశుద్ధమైన) ఆరూఢ (నిలకడైన) కీర్తి (కీర్తి కలవాడు), శ్రీరాముడు}; పరహృదయవిదారీ = శ్రీరామా {పరహృదయవిదారి - పర (విరోధుల) హృదయ (గుండెలను) విదారి (చీల్చెడి వాడు), శ్రీరాముడు}; భక్తలోకోపకారీ = శ్రీరామా {భక్తలోకోపకారి - భక్తులను లోక (ఎల్లరకు) ఉపకారి (ఉపకారము చేయువాడు), శ్రీరాముడు}; గురుబుధజనతోషీ = శ్రీరామా {గురుబుధజనతోషి - గురు (గొప్ప) బుధ (జ్ఞానము కల) జన (వారికి) తోషి (సంతోషము కలిగించు వాడు), శ్రీరాముడు}; ఘోరదైతేయశోషీ = శ్రీరామా {ఘోరదైతేయశోషి - ఘోర (క్రూరమైన) దైతేయ(రాక్షసులను) శోషి (నశింపజేయు వాడు), శ్రీరాముడు}.

**భావము:-** పద్మాల వంటి హస్తములు కలవాడా! ఎల్లలోకాలలోను శ్రేష్ఠతమమైన వాడా! సాటిలేని మంగళ స్వరూపము కలవాడా! స్వచ్ఛమైన వన్నెకెక్కిన కీర్తి కలవాడా! శత్రువుల గుండెలను ఖండించు వాడా! భక్త

**సమూహానికి మేలు చేయువాడా! పెద్దలను, పండితులను సంతోషపరచేవాడా! భయంకరులైన రక్కసులను నాశనము చేయువాడా! శ్రీరామచంద్రప్రభూ! వందనములు.**

**10.1-1792-గ.**

**ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతం బయిన శ్రీమహా భాగతం బను మహాపురాణంబు నందు దశమ స్కంధంబు లోని బృందావనగమనంబును; వత్స పాలనంబును; వత్సాసుర వధయును; బకదనుజ విదారణంబు; నఘాసురమరణంబును; వత్సాపహరణంబును; నూతన వత్స బాలక కల్పనంబును; బ్రహ్మ వినుతియు; గో పాలకత్వంబును; గార్ధభాసుర దమనం బును; కాళియఫణి మర్దనంబును; గరుడకాళియనాగవిరోధ కథనం బును; బ్రలంబాసుర హింసనంబును; దవానల పానం బును; యను కథలు(గల శ్రీకృష్ణలీలలు మూడవ భాగము సమాప్తము.**

**టీక:-** ఇది = ఇది; శ్రీ = సంపత్కరమైన; పరమేశ్వర = భగవంతుని; కరుణా = దయతో; కలిత = జన్మించిన; కవితా = కవిత్వము చెప్పుటలో; విచిత్ర = అద్భుతమైనవాడు; కేసనమంత్రి = కేసనమంత్రి; పుత్ర = కుమారుడు; సహజ = సహజసిద్ధముగ; పాండిత్య = పాండిత్యము కలవాడు; పోతన = పోతన; అమాత్య = మంత్రిచేత; ప్రణీతంబు = చెప్పబడినది; అయిన = ఐన; శ్రీ = గొప్ప దైన; మహాభాగవతము = మహాభాగవతము; అను = అనెడి; మహా = గొప్ప; పురాణంబున్ = పురాణము; అందున్ = లోని; ; బృందావన = బృందావనము నకు; గమనంబును = వెళ్ళుట; వత్స = దూడలను; పాలనంబు = మేపుట; వత్స

= వత్స ఆకృతిని వచ్చిన; అసుర = రాక్షసుని; వధయును = చంపుట; బక = బకుడు అను; దనుజ = రాక్షసుని; విదారణంబును = చంపుట; అఘాసుర = అఘాసురుని యొక్క; మరణంబును = చావు; గో = ఆవులను; పాలకత్వంబును = పాలించుట; గార్ధభాసురున్ = గార్ధభరాక్షసుని; దమనం బును = శిక్షి ంచుట; కాళియ = కాళియుడను; ఫణి = పాము; మర్ధనంబును = మర్ధించుట; గరుడ = గరుడుడు; కాళియు = కాళీయుడను; నాగ = సర్పము; విరోధ = శత్రుత్వము యొక్క; కథనంబును = కథ; ప్రలంబ = ప్రలంబుడను; అసుర = రాక్షసుని; హింసనంబును =చంపుట; దవానల =కార్చిచ్చును; పానంబును = తాగివేయుట; అను = అనెడి; కథలు = కథలు; కల = కలిగిన; శ్రీకృష్ణ లీలలు మూడవ (3) భాగము = శ్రీకృష్ణ లీలలు మూడవ (3) భాగము. సమాప్తము = పూర్తి అగుట

భావము:- ఇది సంపత్కరమైన భగవంతుని దయతో జనించిన అద్భుత కవితా నిపుణుడు, కేసనమంత్రి పుత్రుడు, సహజ సిద్ధ పాండిత్య ప్రావీణుడు ఐన పోతనామాత్యునిచేత చెప్పబడిన శ్రీ మహాభాగవతము అనెడి గొప్ప పురాణములోని దశమస్కంధము నందలి, బృందావనమునకు వెళ్ళుట; దూడలను మేపుట; వత్సాసుర వధ; బకాసురుని చంపుట; అఘాసురుని యొక్క చావు; వత్సా గోపబాలకుల అపహరణము అనెడి కథలు కలిగిన శ్రీకృష్ణ లీలలు మూడవ (3) భాగము సుసంపూర్ణము.

ఓం నమో భగవతే వాసుదేవాయ!!

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే

పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే

ఓం! ఓం! ఓం!

ఓం! శాంతిః! శాంతిః! శాంతిః!

సర్వే జనా స్సుఖినో భవతు!!

---------x---------